

# ఫెమినా వంటసామాగ్రి నా సమయం మరియు పని సమస్యను తీర్చివేసింది

## ఫెమినా
## వంట సామాగ్రి
### ఆధారపడదగ్గ సులభమైన వంట సహాయకారి

ఎంత చేసినా తరగనట్లుండే వంటపని మరియు పరిమితమైన సమయం ఫెమినా ఈ రెండింటిమధ్య దూరాన్ని తొలగించింది ఇపుడు ఇక చపాతీలు, పుల్కాలుగాని పూరీలుగాని నిమిషాలలో పని.... అతిధులకు తరచుగా రుచికరమైన కాఫీలుగాని పండ్లరసాలుగాని సెకండ్లలో ...

ఫెమినా వంటసామగ్రి తీరికలేని భారతీయ గృహిణికోసం ప్రత్యేకంగా తయారు చేయబడినవి.

అవి భారతదేశపు అన్నిప్రాంతాల వంటరుచులను ఇంటిలో సంతృప్తి పరుస్తాయి.








ఆంధ్ర ప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు PH 221198/34819

**మహావీర్** ఎంటర్ ప్రైజెస్, తిలక్ రోడ్, హైద్రాబాద్-1

## ముఖచిత్రం

సుహాసిని ముఖచిత్రం అప్పుడే విచ్చుకున్న ఎర్రగులాబీలా అత్యంత రమ్యంగా ఉండి పాఠకుల్ని అయస్కాంతంలా ఆకర్షించింది

కె రాజేంద్ర, రమ్య, మహబూబాబాద్

* * *

'అమితాబ్ బచ్చన్' ముఖచిత్రం వేయవలెనని మా యొక్క కోరిక ఆకాంక్షిస్తున్నాం

ఆరిఫ్, ఇల్లెందు

## కర్మయోగి

ఉత్కంఠనుకాక, జిజ్ఞాసను, ఆలోచనను రేకెత్తించే 'కర్మయోగి' లాంటి ఆధ్యాత్మిక నవలను వ్రాయటానికి మనోపరిపక్వత, ఆత్మ నిగ్రహం అవసరం అటువంటి నవలలను ప్రచురించటానికి అభిరుచి ధైర్య సాహసాలతో పాటు 'కమిట్‌మెంటు' కూడా అవసరం రచయిత్రి డాక్టర్ కె వి కృష్ణకుమారిగారికి అభినందనీయులు

కప్పగంతుల మల్లికార్జునరావు,
రాజమండ్రి

* * *

గత పదిహేడు సంవత్సరములుగ నేను మన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చదువుతున్నాను డా॥ కె వి కృష్ణకుమారిగారి 'కర్మయోగి' సీరియల్ ఆధ్యాత్మికంగా నన్నెంతో ఉత్తేజపరచి, మనసులో శతకోటి భావాతీత ఆనందసుధలు కురిపిస్తోంది రచయిత్రికి కృతజ్ఞతలు

నర్రా రాజేంద్రప్రసాద్,
కోయంబత్తూరు

# ఉత్తరాలు

## అచ్చిరాని చదువులు

'అచ్చిరాని చదువులు' అనే కథ నన్ను ఎంతగానో ఆకట్టుకొంది ఆ కథలో వాడిన పదజాలము—కథా పటుత్వము- సత్యవతి పాత్ర యొక్క విశిష్టత—ఔన్నత్యము ముఖ్యంగా కథ చివరలో సత్యవతి యొక్క మరణము—ఆ మరణంలో కూడా ఎంతో త్యాగము నన్ను ఎంతో ఆకట్టుకొని ఆ కథ చదువుతున్నంత సేపు నన్ను నేను మర్చిపోయానంటే నమ్మండి ఇలాంటి ఉత్తమకథ ఈ యువతరం కోసం పునర్ముద్రితం చేసినందుకు మా ధన్యవాదాలు

వెంకటేశ్వర్లు, శ్రీ రాంపూర్ కాలనీ

## న్యూఢిల్లీ లేఖ

''న్యూఢిల్లీ లేఖ'' మమ్మల్నెంతో ఆకర్షిస్తోంది జయదుబాషీగార్కి మా కృతజ్ఞతలు ఈ వారం ప్రచురింపబడ్డ భా జ పా కుట్రలు వ్యాసం బాగుంది అదే విధముగా ''వ్యక్తిగతము'' అనే శీర్షిక కూడా బాగుంది ప్రతి వారం ఒక వ్యక్తి గురించి మాత్రమే వ్రాస్తే బాగుంటుంది అని మా సూచన

చిలకమర్తి వాసు, ఇతరులు,
ఆలమూరు

## ధర్మపథం

శ్రీ బులుసు వేంకట రమణయ్య గారి ''మొదట గురువు'' ను గురించిన విషయాలను చదివి ప్రతివారు తెలుసుకొన వలసిన విషయం—

పిల్లల పెంపకంలో తల్లి యొక్క ప్రధాన పాత్రను గురించి, శ్రీ బులుసు వేంకటరమణయ్య గారు వేలెత్తి చూపారు

ప్రస్తుత కాలములో, ఉద్యోగాలు చేసేటు వంటి తల్లులు, తమ యొక్క బాధ్యతలను విస్మరించి, ఉదయం 9 గంటల కంతా తమ ఆఫీసులకు పోవడం వల్ల, పిల్లలకు తగు సంరక్షణ, పోషణ, చదువు సంధ్యలు లేక, క్రమశిక్షణా రాహిత్యం ఎక్కువగుచున్నది దీనికి ప్రస్తుత విద్యార్థుల యొక్క చర్యలే నిదర్శనం

అందుచేత, యింటిలో, తల్లిదండ్రులు ముఖ్యముగా తల్లి తగు శ్రద్ధ తీసుకొని, వారు తగు చర్య తీసుకొంటే, పాఠశాలలో కూడా ఉపాధ్యాయులు మంచి నీతి బోధన నేర్పించుటకు వీలగుతుంది

యస్ ఘటకాచలరావు, ఖాజీపేట

## అద్భుత వ్యక్తులు

ప్రపంచ ప్రఖ్యాత హస్త ముద్రిక శాస్త్రవేత్త (కీరో) గురించి వ్రాసిన బి వి పట్టాభిరామ్‌గార్కి మా వందనాలు

కౌంట్ లూయీస్ హేమన్ (కీరో) ఆయ గితాన్ని 1936లో చనిపోతూ తన భార్యతో చనిపోయె రాత్రి, 7వ తేది రాత్రి నేను ఈరోజు చనిపోతున్నాను అన్న విషయాన్ని ఒక్కసారి గుర్తుంచుకొంటే — కీరో ఎంత మహావ్యక్తో, ఎంత గొప్పవాడో అర్థం అవుతుంది

యస్ కె హుస్సేన్, ఆర్ శ్రీనివాస్,
హైదరాబాద్

* * *

కీరో పేరును గురించి చాలామంది చాలా రకాలుగా వ్యవహరిస్తుంటారు కొందరు చిరో యని మరికొందరు శీరో యని అంటారు కాని అసలు పేరు కీరో అని ఇపుడు మాకు తెలిసినది ముఖ్యంగా కీరోగారి చివరి రాత్రి యని ఆయనకుతెలువడము ఆయనకు ఆయనేసాటి యని ఆయనే నిరూపించుకున్నారు

జి కృష్ణయ్య, కళావతి, వెలుదండ

* * *

15–6–84 సంచికలో ప్రొ॥ బి వి పట్టాభిరామ్‌గారి ఆర్టికల్ [అద్భుత వ్యక్తులు] అద్భుతంగా ఉంది ఇంద్రజాలమంటే కేవలం ఒక సరదా విద్య అనుకున్నాము కాని దాని వెనుక ఇంత చరిత్ర ఉందా ! అని తలుచుకుంటుంటే మనసు పరవళ్లు తొక్కుతోంది

సి ప్రతాప్ కేరాఫ్ డా॥ సి రాధాకృష్ణమూర్తి,
విశాఖపట్నం

[66వ పేజీ చూడండి]

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభు ప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

శుక్రవారం 27-7-84

శ్రీరక్తాక్షినామ సం ఆషాఢ బ చతుర్దశి

**సంపుటము 76 : సంచిక 46**

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 1-80 |
| ఆరు మాసాల చందా | రు | 46-80 |
| పోస్టులో ఏడాది చందా | రు | 101-40 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



## లోకం పోకడ — ఊమెన్











## విదేశంలో దుబాషీ

# టన్నుల పువ్వులూ - వంటరిజీవితాలూ

### దిహేగ్

హాలాండ్‌లో పత్రికలు భారత దేశంలో జరిగే విశేషాలని గురించి అంతగా పట్టించుకోవు ఆ మాటకొస్తే యూరోపు పత్రికలలో ఎక్కువ బ్రిటీషు పత్రికలనే అనుసరిస్తూ ఉంటాయి ఈ విషయంలో ప్రపంచంలోని వివిధ భాగాలని వివిధ దేశాలకి కేటాయించి వేశారా వీళ్ళు అనిపిస్తుంది-భారత దేశాన్ని బ్రిటన్‌కి కేటాయించారన్నమాట! ఒక డచ్చి (హాలండ్) విదేశాంగ శాఖ- అధికారిని ఇలాగ అడిగాను మాకు స్వరాజ్యం వచ్చి 37 సంవత్సరాలు అవుతోంది ఇంకా బ్రిటన్ ద్వారానే మమ్మల్ని పరిశీలిస్తారెందుకు? అని ఆయన చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు డచ్చి వారు ఇంగ్లీషువారికన్నా ముందే భారత దేశానికి వచ్చారు కాని ఎక్కువకాలం అక్కడ ఉండలేక ఇండొనేసియాకి వెళ్ళిపోయారు శ్రీలంకలో కూడా వారి ప్రభావం బాగా కనపడుతుంది భారత దేశంలో హాలండ్ అవశేషాలు చాలా తక్కువే కాని ఇండొనేసియాలో ఈస్టిండియా ఒకటి ఉంది కదా! హాలాండు రాజధాని అయిన ఆమ్‌స్టర్‌డామ్‌లో నేను ఒక్క భారతీయుల హొటలుని కూడా చూడ లేదు ఇండొనేసియా వాళ్ళవి మాత్రం కావలసి నన్ని ఇండొనేసియావాళ్ళూ ఇక్కడ చాలామందే కనిపిస్తారు వీళ్ళలో ఎక్కువమంది చిన్న ఉద్యోగాలు చేస్తూ ఉంటారు కాని కొందరు షాపులు కూడా నడుపుతూ ఉంటారు ఇక్కడి ఇండొనేసియా వారిలో అధిక శాతం సురినామ్ నుంచి వచ్చిన వాళ్ళు వీరి నాళాలలో భారతీయుల రక్తం కూడా పారుతూ ఉంటుంది కాని ఇండొనేసియా వారితో వివాహాలు బాగా జరిగి మొహాలు కొంచెం మారిపోయాయి ఆమ్‌స్టర్‌డామ్‌లోని ఒక సురినామ్ అమ్మాయి నాతో చెప్పింది. తన తండ్రి భారతీయ జాతివాడనీ తల్లి చీనా తన భర్త ఇండొనేసియాకి చెందిన ఒక భారతీయ జాతివాడనీ

"మీ పిల్లలు ఏ జాతివారన్నమాట? అని అడిగాను

ఇంకేజాతి? డచ్ జాతే! అంది ఆవిడ

* * *

నేను ఇంతకిముందు 1980 లో ఇక్కడికి వచ్చాను అప్పటికీ ఇప్పటికీ పరిస్థితులు మరింత చెడి పోయినట్టు తోచింది నాకు నిరుద్యోగ సమస్య తీవ్రంగానే ఉంది - సుమారు 16 శాతం అని తెలుస్తోంది ఈ దేశం జనాభా బొంబాయి మహా నగరం జనాభాకన్నా కొంచెమే ఎక్కువ ఇంత చిన్న దేశంలో ఇందరు నిరుద్యోగులు ఉండటం మంచిది కాదు అయితే నిరుద్యోగులకి నిరుద్యోగ భృతి ఒకట్లి ఇస్తారు అది, స్థానిక వేతనాల కన్నా తక్కువే కానీ కష్టం లేకుండా జీవించటానికి చాలు మన రూపాయిలలో చెప్పాలంటే ఒక వివాహితుడి నిరుద్యోగ భృతి సుమారుగా రు 1000 ఉంటుంది దీనితోనే ఇంటి అద్దెనీ చలి నివారణకి ఇంటిని వేడి చేసుకునే ఇంధనాన్ని కూడా సర్దుబాటు చేసుకోవాలి

పాశ్చాత్య దేశాలలో ఈ రెండు అంశాలూ పెద్దవి గానే ఉంటాయి. ఇక్కడ ఆహారంమీద మొత్తం ఆదాయంలో 20 శాతం మాత్రమే ఖర్చు చేస్తారు (భారత దేశంలో ఈ ఖర్చు 65-70 శాతం దాకా ఉంటుంది) నేను గమనించిన ఒక విషయం ఏమిటంటే ఇక్కడ అంగళ్ళు నిండుగా ఉంటాయి హొటళ్ళు కూడా అంతే కాని సాయంత్రం 7 గంటల తరువాత జనం ఇంచుమించు ఉండరు నేను ఒక పెద్ద అమెరికారకం హొటలుకి వెళ్ళాను అందులో ఇద్దరే కనిపించారు లాడ్జింగు కల హొటళ్ళలోనూ నాకు ఎక్కువ మందిజనం కనిపించలేదు హాలాండులో వీటి రేట్లు చాలా అధికంగా ఉంటాయి రెండవ ప్రపంచ యుద్ధం ముందు నిరుద్యోగ సమస్యవల్లే హిట్లరులాంటివాడు జర్మనీలో అధికారంలోకి రాగలిగాడు ప్రస్తుతం ఇలాంటిది ఏదీ యూరోపులో జరుగుతుందని నేను అనుకోను నిరుద్యోగ సమస్యని పరిష్కారం చేసుకోలేక పోయినప్పటికీ పాశ్చాత్య దేశాల ప్రభుత్వాల వారు ఆ సమస్యతో సహజీవనం చెయ్యటం నేర్చుకున్నారు ఉత్తర యూరోపు ఖండంలో కమ్యూనిస్టులకి బలమే లేదు ఫ్రాన్సు ఇటలీ దేశాలలో కమూనిస్టు పార్టీలకి పలుకుబడి ఉంది కాని అవి సోవియెట్ దినుసు పార్టీలుకావు

* * *

ఇప్పుడు పశ్చిమ యూరోపులో పెద్ద చర్చ నీయాంశం అణుశక్తి అణ్వస్త్రాలు కల చోది తాస్త్రాలూను (మిస్సైయిల్స్ అనే ఇంగ్లీషు మాట బాగా వాడకంలోకి వచ్చేసింది కనుక దానినే అధికంగా వాడవచ్చు!) నేను కూర్చుని ఉన్న హొటలులోకి పక్కనే ఉన్న పార్లమెంటు భవనంనుంచిఎందరో వచ్చి వెడుతూ వుండేవాళ్ళు వాళ్ళందరూ వారిలో వాళ్ళు ఈ మిస్సైయిల్స్ గురించే మాటలాడుకుంటున్నట్లు తెలుసుకున్నాను మొత్తంమీద పశ్చిమ యూరోపులో అణుశక్తి వ్యతిరేక భావాలు బాగా చెలరేగాయనే అనాలి ఈ భావాలు తేలికగా అమెరికా వ్యతిరేక భావాలుగా మారిపోగలవు అమెరికా వారు అణ్వస్త్రాలు కల మిస్సైయిల్‌లని బల వంతంగా తమ తల మీద రుద్దుతున్నారని ఎందరో యూరోపు వారు అనుకుంటున్నారు ఇటువంటి వారిలో సోషలిస్టులే అధికం కాని ఇతర రాజకీయ పక్షాల వారూ లేక పోలేదు ఇంగ్లాండులో జర్మనీలో యుద్ధం అంటే భయం ఏవగింపు వచ్చేశాయి

కాని యూరోపు వాసులకి ఇతర ఖండాలమీద వారికి ఆయుధాలు అమ్మి డబ్బులు చేసుకోవటానికి అభ్యంతరంలేదు వీరిలో కొందరు ఒక భ్రమలో ఉన్నారు-అదేమిటంటే మిస్సైయిల్‌లని తమ దేశాలలో నెలకొల్పకపోతే రష్యా వారు తమ జోలికి రారని ఇది సహేతుకమయిన విశ్వాసంకాదు కాని యుద్ధం అంటే అంత అసహ్యం వచ్చేసింది

హాలాండు చిన్న దేశమే నిరుద్యోగ సమస్యలూ ఉన్నాయి కాని ఇది యూరోపులోని అతి సంపన్న దేశాలలో ఒకటి అమెరికాసంయుక్త రాష్ట్రాల తరు వాత ఆహార పదార్థాల ఎగుమతులలో హాలాండుది ద్వితీయస్థానం హాలాండు పువ్వులని అధికంగా ఎగుమతి చేస్తుంది! వివిధ పుష్పాలని టన్నుల లెక్కని ఎగుమతి చేస్తూ ఉంటారు ఎగుమతి దారులు రైలు బండిలో వెడుతూ వుంటే ఎటు చూసినా పువ్వుల తోటలే కనపడుతాయి అన్ని రంగులని చూస్తే ఆశ్చర్యంగానే ఉంటుంది అయితే ఇక్కడ పుష్పాల ఉత్పత్తి ఒక పరిశ్రమ అని గుర్తు చేసుకుంటూ ఉండాలి మనదేశంలో 'పంచదార' సహకార సంఘాలు ఉన్నట్లే హాలాండులో పువ్వులకి సహకార సంఘాలు ఉంటాయి గ్రామ ప్రాంతాలనుంచి పూల చెట్లని పెంచేవాళ్ళు వాహనాలలో వాటిని నగరానికి తీసుకువస్తారు అక్కడ (మన టీ కి జరిగినట్లే) వేలం పాటలు జరుగుతాయి ఆమ్‌స్టర్‌డామ్ దగ్గిరే జరిగిన ఒక వేలానికి నేను వెళ్ళాను అంతా సందడి హడావిడి!వేలం పాటలే నాకు వినిపించలేదు కాని పువ్వుల రైతులు కి ఇబ్బంది ఏమీ ఉన్నట్లు నాకు తోచలేదు ఒక పువ్వుల రైతు తో మాటలాడాను తన కొడుకు సుప్రసిద్ధ అంతర్జాతీయ కంప్యూటర్ సంస్థ ఐ బి ఎమ్ లో పని చేస్తున్నాడనీ అతనికన్నా తన ఆదాయమే అధికమనీ ఆయన నాకు చెప్పాడు

* * *

యూరోపు పర్యటించేవారు ఒక విషయాన్ని గమనించి తీరుతారు చిన్న పిల్లలు సాధారణంగా కనిపించరు ఇంగ్లాండులో నేను చూసిన కొద్దిమందీ భారతీయ జాతికి చెందినవారే హాలాండులో ఇంకా తక్కువమంది కనపడ్డారు ఆమ్‌స్టర్‌డామ్‌లో ఒక బొమ్మల షాపుకి వెళ్ళాను అందులో ఒక వృద్ధుని జంటని మాత్రమే చూశాను వాళ్ళు తాతా, అమ్మమ్మలేమో తమ మనవలకీ మనవరాళ్ళకీ బొమ్మలు కొనటానికి వచ్చారేమో! చిన్న పిల్లలు లేని దేశాలు నిండుగా కనపడవు హాలాండులోని ముసలి వారికి ప్రత్యేక నివాస స్థానాలు ఉంటాయి వాళ్ళకి దైనిక జీవితావసరాలకి లోటు ఉండదు కాని వాళ్ళ సంతానమే వాళ్ళని ఇంటినుంచి పంపించి వేస్తారనుకోవాలి

వీళ్ళవి వంటరి జీవితాలు పార్కులలో, రైలు స్టేషనులలో కాలక్షేపం'చేస్తూ ఉంటారు ఇంగ్లాండులో ఉండే భారతీయ జాతి కుటుంబాలు కొన్నిటిలో సయితం ఇదే పద్ధతి గోచరిస్తుంది సౌతాల్‌లో కొందరు వృద్ధ సిక్కులు పార్కులలో కూర్చుని [illegible]డటం నేను చూశాను వాళ్ళ కుమార్తెలూ కుమారులూ తమ తమ కార్యక్రమాలలో మునిగిపోయి ఉంటారు కాబోలు పాశ్చాత్య దేశాలలో కనపడే ఈ పద్ధతి మనకి కొంత క్రూరంగా తోచవచ్చు కాని ప్రగతి గా పిలువబడే దానికి చెల్లించవలసిన వెల ఇదేనేమో

— డా. జయ్‌దుబాషీ

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

## 1984 దీపావళి కథల పోటీ
## మొత్తం రు.6,600ల బహుమతులు

ఎప్పటిలాగే ఈసారి కూడా దీపావళికి కథానికల పోటీ పెడుతున్నాము.......... పోయినేడాదిలాగే యీసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలను 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

## ముగింపు తేదీ:→ 20-8-'84 సోమవారం

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు. 650/-లు చొప్పున బహుమతులు ఇస్తాము. అటు తరువాత బాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. 700/-, రు. 600/-, రు. 500/-ల వంతున అదనపు బహుమతులు యివ్వడమేగాక మిగిలిన మూడు కథలకు రు. 300/-ల చొప్పున మూడు కన్సొలేషన్ బహుమతులు అందజేస్తాము.

### నిబంధనలు

* 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా ఉండాలి. 12 అరఠావులు దాటకుండా రాస్తే చాలు. సిరాతో లేక బాల్ పెన్‌తో రాయవచ్చు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.
* కథావస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.
* అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.
* పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి. కలం పేరు వాడినా అసలు పేరు, యింటి పేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతో పాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.
* కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయంతోనే వేస్తాము.
* రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.
* పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫోటో, జీవిత విశేషాలు మొదలైన వాటిని పంపి వాటి ప్రచురణకు అంగీకరించాలి.
* ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము. పోటీకి పంపిన కథలను ఎట్టి పరిస్థితులలోను త్రిప్పి పంపలేము. కాబట్టి రచనలతోపాటు స్వంత చిరునామాకల స్టాంపులు అతికించిన కవరు పంపనవసరంలేదు.

— సం॥

Kasi..

# కాంతీ - అక్షరాలూ - కూర్పూ

ఫోటో కంపో సింగ్ అనే మాట ఈ మధ్య తరచుగా వినపడుతోంది' తెలుగు ముద్రణలో ఈ ఫోటో కంపో సింగ్ పద్ధతిని అప్పుడే వాడేస్తున్నారు కూడా-ఏమిటీ ఈ ఫోటో కంపో సింగ్?

ఫోటోస్ అంటే గ్రీసు భాషలో కాంతి'

కంపో సింగ్ అంటే ఇంగ్లీషులో అచ్చు కూర్పు'

రెండు మాటలనీ కలిపి ఫోటో కంపో సింగ్ అనే పదాన్ని తయారు చేశారు దీనిని తెలుగులో కాంతి ద్వారా అచ్చు కూర్పు అనవచ్చు ఇలాంటి వాటికి ఇంగ్లీషు మాటలనే వాడుతున్నాము కనుక ఫోటో కంపో సింగ్ అనే మాటనే వాడటం మంచిది

ముద్రణ లేని ఆధునిక జీవితాన్ని ఊహించటమే కష్టం అక్షరాలని ఎలాగ ముద్రిస్తారో తెలియనివారు ఎందరో ఉండరు కాని సాధారణంగా వాటిని అచ్చులని వాడి ముద్రిస్తారని ఒకసారి గుర్తు చేసుకోవటం మంచిదే కదా'

ఏకదంతం ఉపాస్మహే అనే వాక్యాన్ని ముద్రించాలనుకోండి అందులోని అక్షరాల అచ్చులని కూర్చుకుని యంత్రంలో (తగిన విధంగా అమర్చుకుని') ముద్రణ చేస్తారు

అచ్చుల కూర్పుని చేతితో చేసుకోవచ్చు లేదా మోనో టయిప్ యంత్రంతో చేసుకోవచ్చు ఏ+క+ద+ం+త+ం+ ఉ+పా+స్మ+హే అని తెలుగు టయిపు రయిటరు మీద కొట్టినట్లు కొడితే మోనో టయిపు యంత్రం అప్పటి కప్పుడు ఆ అక్షరాల అచ్చులని పోసి, కూర్చి ఇస్తుంది వీటిని ముద్రణ కోసం వాడుకోవటం తరువాతి పని

(మోనో టయిపు యంత్రంలో అక్షరాలని పోసేందుకు అచ్చులు (మాట్రిక్సులు) ఉంటాయి కరిగి ఉన్న సీసం పాత్ర ఉంటుంది ఏ మీట నొక్కితే దాని అచ్చు వచ్చి సీసం పోసే కొళాయి ముందు నుంచుంటుంది సీసం పారి అచ్చు పోత పొయ్యబడతుంది అచ్చుల కూర్పు వరుసగా జరిగిపోతుంది ఒక మోనో టయిపు యంత్రం నిముషానికి 125 తెలుగు అచ్చులని పోసి కూర్చగలదు తెలుగు పత్రికలో ఆంధ్రపత్రిక ఆంధ్రప్రభ మాత్రం వీటిని వాడుతున్నాయి )

ఈ పద్ధతిని ఇంగ్లీషులో హాట్ మెటల్ కంపో సింగ్ పద్ధతి అంటారు అంటే వేడి లోహం అచ్చుల కూర్పు అనే కదా అర్థం?

ఇక్కడ కొంచెం విషయాన్ని మార్చవలసి వస్తోంది ముద్రణలో ముఖ్యంగా మూడు రకాలు -

1 లెటర్ ప్రెస్

2 ఆఫ్‌సెట్

3 గ్రావ్యూర్

1 <u>లెటర్ ప్రెస్</u> అతిప్రాచీనమయిన పద్ధతి రబ్బరు స్టాంపు ముద్రలు లెటర్‌ప్రెస్‌వే - అసలు లెటర్ అంటే అక్షరం ప్రెస్ అంటే వత్తటం కాబట్టి



బొమ్మ-1

అచ్చువత్తటం ఇదే

తెలుగులో ఎక్కువ ముద్రణ ఈ రకంగానే జరుగుతోంది ఆంధ్ర పత్రిక దినపత్రిక భారతి ఈ రకంగానే అచ్చు వత్తబడుతున్నాయి '

2 <u>ఆఫ్‌సెట్</u> ఒక రకంగా లిథో పద్ధతే' రాతి పలకం మీద కాని అల్యూమినియం రేకు మీద కాని కొన్ని పదార్థాలని పూసి ఆ తరువాత కావలిసిన రూపాన్ని దాని మీదకి మార్చుకుని (ఎలాగ? అన్నది ఇప్పుడు అప్రస్తుతం') దాని మీద నీరు సిరా పూస్తే సిరా అచ్చు కావలిసిన భాగాలకి మాత్రం అంటుకుంటుంది సిరా ఇతర భాగాలకి పాకకుండా నీరు అడ్డు పడుతుంది సిరాలోని నూనె నీటితో కలవదు' ఆంధ్రసచిత్ర వార పత్రిక ఆఫ్‌సెట్ మీద అచ్చు అవుతుంది

3 <u>గ్రావ్యూర్</u> పద్ధతి చాలా విచిత్రమయినది ఇందులో అచ్చు కావలిసిన భాగాలు ఇతర భాగాల కన్నా లోతుగా ఉంటాయి' (లెటర్ ప్రెస్‌లో ఇవి ఇతర భాగాలకనా ఎత్తుగా ఉంటే ఆఫ్‌సెట్‌లో ఆ భాగాలు ఇతర భాగాలతో సమానమయిన ఎత్తులో ఉన్నట్లే లెక్క ) దీనిని గురించి వివరంగా ఆలోచించటం అనవసరం భారత దేశంలో ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా ఫెమినా ధర్మయుగ్ పత్రికలు గ్రావ్యూర్ పద్ధతి మీద అచ్చు అవుతాయి ఇది చాలా ఖరీదయిన పద్ధతి

ఆంధ్ర సచిత్ర వారపత్రికకి సంబంధించి నంతదాకా ఆఫ్‌సెట్ పద్ధతే ముఖ్యమయినది

ప్రస్తుతం ఈ పత్రికలో ఒక పేజీ ఎలాగ తయారయి అచ్చు అవుతుందో చూదాలి'

అ) ముందు కావలిసిన వాక్యాన్ని కాలమ్‌లుగా అచ్చు కూరుస్తారు

ఆ) తరువాత వాటిని బాగా తెల్లగా ఉండే కాగితం మీద అచ్చు వత్తుతారు (చిన్న లెటర్ ప్రెస్ యంత్రంతోనే')

ఇ) వాక్యాన్నీ బొమ్మలనీ పేజీలకి అవసరమయిన రీతిలో అతికిస్తారు

ఈ) వీటిని ఫోటో తీస్తారు

ఉ) ఫోటోని అల్యూమినియం రేకు (ప్లేటు) మీదకి మారుస్తారు (బ్లాకులాగే అన్న మాట )

ఊ) ఈ ప్లేటు (లేదా రేకు)ని యంత్రంలో అమరుస్తారు

ఎ) రేకుకి సంబంధించిన సిరా (లేదా ఇంకు) యొక్క ముద్ర నేరుగా కాగితం మీద పడదు ముందు ఒక రబ్బరు రోలరు మీద పడి దాని మీద నుంచి కాగితం మీద పడుతుంది ఇలాగ జరుగుతుంది కనుకనే ఈ పద్ధతిని ఆఫ్‌సెట్ అంటారు నేరుగా కాగితం మీదకి మారేది లిథో పద్ధతి అనవచ్చునేమో

అక్షరాల అచ్చులని కూర్చుకుని వాటితో ఎన్నో పనులు చేసి ముద్రించేబదులు-

-అక్షరాల స్వరూపాలు ఫోటో ఫిలిమ్ మీద పడేట్లు చేస్తే ఈ ఫిలిమ్‌తో ఆఫ్‌సెట్ ప్లేటు చేసుకోవచ్చు కదా?(లెటర్ ప్రెస్ బ్లాకు చేసుకోవచ్చు గ్రావ్యూర్ ప్లేటు చేసుకోవచ్చు కాని ఆఫ్‌సెట్ ప్లేటు చవక' అసలు ఆఫ్‌సెట్‌లో లెటర్ ప్రెస్. గ్రావ్యూర్‌లలో వచ్చినంత చక్కగా రంగులు పడవు పాశ్చాత్య దేశాలలో అమెరికాలో లెటర్ ప్రెస్‌నే ఎక్కువగా వాడుతారు ) .

కాని అక్షరాల స్వరూపాలు ఇలాగ పడేట్లు చెయ్యటం ఎలాగ?

ఒక కాగితపు అట్ట మీద కాని కాంతి లోపలి నుంచి చొచ్చుకుపోలేని ఇంకేదయినా పదార్థపు అట్ట మీద కాని అక్షరాల స్వరూపాలని కత్తిరించి ఒక పక్క దీపం పెడితే అవతలి పక్క అక్షరాలు కాంతి వంతంగా కనపడుతాయి కదా? సినిమా తెర మీద బొమ్మలు పడినట్లే అక్షరాల బొమ్మలు సయితం పడేట్లు చెయ్యవచ్చు కదా ?

భూతద్దం కాంతి కిరణం ఏర్పాటు చేస్తే బొమ్మల పరిమాణాలని కావలిసిన రీతిగా మార్చుకోవచ్చు'( ప్రొజెక్షన్ అనవచ్చునా?)

ఇంతదాకా ఓపికగా దీన్నంతటినీ చదివిన వారికి కృతజ్ఞత తెలియ చేసుకుని-

- ఫోటో కంపో సింగ్‌ని గురించి టూకీగా చెప్పటానికి ప్రయత్నిస్తాడు ఈ విలేఖరి ఒక చక్రం ఉందనుకోండి ఈ చక్రం గాజువంటి పదార్థంతో చేసినది కాదు దీని అంచు వెంబడే అక్షరాల స్వరూపాలు కిటికీలలాగ కోసి ఉంటాయి అంటే ఈ కిటికీల ద్వారా కాంతి ప్రసరిస్తుందన్న మాట ఈ చక్రం ఒక ఇరుసు మీద అమర్చబడి ఉంటుంది అది నిముషానికి సుమారుగా వెయ్యిసార్లు తిరుగుతూ ఉంటుంది అంచు వెంబడే ఉన్న అక్షరాల




బొమ్మ - 2

వలయానికి నేరుగా ఒక కిరణ ప్రసారం ఏర్పాటు చెయ్యబడి ఉంటుంది. ఇదంతా చీకటిగా ఉండే పెట్టెలో అమర్చబడి ఉంటుంది. అక్షరాల చక్రానికి ఒక వయిపు దీపం ఉంటే మరొక వయిపు "ఫోటో గ్రాఫిక్ ఫిలిమ్" ఉంటుంది.

కావలిసిన అక్షరం తాలూకు మీట ఒకటి నొక్కితే "ఆ అక్షరం కిటికీ" దీపం ఎదురుగా ఉన్నప్పుడు దీపం వెలిగి ఆరిపోతుంది. అవతల ఫోటో ఫిలమ్ మీద అక్షరం స్వరూపం పడుతుంది. ఈ ఫిలిమ్‌గాని, చక్రం ఏర్పాటు చేసి ఉన్న యంత్రం భాగాన్ని కాని కదిలేట్లు చేసుకుని అక్షరాలూ, మాటలూ, పంక్తులూ ఫిలిమ్ మీద పడేట్లు చేసుకోవచ్చు కదా?

ఫోటో కంపోసింగ్ అంటే ఇంతే. ఇంతే అంటే స్థూలంగా ఇంతే!

ఆచరణలో ఎన్నో సమస్యల పరిష్కారం అవసరం అవుతుంది. వీటిలో ఒక దానిని గురించే ఇక్కడ ఆలోచించవచ్చు.

అది అన్నిటి కన్నా ముఖ్యమయిన "ప్రూఫ్ రీడింగ్"

ఒకసారి ఫోటో ఫిలిమ్ మీద పడిపోయిన తర్వాత తప్పులు దిద్దటం ఎలాగ? కష్టంకదా?

అందుకనే ఫోటో కంపోసింగ్ యంత్రంలో ఈ కింది విధానం అవలంబించబడుతూ ఉంటుంది.

1 కావలిసిన పాఠాన్ని ముందు కొట్టేస్తారు

2 అది వెంటనే ఫోటో ఫిలిమ్ మీదకి మారదు (అంటే చక్రం పని చెయ్యదన్న మాట!)

3 కొట్టినదంతా ఒక అయస్కాంతపు పళ్లెం మీదకి గాని టేపు మీదకి గాని మారుతుంది (మామూలుగా అందరూ వాడే టేపు రికార్డరు మీదకి మారినట్లు )

4 టేపు మీద కాని అయస్కాంతపు పళ్లెం మీద రికార్డు అయినదంతా ఒక టెలివిషన్ స్క్రీన్ మీద కనబడుతుంది

5 తప్పులు ఏవో స్పష్టంగా కనపడుతూనే ఉంటాయి

6 తప్పులని మాత్రం దిద్దుకునేందుకు వీలు ఉంటుంది

7 తప్పులు దిద్దిన సాఫు పాఠం కల పళ్లెం లేదా టేపుని ఫోటో కంపోసింగ్ యంత్రంలో అమరుస్తారు

8 ఆ తరువాత అన్నీ జరిగిపోతాయి

9. కొన్ని యంత్రాలకి "లైన్ ప్రింటర్"లు ఉంటాయి. దిత్తు పాఠం అంతా ఈ చిన్న ముద్రణ యంత్రం మీద అచ్చు అవుతుంది. తప్పులని దిద్దుకోవటానికి ఈ ప్రూఫ్ బాగా సౌకర్యంగా ఉంటుంది. ఇంగ్లీషుకి లైన్ ప్రింటర్‌లు చవకగా దొరుకుతాయి. తెలుగుకి అంత చవకగా దొరకవు.

10. ఫోటో కంపోసింగ్ యంత్రాల అక్షరాల కూర్పు వేగం కనీసం నిముషానికి 950 ఉంటుంది!

11. ఒక వార్తా పత్రిక కాలమ్‌లో 12 పాయింట్ అక్షరాలు అటూ ఇటూగా 1800 ఉండవచ్చు. అంటే, చిన్న ఫోటో కంపోసింగ్ యంత్రాల మీద కూడా రెండు నిముషాలకి 1 కాలమ్ చేసుకోవచ్చునన్న మాట.

గమనిక : ఇది బయటికి వచ్చే (అవుట్ పుట్) వేగం మాత్రమే. ఏదయినా "పాఠం" ఫోటో కంపోస్ చెయ్యాలంటే ఫోటో కంపోసింగ్ యంత్రం యొక్క కీబోర్డు మీద టయిపు చేసే వేగమే యంత్రం వేగం అనుకోవాలి. సాధారణంగా ఒక ఆపరేటరు (అంటే కీబోర్డు మీద కొట్టే వ్యక్తి) గంటకి కనీసం ఒక కాలం పాఠం కొట్టగలడని అంటారు.

ఒక ఫోటో కంపోసింగ్ యంత్రానికి తేలికగా నాలుగు కీ బోర్డులు పని చేస్తాయి. ఇంకా ఎక్కువ కూడా వాడుకోవచ్చు.

ఒక ఎనిమిది పేజీల తెలుగు దినపత్రికలో సుమారు. 35 కాలమ్‌ల 12 పాయింటు పాఠం పట్టవచ్చు. ఒక ఎనిమిది గంటల షిఫ్ట్‌లో ఇంత పాఠాన్ని నలుగురు తేలికగా కీబోర్డుల మీద కొట్టగలరు.

అయితే ఈ 35 కాలమ్‌ల పాఠం "కంపోస్" కావటానికి మాత్రం గంటన్నరకూడా పట్టదు.

అక్షరాల కిటికీలు చెక్కిన చక్రాలు కల యంత్రాలు అత్యాధునికమయినవి కావు. బాగా వేగంగా అక్షరాలని కూర్చే యంత్రాలలో "లేసర్" కాంతి కిరణాన్ని అక్షరాల స్వరూపాలని కలంతో రాసినట్లు రాయటానికి వాడుతారు!

అయస్కాంత క్షేత్రాల ద్వారా ప్రసారం అయ్యే "లేసర్" కిరణాలని ఆ క్షేత్రాలలో మార్పులు తీసుకు వచ్చి అక్షరాలని "రాసేట్లు" చెయ్యవచ్చు. ఇలాంటి యంత్రాలు 100 సెకండ్లలో 15-20000 అక్షరాలని ఫోటో ఫిలిమ్ మీద రాయగలవు! ఒకటిన్నర నిముషంలో ఒక దైనిక వార్తా పత్రికపేజీని కూర్చగలవన్న మాట!

ఫోటో కంపోసింగ్‌నే ఫోటో టయిప్ సెట్టింగ్ అని కూడా అంటారు. ఇంగ్లీషు పొడి అక్షరాలలో "పి.టి.ఎస్.".

పి.టి.ఎస్.ల సులువు మరొకటి ఏమిటంటే కొన్ని లక్షల అక్షరాల పాఠాన్ని అయస్కాంతపు పళ్లాల మీద టేపుల మీద నిలవ చేసి ఉంచవచ్చు.

ఒక చిన్న పి.టి.ఎస్. యొక్క అయస్కాంతపు పళ్లెం మీద తేలికగా 180 వార్తా పత్రిక కాలమ్‌ల పాఠాన్ని నిలవ చేసి ఉంచవచ్చునన్న మాట....

ఇంకొక విధంగా చెప్పాలంటే ప్రకటనలే లేని బొమ్మలే లేని ఆంధ్రసచిత్రవారపత్రిక పేజీలు 90 ఒక పళ్లెంలో ఇమిడిపోతాయన్న మాట....

**—ఒక విలేఖరి**



కీబోర్డు టెలివిషన్ స్క్రీన్

అక్షరాలని కూర్చే యంత్రం

# కొత్త సీరియల్ ప్రారంభం!

## రాత్రి పదిన్నర కావస్తూంది.

తెల్లని ఫియట్ కారు మెత్తని తారురోడ్డు మీద వేగంగా పరుగులు తీస్తుంటే ఆ కార్లో కూర్చున్న వాసంతి మనసు అంతకన్నా వేగంగా పరుగు తీస్తోంది ఇంటి వైపు.

# స్వాతి జల్లు

## రావినూతల సువర్ణ కన్నన్

**ఇందాకటి నుంచి లేని బెదురు ఆమె ముఖంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.**

''ఛ! ఛ! మరీ ఇంత పిరికి దానివనుకో లేదు!'' చేతిలోని సిగరెట్ బైటికి విసురుతూ వెక్కిరింపుగా అన్నాడు డ్రైవింగ్ సీట్లో కూర్చున్న ప్రతాప్.

''మా అత్త సంగతి నీకు తెలియదు ప్రతాప్! ఆవిడ ఎంత మెత్తగా కనిపిస్తుందో అంత పట్టుదలగల మనిషి! పాతిక దాటినా .. అరవై దాటిన అమ్మమ్మలా ప్రవర్తిస్తుంది ఒకొక్కప్పుడు! .. తెలియకుండా రావడమే తప్పు! పైగా సినిమాలు, షికార్లు, హోటళ్లు, పార్కులు తిరగడం మరీ పెద్ద తప్పు!

ఇది తెలిస్తే? .. అమ్మో! కాలేజీ మాని మూల కూర్చోమన్నా ఆశ్చర్యపోనక్కర్లేదు'' భయంగా అంది వాసంతి.

''అదిగో! . మీ అత్త గదిలో లైట్ ఆర్పేసే వుంది! అంటే . ఆవిడ నిద్ర పోతూండాలి! .'' విశ్వశాంతికి కొంచెం దూరంగా కారు ఆపుతూ అన్నాడు ప్రతాప్

''ఉహూఁ! .. అత్త అప్పుడే పడుకోదు! పైగా నేను ఇల్లు చేరకుండానే!'' మెల్లగా కారు దిగుతూ అంది.

''ఆఁ. అదేంకాదు! నువ్వెలాగూ మీ ఫ్రెండ్ ఇంటికేకదా వెళ్ళావ్! ఆ పిల్ల బలవంతం చేస్తే సినిమాకి వెళ్ళిఉంటుందని అనుకుంటుంది!'' ధయిర్యం చెప్తూ అన్నాడు ప్రతాప్

''కావచ్చు!'' ఏదో ఆలోచిస్తూనే పరధ్యానంగా అతనికి వీడ్కోలు చెప్పి మెల్లగా గేటు తీసుకుని చప్పుడుకాకుండా చెప్పులు చేత బట్టుకుని అడుగులో అడుగు వేసుకుంటూ వరండాలోకొచ్చింది వాసంతి

వెన్నెలలో ''విశ్వశాంతి'' మెరిసిపోతోంది మెల్లగా కిటికీలోనుంచి తొంగి చూసింది వాసంతి. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది వంటావిడ మంగమ్మగారు హాల్లో ఓమూల గుడ్డ పరుచుకుని నిద్రపోతూంది.

''అమ్మయ్య!. అత్త పడుకుంది!. లేకపోతే ఈవిడ నిద్రపోదు!'' ధయిర్యం తెచ్చుకుంది వాసంతి.

మంగమ్మగారికి దగ్గరివాళ్ళెవరూ లేనందున ఆవిడ ఇక్కడే వుంటుంది

గేటుకవతలనుంచే వాసంతిని గుర్తించిన పెంపుడుకుక్క హనీ ఆమెను సమీపించి తోకాడిస్తూ తన విశ్వాసాన్ని ప్రకటించుకుంది

''ష్!. ఉండవే! మధ్య నీ గొడవేమిటి?'' ముద్దుగా దాన్ని విసుక్కుని మెల్లగా తలుపు తట్టింది వాసంతి

మంగమ్మగారు కదల్లేదు

దిక్కుతోచని వాసంతి ఓ నిమిషం ఆలోచించి హేండ్ బేగ్‌లోంచి ఓ రూపాయి నాణెం తీసి ఆవిడమీదికి విసిరింది

అది ఖంగుమంటూ క్రిందికి దొర్లిపోయిందేతప్ప ఆవిడ మాత్రం లేవలేదు!

వాసంతిలో సహనం నశించింది

''ఛీ! కుంభకర్ణుడి చెల్లెలు!'' చిరాగ్గా పళ్ళు నూరుకుంది ఆ చిరాకులోనే ఓ అయిడియావచ్చి వరండాదిగి వెతికి, వెతికి ఓ చిన్న రాయి సంపాయించి కిటికీలోనుంచి సూటిగా, ఆవిడ తలకి తగిలేలా విసిరింది

ఆవిడ తలమీద తెల్లని మల్లుపంచ ముసుగు తప్ప ఈషణ్మాత్రం కేశసంపద లేనందున ఈసారి దెబ్బ కాస్త గట్టిగానే తగిలినట్టుంది చటుక్కున లేచి కూర్చుని ''ఎవరు?'' అరిచింది

''ష్! .నేను!. నేను మంగమ్మగారూ!'' రహస్యంగా ఉంది

''నా తల్లే!.. నువ్వామ్మా అంత దెబ్బ కొట్టింది? కాస్తుంటే మాడు చిల్లుపడి పోను!'' ఋసరుసలాడుతూ తలుపు తీసిన మంగమ్మగారి రెండు చేతులు పట్టుకుని --

''ప్లీజ్! అరవకండి! మీకు దణ్ణం పెడతాను! మా రమ సినిమాకెడదామని గొడవపెడితే. తప్పనిసరై వెళ్ళాను! తీరా వెళ్ళాక అత్త తిడుతుందనే భయంతో సినిమా చూడనేలేదనుకోండి! ఎలాగో ఇల్లు చేరి క్షమించమందాంలే అనుకున్నాను కానీ... ఇల్లు చూసేసరికి.. మళ్ళీ భయం తరుముతోంది

అందుకే మెల్లగా మిమ్మల్ని పిల్చాను! ఏదీ .. పాపం!... పగలల్లా చాకిరీతో సతమతమయ్యే మీకు అంత తొందరగా మెలకువ ఎలా

వస్తుంది? .అందుకే. ఆ రాయి విసిరాను!..'' ఇంకా వంద క్షమార్పణలు చెప్తేగానీ శాంతించలేదు మంగమ్మగారు

''ఊ సరే!...పద . భోంచేద్దువుగాని! '' తలమీది కొంగు సవరించుకుంటూ అంది మంగమ్మగారు

''అత్త . నిద్రపోయిందా?'' రహస్యం అడిగినట్లు అడిగింది వాసంతి ఆ పిల్లకి భయంగానే ఉంది

''ఆఁ! ఇవాళ ఒంట్లో బాగాలేదని పెంద్రాళే పడుకుంది!'' ఆవలిస్తూ అంది ఆవిడకి మాధవి దగ్గర కూడా బాగా చనువుంది అందుకే ఎప్పుడూ ఆవిడ బహువచనం వాడదు

''హమ్మయ్య!'' వాసంతి భయం తీసేసినట్టుగా మాయమైంది ''అడిగితే రేపు ఏదో ఒకటి చెప్పచ్చు!'' ఉత్సాహంగా గదిలోకెళ్ళి లైట్‌వేసి బద్ధకంగా ఓసారి ఒళ్ళు విరుచుకుని మంచం కేసి నడిచింది

అంతే! . క్షణం కొయ్యబారిపోయింది!




వాసంతి మేనత్త మాధవి మంచంమీద కూర్చునివుంది

''అత్తా! నేను నేను '' మాట రావడంలేదా పిల్లకి

''ఆఁ! . నువ్వు . నువ్వే! పద భోజనానికి!'' గంభీరంగా ఉంది మాధవి స్వరం!

''అత్తా! రమ నేను అదే సినిమాకి అహ '' వాసంతికి భయంతో పాటు దుఃఖం కూడా తోడయింది

''నేను మంగమ్మగారితో చెప్తుంటే

పిన్నాను! మళ్ళీ అవస్తపడకు!'' లే. వాలుగడుగులు వేసింది మాధవి

''అత్తా అది కాదు ''

''చ్ఛ! ఏదికాదు? నాకు ఆకలిగా ఉంది! ముందు భోజనాలు కానీ!''

''నువ్వు నువ్వింకా భోజనంచెయ్యలేదా?''

''నేనా? అదేం కొత్తగా మాట్లాడు తున్నావ్? నువ్వు రాకుండా ఎప్పుడైనా తిన్నానా? ఉన్న ఇద్దరిలో చెరోసారీ ఎందుకు పద!'' వంట ఇంటికేసి నడిచింది మాధవి

ఆవు ననుసరించే లేగిలా అనుసరించింది వాసంతి అత్త ముఖంలోని గాంభీర్యం చూసిన ఆ పిల్లకి వెన్నులోంచి. ఒణుకులాంటిది పుట్టు కొస్తోంది

''మేం తినేస్తాం మీరెళ్ళి పడుకోండి!'' వడ్డించడానికి వచ్చిన మంగమ్మగార్ని పంపేసి టేబిల్ మీద పెట్టి ఉంచిన కంచాల్లో మౌనంగా వడ్డించసాగింది మాధవి

''నేను హోటల్లో తిన్నాను!'' అని చెప్ప డానికి ధైర్యం లేని వాసంతి కిమ్మనకుండా అత్తకెదురుగా కూర్చుంది తల ఎత్తాలంటేనే దడగా వుంది ఒళ్ళంతా ముచ్చెమటలు పోసేస్తోంది

''ఛ! ఛ! ప్రతాపన్నట్టు తనకింత భయం ఎందుకు? అత్తేమైనా రాక్షసా? ఫ్రెండ్‌తో సినిమాకి వెళ్ళానంటే తల తీసేస్తుందా?'' తనకి తను ధయిర్యం చెప్పుకోవాలన్నా వాసంతి మనసు ససేమిరా వినడంలేదు పైగా—

''ఏమని చెప్తావ్? నా బోయ్ ఫ్రెండ్‌తో సినిమాకీ, హోటల్‌కీ వెళ్ళానని చెప్తావా? ప్రేమంటేనే చిరాకుపడే అత్త, ''నా తల్లీ! సినిమా కెళ్ళావా? చాలా మంచి పని చేశావ్!'' అని ముద్దు పెట్టుకుంటుందా?'' నిగ్గదీసింది

''ఏమిటా అన్నం తినడం? పసిపిల్ల తిన్నట్టు!'' వాసంతి కంచంలోని అన్నం కెలకడం చూసిన మాధవి అంది

''ఆ కలి గాలేదు! ''

''ఏం ఆ రమ భోజనం కూడా అక్కడే చేయమందా?'' పదునుగా ఉందామె గొంతు

''అఁ హుఁ! టిఫిన్ పెట్టింది!''

మాధవి అదోలా నవ్వింది

బిత్తరపోయింది వాసంతి అత్త నవ్వు చూస్తుంటే ప్రళయం ముందు ప్రశాంతతలా తోచింది

''సాయింత్రం రమ వచ్చింది!'' తాపీగా అంది మాధవి

నెత్తిన పిడుగు పడ్డట్టు చూసింది వాసంతి

''అదీ కాదు నేను '' ఆమెకు దుఃఖం వచ్చేస్తోంది ఏనాడూ అత్తతో అబద్ధం ఆడి ఎరగని ఆమెకి, ఇంత పెద్ద అబద్ధం ఆడటం, ఆ అబద్ధాన్ని సమర్థించుకోడానికి మరికొన్ని అబద్ధాల్లాడ్డం ఇదంతా యాతనగా వుంది

''అత్త, ''ఎక్కడికెళ్ళావ్?'' లని నిలదీస్తే బావుండు! ''అర్ధరాత్రి వరకు ఇల్లు కనిపించలేదా?'' అని కళ్ళెరజేస్తే బావుండు!'' ఇలా వున్నాయామె ఊహలు

తన్నుకొచ్చే దుఃఖాన్ని తొక్కిపట్టి బలవంతంగా ముద్దలు మింగుతోంది

ఇద్దరిమధ్యా భయంకరమైన నిశ్శబ్దం ఆవరించింది

''అతనెవరు?'' నిశ్శబ్దాన్ని ఛేదించింది మాధవి

''అయిపోయింది! అనుకున్న ప్రళయం రానే వచ్చింది!'' కంటినిండా ఊరిన నీరు బయట పడటానికి సిద్ధంగా ఉంది

బేలగా చూసింది అత్తకేసి

''ఛ! అంత అమాయకురాల్లా నటించకు నా కసహ్యం! ఎవరతను?'' మళ్ళీ అదే ప్రశ్న వేసింది

''ప్రతాప్!''

''ప్రతాప్? పేరు బావుంది! కాని నే నడిగింది అతని పేరు కాదు! అతని చరిత్ర! అతనికీ, నీకూ ఎలాంటి పరిచయం?'' ముఖంలో ఎలాంటిభావం కనిపించనీకుండా అంది మాధవి

''.....''

''చెప్పు! ఫరవాలేదు! అర్ధరాత్రివరకు ఒక అపరిచయ వ్యక్తితో తిరిగిన దానివి అతనెవరో చెప్పడానికి ఇంత జంకుతావెందుకు? ఎన్నాళ్ళనుంచీ మీ పరిచయం?''

''దా దాపు నెలరోజుల్నుంచి!'' మెల్లగా అంది వాసంతి అత్త ముఖం పగిలే అగ్నిపర్వతంలా తోచిందామెకి

''ఓ! అయితే ఇప్పుడెక్కణ్ణించి రాక?''

'' , ''

''చెప్పు! సాయంత్రం ఇద్దరూ కలిసి ఎక్కడికెళ్ళారు?''

''సి నిమాకి!'' అబద్ధం చెప్పాలన్నా వాసంతికి చేతకాలేదు

''వెరీ గుడ్! ఒక్కనెల్లాళ్ళలో మంచి ప్రోగ్రెస్! ఆఁ ఆ తరువాత?'' కుతూహలంగా చూసింది మాధవి

''హోటల్ కి!'' ఒక్కసారి మాధవి కళ్ళలోకి చూసి తలదించుకుంది వాసంతి

మాధవి తృళ్ళిపడింది

''ఏమన్నావ్? హోటల్‌కి? హోటల్ కెళ్ళారా? అక్కడ?'' ఆవేశంతో ఆమె పెదవులు అదురుతున్నాయి కళ్ళు రక్తవర్ణం దాల్చాయి

''భోజనం చేశాం!'' గభాల్న అంది వాసంతి

''ఇప్పుడు ఇప్పుడు నువ్వొచ్చింది హోటల్‌నుంచి! అవునా?'' సూటిగా చూస్తూ అంది మాధవి

''అవును!'' మెల్లగా అంది వాసంతి

''మైగాడ్! ఒక పదహారేళ్ళ పిల్ల ఓ నెల్లాళ్ళ పరిచయంతో అర్ధరాత్రి దాకా హోటల్లో గడిపి వాడు వచ్చి ఇంటి దగ్గర దింపితే ఇంత ధైయిర్యంగా నోటికొచ్చి నన్ని అబద్ధాలాడి కన్నతల్లిలా చూసుకునే మేనత్తతో ఓ హారిబుల్!'' అసహ్యంగా చూసి, తినే తినే కుడిచెయ్యి పిడికిలిగా బిగించి ఆ చేతితో గడ్డంకిందపెట్టి వంచివున్న వాసంతి తల చటుక్కున ఎత్తి ''అక్కడ అక్కడ ఏం జరిగింది?'' తీక్షణంగా అంది మాధవి అంచులు దాటే ఆవేశాన్ని అదిమిపట్టిందని ఆవిడ ముఖం చూస్తేనే తెలిసిపోతుంది

''అసలు నేను వద్దంటే ఆ ప్రతాపే '' ఆమె మాట పూర్తికానేలేదు! ''షటప్! అడిగిందానికి సూటిగా సమాధానం చెప్పు! అక్కడేం జరిగింది?''

''అత్తా!'' దుఃఖంతో గిరగిరలాడింది వాసంతి గొంతు

''చెప్పవే పాపిష్టిదానా! చెప్పు! నీ జీవితం ఏ దశలో ఉందో చెప్పవే! ఆడదానికి శీలమే ప్రధానమని ఘోషించే భారతావనిలో జన్మించి, ఆ భరతావనికే కళంకం తెచ్చిపెట్టదల్చిన నీ దురదృష్టపు జాతకం ఎంతవరకు పతనమైందో విప్పిచెప్పవే!'' అరటచేత్తోనే ఆ పిల్ల జుట్టు పట్టుకుని గుంజి అంది మాధవి

ఆమెకీ పట్టరాని దుఃఖం వస్తోంది

అనురాగం తప్ప ఆగ్రహం చూడని అత్తలో ఆగ్రహం చూసిన వాసంతి భయంతో ఒణికి పోయింది

''అత్తా! ఏంజరగలేదత్తా! భోజనం చేశాం అంతే అదీ నేనొద్దన్నాను కానీ ప్రతాప్ '' వెక్కిళ్ళ మధ్య మాట రావడం లేదామెకి

''అంతేనా?''

## ఆ 'లయం'

జాతి, మత ద్వేషాల
అనలానికి
(అ) రాజకీయ అనిలం
తోడైతే
పవిత్ర దేవాలయం
హింసకు నిలయమైతే
అది
దానవతకు పునాది!
మానవతకు సమాధి!!

— చలమ్










"నిజంగా అంతే అత్తా! ప్రామిస్! నువ్వూహించే సంఘటనలేం జరగలేదత్తా! నేను చేసింది తప్పే! కానీ నీ చేతిలో పెరిగిన నేను అలాంటి నీచ భావాల్ని ఊహల్లోకికూడా రానీయనత్తా! నన్ను నమ్ము!" ఏడుస్తూ మాధవి కాళ్ల మీద పడిపోయింది వాసంతి

నిస్త్రాణగా కుర్చీలో వేరగిలబడిన మాధవి మోకాళ్ల మీద తల పెట్టుకుని చీరంతా కన్నీటితో తడిపేస్తున్న మేనకోడలి వెన్ను నిమురుతూ ఉండిపోయింది

ఆమె కన్నీరు చంపల మీదుగా ప్రవహించి వాసంతి తల మీద పడుతున్నాయి

* * *

మాధవీ టెక్స్‌టైల్స్, మాధవీ ఆటో మొబైల్స్, మాధవీ ఏజన్సీస్ వగైరా వ్యాపార సంస్థలన్నింటికీ ఏకైక యజమానురాలు మిస్ మాధవి

ఆమెకి దాదాపు ఇరవై అయిదు సంవత్సరాలు దాటాయి ఎందుకు పెళ్లి చేసుకోలేదో, కనీసం ఆ తలంపైనా ఎందుకు లేదో చాలా మందికి తెలియదు

కొంతమంది "లౌ ఎఫైర్" అనీ, కొంత మంది పురుషులంటేనే అసహ్యించుకునే "పురుషద్వేషిణి" అనీ ఇంకా బాగా ఊహాగానం చేసే ప్రబుద్ధులు, భర్త మరణిస్తే ఎక్కణ్ణించో వచ్చి కొత్త జీవితం ప్రారంభించి "మిస్"గా చలామణీ అవుతుందనీ అంటూంటారు ఆమె అక్కడ స్థిరపడి పదేళ్లయిపోయింది

అయితే సరైన వివరాలు మరీ దగ్గరివారికి తప్ప ఎవరికీ తెలియవు

వాసంతికి పద్దెనిమిది సంవత్సరాలు పసితనంలోనే తల్లి కరువై, తండ్రి పునర్వివాహం చేసుకుని ఓ హిడింబి లాంటి సవత్తల్లిని తెస్తే ఆమె పెట్టే యాతనల్ని కళ్లారాచూసిన మాధవి భరించలేక అన్నగార్నడిగి ఆ పిల్లని ఆనరకంలో నుంచి తప్పించి తన ఇంటికి తీసుకొచ్చింది

మాధవిని కంటికి రెప్పలా కాపాడి, కన్న తండ్రిలా ఆదుకుని పదేళ్ళక్రితం ఆంధ్రాలోని ఓ ఊర్నోనుంచి తనకున్న సర్వస్వాన్ని తెగ తెంపులు చేసుకుని ఆమె పేరిట అనేక సంస్థలను స్థాపించి వాటిని నలుమూలలా విస్తరింపజేసిన పరంధామయ్యగారి ఆరోగ్యం కూడా ఇటీవల కాస్త కుంటుపడింది

అక్కరకొస్తాడనుకున్న ఇరవై ఏళ్ళ కొడుకు హఠాత్తుగా ఇల్లు వదలి పారిపోతే, జీవితమే శూన్యమనుకుని కృంగిపోయిన పరంధామయ్య దంపతులను తన ఓదార్పు వచనాలతో సేదతీర్చిన మాధవిలో తమ బిడ్డని చూసుకుంటూ ఊరడి పొందారు ఆ దంపతులు

ఇదీ ఆ ఇంటి సంగ్రహ చరిత్ర

రాత్రంతా మాధవికిగానీ, వాసంతికిగానీ కన్ను మూత పడలేదు ఎవరి ఆలోచనల్లో వారున్నారు

"ఎంత ఆపద తప్పింది! అతనెలాంటి వాడో! కులగోత్రాలేమిటో! ఏం చదువుకున్నాడో!

అయినా ఆడవాళ్ళైనాసరే కొత్త వారితో మాట్లాడడానికి జంకే వసు ఇంత తక్కువ వ్యవధిలో ఒక అపరిచిత యువకుడితో సినిమాలకీ షికార్లకీ అంటూ అర్థరాత్రివరకూ ఎలా తిరుగుతోంది? ఇది వయసు కలిగించిన సాహసమా?

ఈ సాహసమే మరికొంత ముందుకుపోయి ఈ రోజు రమ చెప్పి ఉండకపోతే తను గమనించకపోతే మరో రోజు మరో హోటల్ కెళ్ళి, ఆపై ఛ! ఛ!" ఇంక ఆలోచించడానికి ఆమె మనసు అంగీకరించలేదు

మాధవి ఆలోచనలు ఇలా వుంటే,

"ఛీ! ఈ రోజు నా కేమైంది? అతనంటే మాత్రం తన బుద్ధెక్కడికిపోయింది? అయినా తన మనసులో ఇది తప్పు!" అని లేకపోతే అత్తకెందుకు చెప్పలేక పోయింది?

అయినా ప్రతాప్‌కి అన్నీ తొందరే! వీలు చూసుకుని అత్తతో చెప్పి ఆవిడ అంగీకారం కూడా తీసుకుని ఆపై మూడుముళ్ళూ పడాక ఈ సినిమాలు షికార్లు చూడచ్చని ఎన్నిసార్లు చెప్పింది? ఎక్కడా అతగాడు వింటేనా? ఛా! మరీ మొండి మనిషి! రేపు అత్త ముఖం ఎలా చూడాలో!" ఇలా ఉన్నాయి వాసంతి ఆలోచనలు

ప్రతాప్ గుర్తొచ్చిన వాసంతి పెదవుల మీదికి సన్నని సిగ్గుతో గూడిన చిరునవ్వు తొంగి చూసింది

హఠాత్తుగా ప్రతాప్‌తో తన పరిచయం గుర్తొచ్చిందామెకి

* * *

ఆ రోజు కాలేజీలో ఏదో ఫంక్షన్ జరుగుతోంది వరద బాధితుల సహాయార్థం ఓ నాటకం అరేంజ్ చేసి పెద్దలందరివద్దా చాలా విరాళాలు పోగుచేశారు ప్రిన్సిపాల్ గారు

అధ్యాపకుల కోరికపై మాధవిని ఒప్పించి ఆ నాటకంలో ఓ ప్రధాన పాత్ర అభినయించింది వాసంతి

నాటకం పేరు – శకుంతల

ముందు కాస్త భయపడినా శకుంతలగా ఆమె చాలా బాగా నటించింది దుష్యంతుడు కూడా తోటి విద్యార్థిని కావడంతో చాలా ఫ్రీగా నటించి అనేకుల ప్రశంశలందుకుంది

భరతుడుగా ఓ కాన్వెంట్‌లో చదివే చక్కని బాబుని తీసుకొచ్చారు నాటకం జయప్రదంగా ముగిసింది

మాధవి ఆరోగ్యం అంత బాగా లేనందున ఆమె ఈ నాటకానికి రాలేదు

నాటకం పూర్తయ్యాక పెద్దలిచ్చిన బహుమతులు అందుకుని, ఉత్సాహంగా గ్రీన్ రూమ్‌లోకొచ్చి మేకప్ రిమూవ్ చేసుకుంటున్న వాసంతి తృళ్ళిపడింది

దగ్గరగా వేసివున్న తలుపుమీద చిన్నగా టక టకమన్న శబ్దమూ, వెంటనే "మే ఐ కమిన్ ప్లీజ్!" అన్న ఓ గంభీర స్వరమూ వినిపించింది




ఇటీవల పైడిపాటి సాహిత్యపీఠం, విజయవాడవారు ఏర్పాటు చేసిన పారితోషిక ప్రదాన సభలో వేదికపై ఉన్న డా. జి.వి. సుబ్రహ్మణ్యం, డా. దివాకర్ల వెంకటావధాని, శ్రీయుతులు పి. ఆర్. రెడ్డి, పైడిపాటి సుబ్బరామశాస్త్రి, ఉమానాధశర్మగార్లని చిత్రంలో చూడవచ్చు.

# స్వాతి జల్లు

"ఎస్!... కమిన్!" అంది కుతూహలంగా చూస్తూ.

మెల్లగా తలుపు తీసుకుని వచ్చాడో యువకుడు.

"నమస్కారం!... నాపేరు ప్రతాప్!... వృత్తిరీత్యా ఇంజనియర్‌ని!... ఇంకా వివరంగా చెప్పాలంటే... మీ అబ్బాయికి బాబాయిని!" రెండు చేతులూ జోడించి సీరియస్‌గా అన్నాడు.

"వ్వాట్...?" అదిరి పడింది వాసంతి. ఆమె ముఖం కోపంతో అరుణిమ దాల్చింది. పక్కనున్న ఫ్రెండ్స్‌కూడా బిత్తరపోయారు.

"సారీ!... మీ... అబ్బాయంటే... అదే... భరతుడు! వాడికి స్వయంగా పినతండ్రిని" భయం నటిస్తూ అన్న ఆ తీరుకు అంతా నవ్వేశారు.

"భలేవారే!... కూర్చోండి!" అంది వాసంతి.

అతను కూర్చున్నాడు. "మీరు శకుంతలగా చాలా బాగా నటించారు.

అలనాడు కాళిదాసు ఊహించిన శకుంతల మీకన్నా అందంగా ఉండివుండదని బల్లగుద్ది చెప్తాను!!" నిర్భయంగా అన్నాడతను.

అతని చొరవకి విస్తుపోయింది వాసంతి.

"థ్యాంక్స్" ఇబ్బందిగా కదుల్తూ అంది.

"వస్తాను! బై! కార్లో బుడుగున్నాడు. ఆఁ ... అదే ... భరతుడు! వస్తాను!" మరోసారి నమస్కరించి వెళ్ళిపోయాడు ప్రతాప్.

[illegible] అతనితో [illegible]

ఆ తరువాత కూడా చాలాసార్లు [illegible] ప్రతాప్. సదా చిరునవ్వుని చిందిస్తూ సభ్యతకి భంగం కలగనంత ఫ్రీగా చక్కగా మాట్లాడే అతని స్వభావం చాలా నచ్చింది వాసంతికి.

అందుకే తను కూడా తన ముభావ స్వభావానికి గుడ్‌బై కొట్టింది. తనూ సరదాగా మాట్లాడటం మొదలుపెట్టింది.

ఆపై అతని కుటుంబం గురించి, అతని ఇష్టాయిష్టాల గురించి, తెలుసుకుంది. త్వరలో "మీరు" అన్న సంబోధనపోయి ఒకర్నొకరు "నువ్వు" అనుకునే చనువు, ఎక్కడైనా తటస్థపడితే ఇద్దరూ కలిసి కాస్త కాఫీ అదీ తాగడం, ఆపైన ఒకరిపై ఒకరు ఆశలు పెంచుకోవటం ఒకటొకటిగా జరిగిపోయాయి.

కానీ సినిమాకి, హోటల్లో డిన్నర్‌కి వెళ్ళడం మాత్రం ఇదే మొదటిసారి. ఎప్పటికప్పుడు మేనత్తతో ఈ విషయం చెప్పాలనుకుంటూనే ధైర్యం చాలక దాటేస్తూంది, వాసంతి. అలా అని ఆవిడకి తెలియకుండా స్వంత నిర్ణయాలు తీసుకుందామనీ కాదు!

ఈ రోజు కాలేజీనుంచి వస్తూంటే ... సరిగ్గా విశ్వశాంతికి పదిగజాల దూరంలో

## హై 'పిచ్'

రాజకీయం పాటగాళ్ళకి
కులమతాలు
పక్క వాద్యాలు
భోగం పానం అల్లరి
పిళ్ళ సంగీత ప్రియులకి నైవేద్యాలు
[illegible]ంలో కచేరీ
హైపిచ్‌లో సాగుతోంది
కచేరీ సాని[illegible]
మానవత్వం మూ[illegible]ంది !!!

— [illegible]కారి

పట్టుకుని "నీతో మాట్లాడాలి! మీ అత్తతో ఏదో ఒకటి చెప్పి అక్కడికొచ్చెయి!" అని నిర్ణీత స్థలం చెప్పి ఆ పిల్ల జవాబుకూడా వినకుండా వెళ్ళిపోయాడు ప్రతాప్.

మాధవికి ఏదో చెప్పేసి నీట్‌గా డ్రస్ చేసుకుని వెళ్ళింది వాసంతి అతను చెప్పిన స్థలానికి.

ఇద్దరూ ఓ చోటు చూసుకుని కూర్చున్నారు.

"మీ అత్తతో మన పెళ్ళిమాట చెప్పావా?" సీరియస్‌గా అన్నాడు ప్రతాప్.

"ఊహూఁ! ఏం?"

"ఇంకా ఎన్నాళ్ళు వాసంతీ! ఈ దాగుడు మూతలు? మనం తొందరగా పెళ్ళిచేసుకోవాలి!"

ఫక్కున నవ్వింది వాసంతి.

"ఎందుకా నవ్వు?"

"నవ్వకాక మరేమిటి ప్రతాప్? ఆ పెళ్ళి పడే తొందరేదో నేను పడాలిగానీ ... ఆడపిల్లలా నువ్వు ...?" మళ్ళీ నవ్వింది వాసంతి.

"ఏం చెయ్యను మరి! కాలమహిమ! ఊహూఁ! కాదు! ఈ కాలంలో పిల్లలు ప్రేమలు, ప్రణయాలు, విరహాలు... వగైరా... కాచి వడబోస్తున్నారు. మరి నువ్వో? పాతకాలపు అమ్మమ్మలా ఆ మూడు ముళ్ళూ పడితేనేగాని కనీసం చిటికెన వేలి గోరు కూడా తాకనివ్వవ్! మరి ఎలా? అందుకే నేను "పెళ్ళో పెళ్ళో" అని కలవరించేది!"

"ఓ! పాతకాలపు అమ్మమ్మలూ, వారి వారి స్వభావాలు నీకు బాగా తెలుసనుకుంటానే?"

"ఆఁ! ఆ! నువ్వే ఆ పాతకాలపు అమ్మమ్మవి!" బుంగమూతి పెట్టి మరీ అన్నాడు ప్రతాప్.

"అయితే సరే మనవడా! మనం పెళ్ళి చేసుకుందాం అంటావ్! అంతేగా? రేపే మా అత్తతో చెప్పి మన పెళ్ళికి లగ్నం పెట్టించేస్తాను! ఓకే!?"

"సరి! సరి! ఆ మహాతల్లి అంత తొందరగా ఒప్పుకుంటుందంటావా? తీరా హృదయాలు పారేసుకున్నాం ఇప్పుడు కాదంటే మళ్ళీ వాట్ని తెచ్చుకోవాలి!" తమాషాగా అన్నాడు ప్రతాప్.

"నో! నో! మా అత్త నా ఇష్టాన్ని ఏనాడూ కాదనదు! ఆవిడకీ నాకు వయస్సులో పెద్ద తేడా లేకపోయినా నన్ను కన్న కూతురిలా చూసుకుంటుంది." గర్వంగా అంది వాసంతి.

"అయితే ధన్యుణ్ణి! నేను దేవదాసును కానక్కర్లేదు!" నవ్వేశాడు ప్రతాప్. వాసంతి కూడా నవ్వేసింది.

ఆ తరువాత ఇష్టం లేకపోయినా అతని బలవంతం మీద సినిమాకి, ఆపై హోటల్‌కి వెళ్ళింది.

భోజనం కాగానే తను కార్లోనే వాసంతిని ఇంటిదగ్గర డ్రాప్ చేసి వెళ్ళిపోయాడు ప్రతాప్.

# సన్‌రైజ్ ఫ్లాస్క్ సదుపాయం

## ఉచితం!

ఈ ప్రత్యేకతగల సన్‌రైజ్ థర్మోస్ ఫ్లాస్క్ మీ సొంతమే!
కేవలం 5 ఖాళీ సన్‌రైజ్ 200 గ్రా. రీఫిల్ ప్యాక్‌లు యిచ్చి వాటి బదులు దానిని తీసుకోనవచ్చును.

సన్‌రైజ్ మంచి మరొకటి గొప్ప విలువైన సదుపాయం. 5 ఖాళీ సన్‌రైజ్ 200గ్రా. రీఫిల్ ప్యాక్‌లను సేకరించి, వాటిని మీ డీలర్ దగ్గరకు తీసుకువెళ్ళండి. అంతే, ఒక వారం లోపున, మీ సొంత సన్‌రైజ్ ఫ్లాస్క్, ఆయన దుకాణంలో మీ కోసం ఎదురు చూస్తూ వుంటుంది. మీరు చేయవలసిందల్లా, మళ్ళీ మీ డీలర్ షాపుకు వెళ్ళినప్పుడు, దానిని తెచ్చుకోవడమే. చాలా సులువైన పని, అవునా? అందుచేత మీ సేకరణ ప్రారంభించండి-ఇప్పుడే!



**త్వరపడండి!**
ఈ సదుపాయం
సెప్టెంబరు 15, 1984తో
ముగుస్తుంది

కొత్త
Nestlé
## సన్‌రైజ్
ఇన్‌స్టెంట్

ప్రాతఃకాలపు ఆ తాజాతనాన్ని అనుభూతి చెందేందుకు

8252

కానీ ఎవరి కంట ఆ సీన్ పడకూడదని అనుకున్నారో ఆమె కంట పడనే పడింది

''తను చెప్పకుండానే అత్తకి తెలిసిపోయి ఆమె ముందు తాము దోషులుగా నిల్చిపోయామే'' అన్న బాధ వాసంతిని కలత పెట్టేస్తోంది

''రేపు అత్త ఏం అడుగుతుంది ? ఈ రోజు కామ్‌గా ఉందంటే రేపు పెద్ద క్లాసే తీసుకుంటుంది ''నా కెందుకు చెప్పలేదు ?'' అంటే ఏమనాలి ? ''అసలు ప్రస్తుతం పెళ్లే వద్దు'' అంటే ? ''కాలేజీకెళ్లి చదువుకురావే అని పంపిస్తే ఈ ప్రేమ పారాలా నువ్వు నేర్చుకున్నది ?'' అని నిలదీస్తే ?

''తల్లి ప్రేమకి దూరమై గాలి ఎటువస్తే అటు ధూళిగా ఎగిరిపడుతున్న నిన్ను చేరదీసి కన్నతల్లిలా ఆదుకుని విద్యాబుద్ధులుచెప్పిస్తుంటే నాకు తెలీకుండా ఇంత గ్రంధం నడిపిస్తావా ?'' అని అసహ్యించుకుంటే ?'' కందిరీగల్లా ముసిరేస్తున్నాయి వాసంతిని ఆలోచనలు

* * *

''వసూ ! ''

రాత్రంతా నిద్రలేక ఏ తెల్లవారుఝాముకో కళ్ళు మూతబడిన వాసంతి మాధవి పిలుపుకు తృళ్ళిపడి లేచింది

మాధవి కడిగిన ముత్యంలా నీట్‌గా ఉంది

''సారీ! అత్తా! రాత్రి నిద్ర పట్టక ''

''ఫరవాలేదు ! లేచి స్నానం, టిఫిన్ అవీ ముగించి నాగదికిరా ! నీతో మాట్లాడాలి'' గంభీరంగా ఉందామె స్వరం

''ఇదో ! టూ మినిట్స్ ! '' గభాల్న లేచింది వాసంతి

మాధవి మౌనంగా తన గదికేసి వెళ్ళిపోయింది

వాసంతిలోని భయం మళ్ళీ విశ్వరూపం దాల్చింది ఎలాగో స్నానం, టిఫిన్ కానిచ్చి రెండు కప్పుల్లో కాఫీ తీసుకుని మాధవి గదిలో కొచ్చింది

అడుగుల చప్పుడుకు వాసంతి వచ్చిందని

## స్వాతి జల్లు

గ్రహించిన మాధవి ''రా ! అలా కూర్చో !'' అంది చదువుతున్న పేపర్లోంచి ముఖం తిప్పకుండానే

''అత్తా ! కాఫీ ! ''

''ఓ ! థ్యాంక్యూ !'' వాసంతి చేతిలోని కాఫీ అందుకుని పేపర్ పక్కనపడేసింది మాధవి

వాసంతి ఆమె కెదురుగా కూర్చుంది

ఇద్దరూ మౌనంగా కాఫీతాగుతూ కూర్చున్నారు

''ఆ ! ఇప్పుడు చెప్పు ! '' తాగిన కాఫీ కప్పు పక్కన పెడుతూ అంది మాధవి

''ఏమిటి ?''

''అదే ప్రతాప్ గురించి !''

''అతను ఇంజనియర్ !'' మెల్లగా అంది వాసంతి

''వెరీగుడ్ !''

''మనవాళ్ళే !''

''అచ్చా! ''

''నన్ను ప్రేమించాడు ! ''

''అఁ హఁ ! అన్నాడు !'' సరిచేసింది మాధవి

''కాదు ! నిజంగానే ప్రేమించాడు !'' ఈసారి కాస్త గట్టిగానే అంది వాసంతి

''బాగుంది ! కానీ . ఎలా తెలుసుకున్నావ్ ?''

'' ఎలా అంటే నా మనసు చెప్పింది !''

''ఓ ! ఇదింకా బావుంది ! కానీ ఏ సినిమాలోదీ డైలాగు ?''

''అత్తా !'' కోపంగా అంది వాసంతి

అత్త మాటల్లోని వ్యంగ్యం ఆ పిల్లని చికాకు పరుస్తోంది

''కోప్పడకు మై డియర్ వసూ ! అతనికీ నీకూ అసలు పరిచయమెలా అయింది ?''మాధవి మాటల్లో కాస్త తీక్షణత తగ్గింది

ఉన్నది ఉన్నట్టు అంతా చెప్పింది వాసంతి

ఓ క్షణం ఆలోచనలో పడింది మాధవి ఆమె ముఖంలోని భావాలు చదివిన వాసంతికి ఉత్సాహం వచ్చింది

''నిజం అత్తా ! అతను చాలా మంచివాడు ! తండ్రి లేకపోవడంతో అన్నగారే అన్నీ చూస్తారు అయనకూడా చాలా మంచివారట!''

''అలా అని అతను అదే ప్రతాప్ చెప్పాడా ?''

''అవును ! నా గురించి చెప్పగానే చూడనైనా చూడకుండా ''నీ ఇష్టమే నా ఇష్టం'' అనేశారట !''

''ఓ ! అంతవరకు వచ్చిందన్నమాట'' మాధవి కంఠం అదోలా ధ్వనించింది

''నాకు తెలియకుండానే ఇంత కథ నడిచిందన్నమాట !'' అన్నట్టుంది

''సారీ ! అత్తా ! నిన్నడిగిన తరువాతే ఆయనకి చెప్దామన్నాను కానీ నా ఇష్టాన్ని ఏనాడూ నువ్వు కాదనవనే ధైర్యం నాకుంది అందుకే ''

''ముందుకాళ్ళకి బంధమన్నమాట!'' నవ్వింది మాధవి

''అది కాదత్తా ! '' నసిగింది వాసంతి

''ఓ ! కే ! ఇవాళ ఆదివారమేగా సాయంత్రం అతన్నోసారి మనింటికి తీసుకురా ! ఆ తరువాత మిగతా విషయాలు మాట్లాడుకుందాం'' ''ఇంక మాట్లాడటానికేంలేదు !'' అన్నట్టు లేచింది మాధవి

''థ్యాంక్యూ ! థ్యాంక్యూ ! అత్తా ! '' ఆనందంగా అత్తని చుట్టేసింది వాసంతి

''అఁ ! ఆగాగు ! నేను ! అత్తని !'' నవ్వుతూ అన్న మాధవి మాటలోని భావాల్ని గ్రహించిన వాసంతి సిగ్గుతెరలు క్రమ్ముకురాగా దోసిట్లో ముఖాన్ని దాచుకుని రివ్వున తన గదిలో కొచ్చిపడింది

[ఇంకా వుంది]

# డాక్టరు కాని డాక్టరు ఎడ్గార్ కేసే

వైద్యశాస్త్రం అభ్యసించకపోయినా, రోగులకు తమ అతీంద్రియశక్తి సహాయంతో అద్భుతమైన, ఆశ్చర్యకరమైన చికిత్స చేసి, స్వస్థత చేకూర్చి విశేషమైన కీర్తిప్రతిష్ఠల నార్జించిన ప్రముఖులలో ఎడ్గార్ కేసేకి అతిముఖ్యమైన స్థానం ఉంది

అమెరికాలోని కెంటకీలో 1877వ సంవత్సరంలో ఒక సాధారణ కుటుంబంలో జన్మించిన ఎడ్గార్‌కి చదువు అంతగా ఎక్కక పోవడంతో తండ్రి అతనిని తొమ్మిదవ తరగతితో ఆపించి ఒక పళ్ళ దుకాణంలో సేల్స్‌బాయ్‌గా ఉద్యోగ మిప్పించాడు ఎడ్గార్ అక్కడ కొన్నాళ్ళు పనిచేసి తరువాత, ఒక బుక్‌షాపులో కొన్నాళ్ళు చేసి చివరిగా ఒక ఇన్సూరెన్సు కంపెనీలో ఏజంటుగా మారాడు ఆ సమయంలో అతనికి తీవ్రంగా అస్వస్థత చేకూరి మంచం పట్టాడు ఆ జబ్బు ఎక్కువయి అపస్మారక స్థితిలో పడినపుడు డాక్టర్లు ఎన్ని మందులు వేసినా అతనికి స్వస్థత చేకూరలేదు ఒకరోజు అతను అకస్మాత్తుగా, అపస్మారక స్థితిలోనే మాట్లాడటం ప్రారంభించాడు డాక్టర్లు, బంధువులు ఆత్రుతగా ఏమి చెప్తాడో అని చెవులు రిక్కించుకుని కూర్చున్నారు అపుడు ఎడ్గార్ తనకు వచ్చిన జబ్బు వివరాలు, దానికి ఇవ్వవలసిన మందుల వివరాలు చెప్పడం ప్రారంభించాడు అనంతరం వారు నమ్మకం లేకపోయినా అతను చెప్పిన ప్రకారమే మందులు ఇవ్వగా అత్యంత ఆశ్చర్యకరంగా ఎడ్గార్ లేచి కూర్చున్నాడు అలాగ తనతోనే ప్రారంభమయిన ఈ అద్భుత వైద్యం లనతికాలంలోనే ఎడ్గార్‌ని ప్రపంచంలో ప్రముఖ వ్యక్తిగా చేసింది

ఖివరికి ఎటువంటి జబ్బు వచ్చినా, ఎడ్గార్ ఒక నిద్రలాంటి స్థితి అయిన ''ట్రాన్స్''లోనికి జారుకుని, ఆ జబ్బు ఎలా వచ్చింది, ఏ యే మందులు వాడితే నయమవుతుందో సవివరంగా చెప్పి ఎంతో మందికి స్వస్థత చేకూర్చేవాడు డాక్టర్లకు కూడా నయంకాని ఎన్నో మొండి వ్యాధులను ఎడ్గార్ నిద్రలో నివారణోపాయాలు చెప్పి అందర్నీ ఆశ్చర్యపరిచేవాడు

సైకిక్ హీలర్, మిరకిల్ మేన్, స్లీపింగ్ ప్రాఫెట్ అని వివిధ పేర్లతో వ్యవహరింపబడే ఎడ్గార్‌ని ఎంతోమంది పెద్ద పెద్ద డాక్టర్లు, ఒర్నలిస్టులు పరీక్ష చేసి, లతను నిద్రలోకి పోయినపుడు ఏదో ఒక అతీంద్రియ శక్తి ద్వారా




మాత్రమే అతను వ్యాధులకు నివారణోపాయాలు చెప్పగలుగుతున్నాడనీ, మామూలు ప్రాథమిక విద్య నభ్యసించిన వ్యక్తికి ఇంత వైద్య విజ్ఞానం ఉండటం అసంభవమని వారందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు

తనవద్దకు వచ్చిన రోగులవద్ద చిల్లిగవ్వ కూడా తీసుకోకుండా వైద్యం చేయటంవలన మిగతాడాక్టర్లకు ఇది ఎంతో కష్టంగా వుండేది డాక్టర్ వెస్లీ కెచెమ్ అనే ఒక డాక్టరు ఇతని గురించి ఎంతో దుష్ప్రచారం, మొదట్లో ఎంతో చేసాడు కానీ చివరకు అతను కూడా ఎడ్గార్ అభిమానిగా మారిపోయాడు కారణమేమిటంటే అతనికి ఒకసారి అకస్మాత్తుగా పొత్తి కడుపులో నొప్పివస్తే డాక్టర్లు అది ఎపెండి-




సైటిస్ అనీ, ఇరవైనాల్గు గంటల్లో ఆపరేషన్ చెయ్యాలనీ అన్నారు ఆసుపత్రిలో చేరేముందు ఎడ్గార్‌ని పరీక్ష చేద్దామనే ఉద్దేశ్యంతో అతనిని సంప్రదించగా, ఎడ్గార్ ''ట్రాన్స్'' లోనికి వెళ్ళి అది ఎపెండిసైటిస్‌కాదనీ, అది వెన్నెముకలోని ఒక చిన్న లోపంవలన ఏర్పడిన అస్వస్థత అనీ, దానికి తీసుకోవలసిన మందును సూచించాడు నమ్మకం లేకపోయినా, డాక్టర్ వెస్లీ ఆ మందును వాడాడు వాడిన మూడు గంటల్లో గుణం కనపడింది, మర్నాటికి పూర్తిగ నయమయింది ఎడ్గార్‌పై పూర్తి విశ్వాసం ఏర్పడి డాక్టర్ వెస్లీ, ఒక పెద్ద రిపోర్టును తయారు చేసి ''అమెరికన్ సొసైటీ ఆఫ్ క్లినికల్ రీసెర్చి''కి పంపుతూ ఎడ్గార్‌కి వైద్యశాస్త్రంలో పట్టాలేక పోయినా పట్టభద్రులకన్నా విశిష్టమైన సేవ చేస్తున్నాడు, అతనికి అన్నివిధాల సహకరించమని కోరాడు

1910 సంవత్సరంలో ''న్యూయార్క్ టైమ్స్'' పత్రిక ప్రతినిధి ఒకరు ఎడ్గార్‌ని ఈ అద్భుతమైన కార్యాన్ని ఎలా నిర్వర్తించగలుగుతున్నావని అడిగినపుడు ఎడ్గార్ ఇలా అన్నాడు నాకు భగవంతుడిమీద అపారమైన విశ్వాసం ఉంది బహుశః ఆ దేవుడే నా చేత అలా చెప్పిస్తున్నాడేమో ! నేను మాత్రం నావద్దకు వచ్చిన రోగులకు పూర్తిగా స్వస్థత కూర్చాలనే సదుద్దేశంతో ట్రాన్స్‌లోకి వెళ్తున్నాను మనసా, వాచా, త్రికరణశుద్ధిగా వారికి సంపూర్ణ ఆరోగ్యం సంక్రమించాలని, ప్రార్థించి, వారినుంచి ఎటువంటి ప్రతిఫలాన్ని ఆశించకుండా నిస్వార్థంగా ఉండాలని నిర్ణయించుకుని ఆ నిద్రలోకి వెళ్ళినపుడు నాకు వారిజబ్బుకు సరిపడే మందు ఎవరో చెప్తున్నట్లుగా అనిపిస్తుంది అదే నేను పైకి అంటున్నాను ఇంతకన్నా మరేమీ లేదు'' అన్నాడు ఈ వార్తను ''న్యూయార్క్ టైమ్స్'' 1910 అక్టోబరు తొమ్మిదవ తారీఖున ప్రముఖంగా ప్రచురించింది అది ప్రజల్లో ఎంతో సంచలనాన్ని రేకెత్తించింది కొంతమంది నాస్తికులు ఎడ్గార్‌ని కలుసుకుని తమకు దేవుడిమీద, దయ్యాలమీద నమ్మకం లేదనీ, ధైర్యం ఉంటే తమ ముందు చెయ్యమని సవాలు చేసారు ఎడ్గార్ వారిలో కొందరి విషయంలో ''ట్రాన్స్''లోకి వెళ్ళి అనుకున్న










## అద్భుత వ్యక్తులు

అనారోగ్యాలను చెప్పి వాటికి మందులు సూచించాడు. వారు తమకు ఆ అనారోగ్య మున్నట్లు అంగీకరించి అతను చెప్పిన మందులు వాడారు.

ఎడ్గార్ కేవలం వైద్యమే కాకుండా జరగబోయే విషయాలను చెప్పడంలోకూడా అందె వేసిన చెయ్యిగా పేరు తెచ్చుకున్నాడు. తన స్నేహితులకు ప్రమాదాలు జరగబోయే ముందు, ముందుగానే సూచించిన సందర్భాలెన్నో ఉన్నాయి. మొదటి ప్రపంచ యుద్ధం జరగబోయే ముందు కూడా ఎడ్గార్ ఆ విషయాన్ని స్నేహితులతో చెప్పాడని ఋజువులతో సహా ఉంది.

ఎడ్గార్‌లో ఈ అద్భుతశక్తి చివరి నిమిషం వరకు ఉంది. 1945లో మరణించిన ఎడ్గార్ దాదాపు 43 సంవత్సరాలపాటు ముప్పైవేల మందికి పైగా నివారణ కలిగించి అమెరికా చరిత్రలో ఒక అతి ప్రముఖ వ్యక్తిగా గుర్తింప బడ్డాడు. 1927లో ఎడ్గార్ వర్జీనియా బీచ్ వద్ద స్థాపించిన "ది అసోసియేషన్ ఆఫ్ నేషనల్ ఇన్వెస్టిగేటర్స్" అనే హాస్పిటల్‌లో ఇప్పటికీ అతని కొడుకులు ఈ అద్భుత వైద్యానికి సంబంధించిన ముప్పైవేలకేసుల రికార్డులు అతి జాగ్రత్తగా భద్రపరచారు. అందులో పేషెంటు పేరు, అతనికి సంక్రమించిన వ్యాధి, దానికి ఎడ్గార్ సూచించిన మందు, ఆ మందు తీసుకున్న తరువాత పేషెంటుకు స్వస్థత కలిగిందా? లేదా? లాంటి ఆసక్తికరమైన విషయాలు ఎన్నో ఉన్నాయి. కేవలం పదుశాతం కేసులు తప్ప మిగతా అన్ని కేసులూ దిగ్విజయంగా నయం చేసిన ఎడ్గార్ పేషెంట్లకు తిరిగి ఆ అనారోగ్యం ఎపుడూ రాలేదు. దానికి కారణం వచ్చిన అనారోగ్యం పోవటానికి మందివ్వకుండా అనారోగ్యం సంక్రమించడానికి కారణమైన మూలం కనుక్కొని దానికి మందు ఇవ్వటమే. ఎడ్గార్ వద్ద వైద్యం చేయించుకున్న వారిలో ఎందరో ప్రముఖులున్నారు.

అమెరికా, ఇంగ్లండు దేశాలలోని మెడికల్ అసోసియేషన్ల వారు ఎడ్గార్ కేసులను వారి పత్రికలలో ప్రముఖంగా ప్రచురించినా అతనిని వారు చివరి నిముషం వరకు డాక్టరుగా గుర్తించ లేదు. కానీ కొన్ని లక్షలమంది హృదయాలలో అతను డాక్టరుగా చెరగని ముద్ర వేసుకో గలిగాడు.



పై వారం:

**చేతి వేళ్ళని కళ్ళుగా ఉపయోగించుకున్న అద్భుత మహిళ రోసాకులేష్కోవా.**

# వారఫలం

**27-7-1984 శుక్ర వారం మొదలు 2-8-1984 గురువారం వరకు**

**మేషం** విపరీతంగా ధనం ఖర్చు చేయవలసిన పరిస్థితులుంటాయి రాబడికన్నా వ్యయం అధికం వ్యాపారం బాగా సాగుతుందిగాని ప్రయోజనం? చిరకాలంగా అప్పులు వసూలు కావలసినవి చాల ఉన్నాయి రాబట్టుకోవాలి స్త్రీలకు విజయవంతమైన వారం

**వృషభం** ముందు వెనుకలు ఆలోచించి కార్యరంగానికి దిగాలి విపరీతమైన ధనం పెట్టి విలువగల వస్తువులు సేకరించికోగలరు ఉద్యోగ మందు కొన్ని మార్పులు రానున్నవి గమనించి మెలగండి స్త్రీలకు ఆదాయం ఉద్యోగ మార్పు కొందరకు స్థాన చలనం గల వారం

**మిథునం** మీ యింట శుభం జరుగనున్నది మీ మాటకు విలువ పెరుగనున్నది కొందరకు సభా కార్యక్రమంలో సదవకాశాలు లభ్యం కాగలవు గ్రామమందు ఆదికాదరణ లభించనున్నది స్త్రీలకు వృత్తి యందు పెంపు నూతనోద్యోగ విషయాలందు పెంపు కనివిస్తుంది

**కర్కాటకం** రాజకీయంగా మీకు మేలు చేకూరుతుంది మాటకు మన్నన లభిస్తుంది నూతనాంశాలు గ్రహిస్తారు విద్యా వైజ్ఞానిక రంగాలలో మేలు చేకూరే అవకాశమున్నది స్త్రీలకు రచనా విధాన మందు రాణింపు నాట్య విధానాన పెంపు సమకూరగల వారం

**సింహం** ధనలబ్ది వ్యాపారమందు అభివృద్ధి వ్యవహార విజయం నూతన వ్యాపారం ప్రారంభించే అవకాశాలు చేకూరగల వారం కొందరకు చాల కాలంగా ఉన్న వ్యవహారం పరిష్కరింపబడుటకు అనువైన వారం స్త్రీలకు నూతనాంశాలు గ్రహింపునకు రాగలవు వృత్తి యందు వికాసం లభ్యం

**కన్య** అధికారమందు అభివృద్ధి కించిత్తు ఆదాయమందు పెంపు వ్యవహార రీత్యా మేలు రచనా విధానాన పెంపు బాగస్తులతో మనస్పొరలకు అవకాశం కూడా ఏర్పడగల సమయం కొందరకు దూర దేశ ప్రయాణాలు చెప్పదగిన అంశం ఒకానొక విషయంలో మీ ప్రజ్ఞ రాణించటం తద్వారా మీకు ధనాదాయం లభించటం చెప్పదగిన అంశం స్త్రీలకు చిరకాల వాంచ సిద్ధించటం అధికార వర్గం మూలాన ఏదో మేలు లభించటం గమనింపదగిన అంశాలు

**తుల** వృత్తియందు మీకు వికాసమున్నది మీ ఆదాయమందు అభివృద్ధి కనిపింపనున్నది రాజకీయంగా మేలు పొందనున్నారు వ్యవహార రీత్యా అనుకూలత సాధింపనున్నారు పది మందిలో పేరు ప్రతిష్ఠలు అభివృద్ధినొందగల సన్నివేశాలుంటాయి స్త్రీలకు ఉద్యోగ మందు అభివృద్ధి ఆదాయం చేకూరగల వారం

**వృశ్చికం** సజ్జన గోష్ఠి అధికార మందు అభివృద్ధి పదిమందిలోపేరు ప్రతిష్ఠలకు అవకాశం దూర బంధువులు యింటికి రావటం గమనింపదగిన ముఖ్యాంశాలు లలిత కళా ప్రావీణ్యతగల వారికి వారాంతాన సదవకాశాలు లభ్యం కానున్నవి స్త్రీలకు ఆదాయం వృత్తి ఉద్యోగాలందు మేలు చేకూరగలదు

**ధనుస్సు** పదిమందిలో పేరు ప్రతిష్ఠలు రానున్నవి కొందరకు దూర ప్రాంతాలకు ప్రయాణించే అవకాశం ఏర్పడనున్నది ఉద్యోగ చలనం కొందరి పట్ల చెప్పదగిన ముఖ్యాంశం స్త్రీలకు గృహ ఉద్యోగాలందు పెంపు చెప్ప వచ్చు ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం

**మకరం** బంధువులతోనో మిత్రులతోనో మాట పట్టింపులు రావచ్చు అనవసరంగా కొందరితో పేచీలు రాగల అవకాశాలున్నాయి మాట తప్పిన అపనింద కొందరకు బాధాకరం కావచ్చు చుట్టు ప్రక్కల వారిని గమనించి మెలగండి స్త్రీలకు ధనాభివృద్ధి వైజ్ఞానికంగా అభివృద్ధి

**కుంభం** విరోధి వర్గాన్ని జాగ్రత్తగా గ్రహించాలి వారితో అమిత జాగరూకతతో మెలగవలసిన సమయం చిక్కినట్లే కనిపించి కళారంగాన సదవకాశాలు జారిపోతాయి మిత్ర బంధువులతో మాట పట్టింపు రాకుండా చూచుకోవాలి స్త్రీలకు నూతనాంశాలు గ్రహించుటకు వ్యాపారంలోగాని ఉద్యోగంలోగాని మేలు పొందుటకు అవకాశమున్నది

**మీనం** వ్యవహార రీత్యా మీకు మేలైన వారం మిత్ర సహాయ సంపత్తులు లభ్యం కాగలవు చాల మందికి రచనా విధానాన మేలున్నది పత్రికా రచయితలకు ప్రకటన కర్తలకు సదవకాశాలు లభించగలవు పదిమందిలోపేరు ప్రతిష్ఠలు లభ్యం కాగలవు మీ తాలూకు మనుష్యులే మిమ్ము వ్యతిరేకించగలరు గ్రహించి మెలగండి స్త్రీలకు ఉద్యోగ రీత్యా వ్యవహార రీత్యా మేలైన వారం గ్రహించేది

—విద్వాన్‌కోట సత్య రంగయ్య శాస్త్రి

# వ్యక్తిగతం



ప్రఖ్యాత కన్నడ రచయిత శ్రీమాస్తి వెంకటేష్ అయ్యంగార్‌కి 1983 వ సంవత్సరానికి భారతీయ జ్ఞానపీఠం అవార్డు లభించింది ఈయనవయసు 92 సంవత్సరాలు [illegible] ప్రతిష్ఠాత్మకమైన ఈ శతాధిక గ్రంథ కర్త రాసిన "చికవీర రాజేంద్రన్" అన్న నవలకి ఈ అవార్డు వచ్చింది లక్షన్నర రూపాయల నగదు బహుమానం ఈ అవార్డు వల్ల లభిస్తుంది జ్ఞానపీఠం అవార్డు పొందిన 19 వ వ్యక్తి ఈయన, కన్నడ రచయితలలో నాలుగవ వారు



పాప్ సంగీతంలో సంచలనాన్ని సృష్టించి సూపర్ స్టార్‌గా పేరు తెచ్చుకున్న మైకేల్ జాక్సన్ (20)ని ఒక వంచకుడిగా సోవియట్ స్క్రయా [illegible] పత్రిక అభివర్ణించింది అతను రూపొందించిన 'థ్రిల్లర్' ఆల్బం మూడున్నర కోట్ల కాపీలకి పైగా అమ్ముడయింది ఇదంతా వ్యాపార పరమైన మోసం అని ఆ పత్రిక పేర్కొంది అతను రాజకీయాలకి వ్యతిరేకి, శాకాహారి, మత విశ్వాసాలుగల మూఢాచార పరాయణుడని ఆ పత్రిక రాసింది తాను నూటికి నూరు శాతం తెల్లవాడుగా ఉండాలనే ఉద్దేశ్యంతోనే అతను ప్లాస్టిక్ సర్జరీ చేయించుకున్నాడని ఆరోపించింది రష్యాలోని చాలామంది పాప్ సంగీతాభిమానులకి, జాక్సన్ పెప్సీ కోలా వ్యాపార చిత్రానికి పనిచేస్తున్నప్పుడు ప్రమాదవశాత్తు అతని జుట్టు అంటుకుని బాగా కాలినందువల్ల ప్లాస్టిక్ సర్జరీ చేయించుకున్న విషయం తెలుసు ఈ పెప్సీకోలా ప్రమాదం వార్తకి అమెరికాలోని ప్రచార సాధనాలన్నీ మియామీలోని అల్లర్లు, లెబనాన్‌లో హింసాకాండలని మరుగుపరిచే విధంగా ప్రచారాన్ని యిచ్చాయని ఆ పత్రిక అపహాస్యం చేసింది అయితే మాస్కోలోని డిస్కో, నైట్‌క్లబ్ ప్రియులని మాత్రం ఆ పత్రిక నమ్మించలేకపోయింది

# అమ్మ

కాకాని కమల




అర్ధరాత్రి

సమయం పన్నెండు గంటలు కావస్తోంది

గడియారం టిక్ టిక్ మన్న శబ్దంతప్ప ఇతరత్రా ఏ చిన్న అలికిడి లేదు

మధ్య హాలులో వెలుగుతున్న చిన్న నీలిరంగు బెడ్‌లైటు వెలుతురు మినహా ఇల్లంతా చీకటిగా వుండి

దక్షిణంవైపు వున్న పడకగదిలో శేషాద్రి, అతని భార్య, ఎసారా అరుగుమీద పనివాడు రంగన్న హాయిగా ఆదమరిచి నిద్రపోతున్నారు

కాని హాలుకి ఎడం ప్రక్కనవున్న గదిలో చిన్న మంచంలో ఒంటరిగా పడుకున్న 'శీనూ'కి మాత్రం నిద్ర పట్టటంలేదు

కళ్ళు తెరుచుకుని అలా నిశ్శబ్దంగా చీకట్లోకి చూస్తూ పడుకున్నాడు

''అమ్మ'' బ్రతికున్నప్పుడైతే అసలు శీనూకి నిద్ర పట్టకపోవటం అంటూ లేదు

తులసికోట దగ్గర సందెదీపం వెలిగించగానే అమ్మ

"శీనూ ! పొద్దుగూకింది అన్నం తిందువు గాని రా " అంటూ వెండి కంచంలో వేడి వేడిగా అన్నం ఒడ్డించి నెయ్యి, కూర వేసి గడ్డ పెరుగుతో దగ్గరుండి కొసరి కొసరి కడుపునిండా తినిపించేది

శీనూ అన్నం ఎక్కువైందని ఆయాస పడితే – అమ్మ శీనూ గుండెమీద అరచేత్తో రాస్తూ, "జీర్ణం జీర్ణం వాతపి జీర్ణం – శీను గాడు తిన్న బువ్వంతా జీర్ణం .." అని శీనుని నవ్వించేది. ఆ తరువాత మెత్తగా పక్కవేసి పడుకోబెట్టి లాలనగా చిచ్చుకొడుతూ

"రామా లాలీ – మేఘశ్యామా లాలీ

తామారస నయన దశరథ తనయా లాలీ"

అంటూ తియ్యని కంఠంతో జోల పాడేది

కాని ఇప్పుడెవరున్నారని ?

ఇదివరకసలు ఎప్పుడైనా ఇలా నిద్రపట్టక పోవటం అంటూ వుందా ?

శీనూ ఒంటరిగా ఇలా పడుకుని ఎరుగునా?

కాని ఇప్పుడు ?

అమ్మ చచ్చిపోయింది . అన్నీ కరువై పోయినాయ్ నిద్ర కూడా కరువైపోయింది

శీనూకి తల్లి జ్ఞాపకం వచ్చింది

కళ్లనిండా గిర్రున నీళ్ల నిండాయి కన్నీరు చుక్కలు చుక్కలుగ ధారలు కట్టి కనుకొలుకు ల్లోంచి జారి దిండులోకి ఇంకి పొయ్యాయి

శీనూ అలాగే నిశ్శబ్దంగా వెక్కిళ్లు పెడుతూ చీకట్లోకి చూస్తూ వుండిపొయ్యాడు.

ఇందాక గడియారం పది కొట్టటం విన్నాడు

పదకొండు కొట్టటం విన్నాడు

ఆ తరువాత "ఠంగ్ " మని అరగంట కూడా కొట్టింది.

టిక్ .టిక్ అన్న శబ్దం తప్ప మిగతా అంతా నిశ్శబ్దం

చీకట్లోకి చూస్తూ చెవులు రిక్కించి "పన్నెండు గంటలు" ఎప్పుడు అవుతుందా అని ఎదురు చూస్తున్నాడు శీనూ .

ఈ రాత్రి శీనూ ఒక చిన్న దొంగతనం చెయ్యాలని నిర్ణయించుకున్నాడు

గోపి చెప్పాడు దొంగతనం ఎప్పుడూ సరిగ్గా అర్ధరాత్రి పన్నెండింటికే చెయ్యాలని

ఆ సమయంలో అయితే అంతా నిద్రపోతూ వుంటారని పని సులువుగా జరిగిపోతుందని కూడా చెప్పాడు.

అందాకా ఆ సమయంకోసం కాచు క్కూర్చున్నాడు

శీనూ ఒక్కసారి దీర్ఘంగా వూపిరి తీసుకుని దుప్పటి సరిగ్గా కప్పుకుని కాస్త పక్కకి ఒరిగి పడుకున్నాడు చలి బాగానే వుంది

అయినా సరే నిద్రపోదల్చుకోలేదు

ఎలాగయినా సరే తనకి కొంచెం డబ్బు కావాలి. కనీసం నాలుగు రూపాయలన్నా కావాలి

నాన్నని అడిగితే ఇవ్వడు. సరికదా ."వేలెడు వెధవ్వి లేవు నీకంత డబ్బెందుకురా?" అని తిడతాడు

ఎప్పుడైనా ఐస్‌క్రూట్ కొనుక్కోమని పది పైసలు ఇస్తాడు లేకపోతే పావలానో అర్ధో ఇస్తాడు. అంతకుమించి ఒక్క పైసా ఎక్కువ ఇవ్వడు

"నీకేం కావాలో చెప్పూ కొనిస్తాను." అంటాడు మొన్నేం జరిగింది ?

కొత్త పిన్ని పోపుల డబ్బాలో చిల్లర డబ్బులు పెడితే పోయాయట!

"ఈ శీనుగాడే తీసుంటాడు" అంటూ నాన్నకి ఫిర్యాదు చేసింది

అంతే !

నాన్న తన దగ్గరకి వచ్చి–

"ఏంరా ? చదువు లేనేలేదు దొంగతనం కూడా మొదలు పెట్టావా ? వెధవా ." అంటూ తన చెంపమీద ఛెళ్ళున కొట్టాడు ఎంత చురికిందని ? ఆ రోజంతా చెంప మండుతూనే వుంది,

నిజానికి ఆ డబ్బు తను తియ్యలేదు

ఆ చిల్లర పైసల సంగతి తనకసలు తెలియదు

కొత్త పిన్నికి తనంటే కోపం. అందుకే అస్తమానం తనమీద నాన్నకి అలా కొండేలు చెపుతుంది నాన్న అవన్నీ నమ్మేస్తాడు తనని కొడతాడు తను నిజం చెప్పినా నమ్మడు

అందుకే తను నాన్నకి ఏమీ చెప్పటం, అడగటం మానేసాడు.

అసలు అమ్మ చచ్చిపోయ్యాక నాన్నతో మాట్లాడటమే మానేశాడు

ఎందుకు మాట్లాడటం ?

నాన్నకి కొత్త పిన్ని అంటేనే ఇష్టం ఇవన్నీ అమ్మకి చెప్పాలి

అందుకే ఇప్పుడు తనకి నిజంగానే కొంచెం డబ్బు కావాలి

గోపి చెప్పాడు కనీసం నాలుగు రూపాయ లన్నవుంటేగాని సరిపోవని

నాన్నని అడిగితే ఇవ్వడు పైగా ఎప్పుడూ తోకలా పక్కన పిన్ని !

అందుకే ఈ రోజు దొంగతనం చెయ్య టానికే నిర్ణయించుకున్నాడు

గోపి చెప్పాడు 'సరిగ్గా అర్ధరాత్రి పన్నెండు గంటలు అవ్వగానే నెమ్మదిగా లేచి మీ నాన్న జేబులోంచి ఓ నాలుగు రూపాయిలు తీసుకురా" అని, ఆ తరువాత ఏం చెయ్యాలో తనకి బాగా తెలుసునని ఆ విషయం తను చూసుకొంటానని చెప్పాడు.

"ఆ డబ్బుతో ఆ డబ్బుతో అమ్మకి ఉ "

"ఠంగ్ . ఠంగ్.. ఠంగ్ . "

శీను త్రుళ్ళిపడి మంచంలో లేచి కూర్చు న్నాడు

గడియారం "ఠంగ్ ఠంగ్ " మని గంటలు కొడుతుంటే గుండెల మీద చెయ్యేసు కుని పన్నెండు గంటలు లెక్క పెట్టాడు

తరువాత గంటలు ఆగిపొయ్యాయి

తిరిగి ఇల్లంతా నిశ్శబ్దం ఆవరించింది

టిక్ టిక్ మన్న గడియారం అలికిడి మినహా ఇతరత్రా ఏ చిన్న అలికిడి లేదు

శీను వూపిరి బిగపట్టి మెల్లగా మంచం దిగి పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ మధ్య హాలులోకి వచ్చాడు

మనసులో చాలా భయంగా వుంది

ఒళ్లంతా మంచులా గడ్డ కట్టుకుపోతోంది

కాళ్ళు చేతులూ స్వాధీనం తప్పినట్లు తడబడి పోతున్నాయ్

ఒక్క క్షణం వెనక్కు వెళ్ళిపోదామా అని పించింది కాని మనసు మొరాయించింది

శీను ధైర్యాన్ని కూడ గట్టుకున్నాడు

"ఊహూఁ తను ఎలాగైనా సరే అమ్మ దగ్గరికి వెళ్లిపోవాలి కాని ఆ విషయం మరి అమ్మకి తెలియాలి కదా? తెలియాలంటే డబ్బు కావాలి కదా? కనీసం నాలుగు రూపాయలన్న అవసరం వుంటాయని కదా చెప్పాడు గోపి "

శీనూ శక్తిని కూడదీసుకున్నాడు

ప్రాణాలు బిగ పట్టుకుని ముందుకు అడుగులు వేశాడు

తండ్రి పడుకున్న గది దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా తలుపు తోశాడు

లోపల గడియలు వెయ్యక 'పోవటంతో వెంటనే ఓరవాకిలిగా తెరుచుకుంది

కొత్త పిన్ని, తండ్రి ఒకే మంచంమీద గాఢనిద్రలో మునిగిపోయి వున్నారు

శీను వూపిరి బిగపట్టి చప్పుడు కాకుండా పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ బట్టల స్టాండు దగ్గరకి వెళ్ళి నిల్చున్నాడు

తండ్రి పాంటుపై హాంగర్ని వేసి వుండటంతో శీనూకి అందలేదు

కాళ్ళు పైకెత్తి చెయ్యి చాచాడు

ఊహూఁ

అయినా అందలేదు

శీను కి ఒక్కక్షణం అయోమయంగా అయ్యింది

ఎటూ తోచలేదు

భయంతో గుండె జారిపోతోంది

చలికాలం అయినా నుదురంతా ధారగా చెమటలు కారిపోతున్నాయి

ప్రాణం చిక్క పట్టుకుని జారుతున్న నిక్కరు పైకి లాక్కున్నాడు

భయంతో శరీరం తుఫానులో ఆకులా ఒణికిపోతోంది

ఒక్కక్షణం తిరిగి వెనక్కివెళ్లి పారిపోదాం అనిపించి వెనుతిరిగాడు

కాని అంతలోనే 'అమ్మ' జ్ఞాపకం వచ్చింది. దాంతోపాటే కొత్త పిన్ని తిట్లు, తండ్రి కొత్త






( గత సంచిక తరువాయి )

ఓ రోజు సాయంత్రం ఆరతి ఆఫీసునుండి వచ్చేసరికి యిల్లంతా హడావిడిగా ఉంది. వచ్చిపోతున్న మనుష్యులను చూడగానే ఆరతి గుండె ఆగిపోయినట్లయింది "తల్లి కేమయ్యిందో"నని వడివడిగా నడుస్తూ గేటు తీసుకొని లోపల కడుగు పెట్టింది వణికే కాళ్లతో హాలులో ఎదురైన దృశ్యం చూసి ఒక్క క్షణం నోట మాట రాలేదు హాల్లో సోఫాలో నందిని కూర్చుని ఉంది ఆమె చుట్టూ వీధిలో ఉన్న చిన్న, పెద్ద అంతా చేరి కుతూహలంగా, ఆరాధనగా చూస్తూ, ఒకరి మాట ఒకరికర్థం కాకుండా ఏదేదో మాట్లాడేస్తున్నారు ఆ దృశ్యాన్ని చూస్తూ నిలబడిపోయిన ఆరతి–

"ఏమిటే ! అలా నిలబడిపోయావు !" అంటూ అటు ప్రక్క నుండి వచ్చిన చంద్రకాంత్ పలకరించేసరికి ఉలిక్కిపడి

"అన్నయ్యా !" అంటూ బావురుమంది ఆరతి ఆ ఏడుపుకి అందరూ యిటు తిరిగారు. నందిని చటుక్కున లేచి వచ్చింది

"నందూ !" అంటూ నందినిని కౌగలించేసుకొంది నందిని కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"ఊరుకో. . ఊరుకో !" అంటూ ఊరడించింది అక్కచెల్లెళ్లిద్దరూ తల్లి గదిలోకి వెళ్లేసరికి అక్కడున్న అందరూ "మళ్ళీ వద్దాం" అనుకొంటూ వెళ్లిపోయారు

"ఎపుడొచ్చారు !" కాస్సేపు తరువాత కాఫీ కలుపుతూ అడిగింది ఆరతి.

"రెండు గంట లవుతుంది, కార్లో వచ్చాము. కారు డ్రైవర్ తీసుకువెళ్లాడు బజారుకి. మాకు మొన్న అందింది రాజా వ్రాసిన ఉత్తరం. చూడాలని వచ్చేశాం మొత్తానికి నాన్నను చూళ్లేక పోయాము" అంది నందిని ఆమె మాట్లాడుతున్నంతసేపు ముఖ కవళికలు రకరకాలుగా మారుస్తూ డైలాగ్స్ చెపుతున్నట్లే ఉంది చేతి గోళ్లు, చీర, ముంగురులు అన్ని సవరించుకొంటూ మేకప్ చెరిగిపోకుండా జాగ్రత్త పడుతూనే ఉంది యిదంతా గమనిస్తున్న ఆరతికి ఏడవలేక నవ్వు వస్తోంది.

"అయితే నందూ ! యిన్నేళ్లు కనీసం మామూలుగానన్నా చూడాలనిపించలేదన్నమాట. చనిపోయాక, కనిపించరని తెలిసాక, పాపం తీరిక చేసుకొని వచ్చి బాధపడుతున్నారన్నమాట !" ఆపుకోలేని ఉక్రోషం వ్యంగ్యంగా ధ్వనించింది ఆరతి గొంతులో.

"బాగుందే తీరిక ఉండొద్దూ ! అసలిపుడైనా రాజేష్ అక్కడేదో ఎడ్జస్ట్ చేస్తానని ఉండబట్టి రాగలిగాను ఖాళీగా ఉన్నాననుకొన్నావా ? మొదట్లో అంతా ఈ స్థితికి రావడానికి ప్రయత్నం చేయడానికీ ఎంత టైమూ చాలేదికాదు యిహ యిపుడు తిండానికి పడుకోవడానికే టైములేదు రేపు ఉదయం బయలుదేరి పోవాలి ఎల్లుండి అవుట్‌డోర్ షూటింగ్‌కి ఊటీ వెళ్లాలి" అంటూనే "ఆర్తీ స్నానం చేస్తానే బాత్‌రూమ్ ఎక్కడ ?" అని అడుగుతున్న అక్కను చూస్తూ ఆశ్చర్యపోయింది.

"ఈ యిల్లేం మార్చి నేను కట్టించలేదు పాత యిల్లే గుర్తు చేసుకొని వెళ్ళు !" అనేసి తల్లి దగ్గరకు వెళ్ళిపోయింది

"హు దీని పొగరు ఏమి తగ్గలేదు అందుకే యిలా ఏడుస్తోంది యింకా ఆ రాజాని పెళ్లాడేసి పిల్లల్ని కంటుంది అనుకొంది తను వాడెక్కడ ? దీనినేదో మోసంచేసి పోయుంటాడు అందుకే యిలా తయారయ్యింది !" అనుకొంటూ స్నానం ముగించింది జరీ పూలు కుట్టిన ఎర్రని నైలెక్స్ చీర కట్టుకొని పది నిముషాల్లో మేకప్ అయిపోయి లిప్‌స్టిక్‌తోసహా ట్రిమ్‌గా కూర్చుంది

వీధిలో ఒకప్పుడు కనీసం పలకరించని వాళ్లు కూడా వచ్చేసి గంటల తరబడి కూర్చుని అన్ని అడిగేస్తున్నారు మధ్య మధ్య "మా అమ్మాయి డాన్స్ బాగా చేస్తుంది ! ఏదన్నా ఛాన్స్ యిప్పించుదూ ! నువ్వు చెప్తే వింటారటగా !"

"మావాడు నాగేశ్వరరావులాగే స్టెప్స్ వేస్తాడు ఎవరన్నా కావాలంటే యిదిగో ఎడ్రసు మా వాడికి కార్డు పడేయమ్మా"

"యిపుడు ప్రతి సినిమాలో చిన్నపిల్లల పోర్షన్ ఉంటోందిగా ! రాణీ యిలారా ఆంటీకి డాన్స్ చేసి చూపించమ్మా" అంటూ సిగ్గుపడిపోతూ తల్లి కుచ్చెళ్లలో మొహం దాచేసుకొంటున్న ఆ మూడేళ్ల పిల్లని పైకి లాగుతూ చూపించడానికి ప్రయత్నం చేస్తున్న ఆ తల్లి తండ్రుల్ని చూస్తూ 'సినిమా' అంటే జనంలో ఎంత పిచ్చి ఉందో' అనుకొంటూ ఆశ్చర్యపోతోంది ఆరతి అక్కడే నిలబడి తల్లి పిలుపు విని వాళ్లదగ్గర నుండి వెళ్లింది ఆరతి

"ఆర్తీ అక్కనిట్లు రమ్మనవే ! దాన్ని సరిగ్గా చూడనేలేదు మళ్లీ రేపు వెళ్లిపోతుందటగా ! యింకొక్కరోజు ఉండమనమ్మా దాన్ని అన్నయ్యేడి వాడు సరిగ్గా మాట్లాడలేదు ఆర్తీ నాకేదోగా ఉందమ్మా తల్లీ నేనుపోతే వాళ్లునిన్ను చూస్తారనిపించడం లేదమ్మా" ఆయాసంగా బాధపడుతూ అంటున్న తల్లి నోరు మూసేసింది ఆరతి

"నన్నొకరు చూడ్డమెందుకమ్మా ! ఉద్యోగం ఉంది, నువ్వున్నావు, రాజా ఉన్నాడు చాలమ్మా నాకు, చాలు"

"అక్కను పిలమ్మా. ఈ కాస్తసేపన్నా నాతో మాట్లాడమను అన్నయ్యేడీ..." ఆ కాస్తకే ఊపిరి అందక కొట్టుకుంటోంది భైరవి

"నువ్వు ఆవేశపడకమ్మా ! అక్కను పిలుస్తాను నువ్వే దిగులు మనసులో పెట్టుకోకమ్మా ! డాక్టర్ని పిలిపిస్తానుండు బాధగా ఉందా ?" కళ్లనీళ్ల పర్యంతం అవుతూ ముందు గదిలో కొచ్చింది ఆరతి

**జరిగిన కథ – 7 :** చంద్రకాంత్ ఆరతితో గొడవపడి ఇల్లు విడిచి వెళ్లిపోతాడు దారి తప్పిన చంద్రకాంత్, నందిని ప్రవర్తనలకు కలత చెందుతుంది భైరవి తన ప్రేమికుడు రాజేష్‌తో నందిని వెళ్లిపోతుంది చంద్రకాంత్ ఆచూకీ తెలుసుకొని కలుసుకొన్న రాజాని అవమానించి, ఇక ఆ ఇంటికి తనకు సంబంధంలేదని చెపుతాడు కాలేజీలో తనవారిని గురించి చులకనగా మాట్లాడినవారి నోరు మూసేలా సమాధానం చెప్తుంది ఆరతి తనకి జాబ్ రాగానే తన వారికి తను చేయవలసిన సహాయం చేసి ఆరతిని వివాహం చేసుకొంటానని ధైర్యం చెప్పి వెళ్ళిపోతాడు రాజా. నందిని 'రాగిణి' పేరుతో సినిమాల్లో చేరుతుంది ఆరతి తన ఫ్రెండ్ లలిత తండ్రి సహాయంతో ఉద్యోగం సంపాదించుకొంటుంది నటిగా పైకి వచ్చిన రాగిణి జీవితంలో సుఖాన్ని కోల్పోయింది మాధవరావుగారు చనిపోయారు రాజా ఆరతికి ధైర్యం చెప్పి వెళ్ళిపోతాడు.



"నందూ... అమ్మకేం బాగాలేదు నిన్ను పిలుస్తోంది " అని చెప్పి, ప్రక్కింటి అబ్బాయితో డాక్టర్ని పిలవమని చెప్పడానికి వెళ్లింది ఆరతి

"నందూ. బాగున్నావా ? నేనదృష్టవంతురాల్ని కాబట్టే పోయేముందు మిమ్మల్ని చూసుకోగలుగుతున్నాను. అమ్మా. అన్నయ్య నీదగ్గరే ఉంటున్నాడా ? వాడేమన్నా స్థిరపడ్డాడే ! నీదగ్గరే ఉంచుకొని వాడికోదారి చూపించమ్మా... నందూ... మీకన్నా చిన్నది ఆర్తి... అది ఉద్యోగం చేసి నన్ను పోషిస్తోందే దానికోసం ఏమి చెయ్యలేకపోయాను " ఆగకుండా మాట్లాడేస్తూ ఆయాసపడిపోతున్న తల్లిని చూసి ఆరతి కంగారుపడింది.

"ఈ యిల్లంతా దానిదే కదమ్మా . యిదెవరికి కావాలి. దానికోసం ఎందుకు బాధ నేను వెళ్లాక దాని పేరున చెక్కు పంపిస్తాలే.. యింతకీ ఆ రాజా ఏమంటాడు ? ఎపుదు చేసుకొంటాడట ! అసలు చేసుకొంటాడా ?"

"నందూ! అమ్మ పరిస్థితి ఏమీ బాగులేదు. దయచేసి వేళాకోళం చెయ్యకు. డాక్టరికి కబురు చేసాను. నా బాధ్యత మవ్వేం నెత్తిన వేసుకో నక్కరలేదు కాని ఉన్న కాస్సేపు ఆవిడకి ఆనందం కలిగేలా వుండు. అంతే! అదే నాకు చెయ్యాల్సిన సహాయం " అనేసి విసురుగా వెళ్లిపోతున్న ఆరతిని చూసి పాత నందిని అయిపోయింది.

"చూసావామ్మా దాని పొగరు అందుకే అసలు యిన్నాళ్ల ఈ కొంప సంగతి మరిచిపోయింది. దానికా కొమ్ములు నువ్విచ్చినవే ఎపుడూ అంతే పెద్దదాన్నని కాస్తన్నా గౌరవంలేదు " కుర్చీ తన్నేసి లేచి వచ్చేసింది నందిని యింత పెద్ద హీరోయిన్, పదిమంది ప్రొడ్యూసర్స్‌ని వెంట తిప్పుకొనే స్థితిలో ఉండి, అశేష ప్రజానీకం అభిమానం సంపాదించుకొన్న 'ది గ్రేట్ రాగిణి'కి యింత అవమానమా! మనసు ఉడికిపోతోంది నందినికి ఈలోగా డాక్టరుని రప్పించిన ఆరతి దగ్గరుండి చూపిస్తోంది

"హాస్పటల్‌లో జాయిన్ చేస్తే మంచిదమ్మా!" అన్న డాక్టరు మాటలువిని మతిపోయినట్లుండి పోయింది అంతలో ఎక్కడినుండో వచ్చిన చంద్రకాంత్ పరిస్థితి చూసి "సరే"నంటూ సిద్ధపడేసరికి మరో పావుగంటకంతా కావలసిన సామాను పట్టుకొని కారులో బయలుదేరారు హఠాత్తుగా పరిస్థితి తారుమారయ్యేసరికి ముగ్గురూ మూగబోయారు ఎవరి ఆలోచనలో వారుండగానే హాస్పిటల్ ఎమర్జన్సీ వార్డు ముందాగింది కారు

డాక్టరుగారు దగ్గరుండి ఎడ్మిట్ చేయించారు నందిని కాంత్ సలహామీద కారు దిగలేదు చుట్టూ గ్లాస్ డోర్స్ బిగించుకొని కూర్చుంది ఆరతిని స్పృహలేని తల్లిదగ్గర పెట్టి నందినిని తీసుకొని యింటికి తిరిగి వచ్చాడు చంద్రకాంత్ అర్ధరాత్రివేళకు




''నందూ! ఈ పరిస్థితిలో ఏం చెప్తాం! రాజేష్‌కి ఫోన్ చేసి చెప్తాను సంగతి!'' అన్నాడు.

''అమ్మో చంపేస్తాడు! నువ్వుండి రెండు రోజులు చూసుకొని రా... నేను మాత్రం రేపు బయలుదేరి వెళ్తాను. కావలిస్తే ఆ షూటింగ్ అయిపోయాక మళ్లీ చెప్పివస్తాను.'' భయంగా అంటున్న నందినివంక పాలోచనగా చూసాడు. ''అయినా నేనుండీ మాత్రం చేసేదే ముంది?'' అనేసి అపుడే ప్రయాణానికి సిద్ధంకాసాగింది.

''నువ్వు తయారవు. అయితే నేనొకసారి హాస్పటల్‌కివెళ్లి చూసి ఆరతికి చెప్పివచ్చేస్తాను.'' అంటూ కారు తీసుకొని వెళ్లిపోయాడు.

''బాబూ చందూ... నందూ...'' అంటూ కలవరిస్తున్న తల్లిని కన్నీటితో చూస్తూ తల నిమురుతూ ప్రక్కనే కూలబడిఉన్న ఆరతి అన్న రాకతో ఆనందంగా లేచి అతని చేయి పట్టుకొని–

''అమ్మా... ఒకసారి చూడమ్మా అన్నయ్య వచ్చాడు'' అంటూ ఆ తల్లి చేతిలో పెట్టింది.

ఆ చేయి గట్టిగ పట్టుకొని డాక్టర్ల ప్రయత్నాలు వమ్ముచేస్తూ చిన్న కూతురివంక చూడనన్నా చూడకుండా, ఎవరికీ అప్పచెప్పకుండానే తృప్తిగా కళ్లు మూసింది భైరవి. జరిగింది అర్థమైన

ఇటీవల కలకత్తాలో మద్రాసు భారత కల్చరల్ ఇంటెగ్రేషన్ కమిటీ వారి ఆధ్వర్యంలో జరిగిన శ్రీ బాలాజీ సంగీత కళ్యాణోత్సవాలలో పాటలు పాడిన చి. సాయికుమారి.



# జీవన సరళిలో తీయని రవళి

చంద్రకాంత్ మాట లేనట్టు నిలబడిపోయాడు. ఆరతి కంటివెంట నీరు రాలేదు. ఎండి బీటలువారిన హృదయంలో ఈ సంఘటన చేరి వేసవిలో రాలిన చినుకులా ఆరిపోయింది. చంద్రకాంత్ యింటికితీసుకు వచ్చి దిగబెట్టటమే తెలుసు ఆరతికి. మర్నాటి సాయంత్రం పూల రథం లాంటి కారులో ఆఖరి ప్రయాణానికి సిద్ధం కానున్న తల్లిని కడసారి చూసేందుకే ప్రపంచంలోకివచ్చిన ఆరతికి ఇంటినిండా బంధువులు... మరెవరో... యింకెవరో... ఎన్నో వాహనాలు యింటి ముందు ఎదురయ్యేసరికి క్రొత్త ప్రపంచంలోఅడుగు పెట్టినట్టు అయోమయంగా చూడసాగింది ఆరతి. అక్కడ ఆ స్థితిలో ఆరతిని పట్టించుకునేవారు లేరు. ముందు రోజు రాత్రి నుండి భోజనం లేకుండా ఆ గదిలో పడున్న ఆరతి, రేగిన తల, నలిగిన చీరతో అస్థిరమైన చూపులతో పిచ్చిదాన్లా ఉంది. నందిని ఫుల్ మేకప్‌లో హడావుడిగా పన్లు పురమాయిస్తూ, చంద్రకాంత్ అంతకన్నా తీరిక లేనట్టు బయట ఏర్పాట్లలో మునిగి ఉన్నారు. ఒక్క రోజులో అంత మార్పెలా వచ్చిందో ఆరతికి అర్థం కాలేదు. ''అది అసలు తమ యిల్లేనా? పోయింది తన తల్లేనా?'' అన్న అనుమానం తోచినట్టు దిక్కులు చూస్తున్న ఆరతి ప్రాణం లేచివచ్చినట్లైంది. ఎయిర్‌బాగ్ భుజాన తగిలించుకొని అనుమానంగా చూస్తూ లోపలకొస్తున్న రాజాని చూడగానే ''రాజా'' అంటూ ఒక్కుదుటున అతని చేతిల్లో వాలి పోయింది. అపుడు వచ్చిందామెకు దుఃఖం.

''లేమ్మా – లే... ముందు వచ్చి మీ అమ్మకి నమస్కారం చెయ్యి మళ్లీ, మళ్లీ కనిపిస్తుందా?'' అంటూ సాగదీసిందొకావిడ. ఆ మాటలకు రాజాని విడిచి పైకి వెళ్లింది ఆరతి. పూలతో ముంచెత్తి వేసిన తల్లి శరీరంలో ప్రశాంతంగా నిద్రపోతున్నట్లున్న ఆమె మొహాన్ని తదేకంగా చూసి... వంగి నమస్కరిస్తూ... కాళ్లు చుట్టుకొని బావురు మంది ఆరతి. అంతలోనే ఎవరో వేరుచేసి స్నానం చేయించి లోపలికి తీసుకువెళ్లారు. మేళతాళాలతో పూలతో అలంకరించిన కారులో ప్రఖ్యాత సినీతార 'రాగిణి' తల్లిగా భైరవి శరీరం ఈ ప్రపంచానికి శాశ్వతంగా దూరమైపోవడానికి బయలుదేరింది. నెత్తిమీదనుండి చల్లని నీళ్లు పడ్డపుడే స్పృహలేదు ఆరతికి. తల్లి మంచంమీద పడేసి అంతా ఎవరి పన్లలో వాళ్లు పడ్డారు. మర్నాడు భోజనాల తతంగం కోసం ఏర్పాట్లలో పడ్డారు.

స్మశానం నుండి తిరిగివచ్చిన రాజా ఆరతి కోసం వెతికి ఆఖరికి వెళవెళ కాలిపోతున్న శరీరంతో స్పృహలేకుండా మంచంమీదపడి ఉన్న ఆరతిని చూసి అతని హృదయం బాధగా మూలిగింది. ఇంటినిండా ఉన్న చుట్టాలు అతనికి మొహమాటపు సంకెళ్లు వేసారు. ఏ అధికారంతో, ఏ స్వేచ్ఛతో అతనామెను గుండెలకు హత్తుకొని ఓదార్చగలడు. ఆ యిల్లు, పరిస్థితులు చూస్తుంటే అక్కడ అతని ఉనికే కూడా అనవసరమన్పించసాగింది. చేయాల్సిన పని గుర్తు వచ్చి శర్మగారి దగ్గరకు వెళ్లి పది రోజులు ఆరతికి లీవు గ్రాంట్ చేయించమని 'లాస్ ఆఫ్ పే' అయినా సరేనని చెప్పి లీవు లెటరిచ్చి బాగ్ పట్టుకొని బయలుదేరి పోయాడు. వెళ్లేముందు...

''కాంత్. ఆరతికి చాలా జ్వరంగా ఉంది. కాస్త చూడు. నేను వెళ్తున్నాను...''అని చెప్తే చంద్రకాంత్ ''మాకు తెలుసులే!'' అన్నట్టు నిర్లక్ష్యమైన చూపొకటి చూసి 'మంచిది' అనేసాడు. ప్రాణాలు ఆరతి దగ్గర వదిలిపెట్టి ఆమెకోసం చిన్న స్లిప్పు ప్రక్కనేపెట్టి మరి ఉండలేక వెళ్లిపోయాడు రాజా.

మూడోనాడు తెలివి వచ్చిన ఆరతి నిశ్శబ్దంగా ఉన్న యింటిని, ప్రక్కనే కూర్చొని ఆత్రంగా చూస్తున్న దూరపు బంధువు బామ్మగార్ని

చూస అయోమయంలో పడిపోయింది అసలు ఏం జరిగిందో అర్థంకాని స్థితిలో మెదడంతా మొద్దు బారిపోయింది

''బామ్మగారూ. .మా అక్క '' అంది నీరసంగా

''మీ అక్క నిన్ననే వెళ్ళిపోయిందే అమ్మా ఏవో షూటింగు లున్నాయట. అంతా ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. నిన్ననే అన్ని కార్యక్రమాలు దగ్గరుండి జరిపించేసారు మీ అన్న, అక్క.. ఏంజనం ఏంజనం. ఎంత ఖర్చుపెట్టారోగాని నిముషాల మీద అమర్చేరే అమ్మాయ్ అన్నీను ఎంత ఘనంగా చేసారని భైరవమ్మ పెట్టి పుట్టిందిలే... అలాంటి చావు ఎవరికోగాని రాదు యిలాచేసే కూతురు మాత్రం ఉండొద్దూ ." ఆవిడ వాక్ప్రవాహం సాగిపోతూనే ఉంది ఆరతి కళ్ళముందు జరిగినదంతా నెమ్మదిగా గుర్తుకురాసాగింది. ''రాజా ... వెళ్ళిపోయాడా?'' ఎంతోసేపటికి నిస్త్రాణగా అడుగుతున్న ఆరతిని చూసి ఆవిడ మాట లాపి ''అయ్యో ఆనాడే వెళ్ళిపోయాడమ్మాయ్ .. అన్నట్లు ఇదిగో ఈ చీటి నీకు రాసినట్లుంది నీ ప్రక్కన పడిఉంటే చెంగున కట్టుకున్నాను.'' అంటూ కొంగుముడి విప్పుతుంటే ఆవిడకి చేతులెత్తి మొక్కాలనిపించింది ఆరతికి ఆత్రంగా అందుకొంది. మసక చీకట్లో అలికేసినట్లు కనబడ్డాయి అక్షరాలు.

''రతీ ! నిన్నువదిలి వెళ్తున్నానంటే ఏ పరిస్థితిలో వెళ్తున్నానో నీ కర్థం అయ్యే ఉంటుంది నాలుగయిదురోజులు పోయాక మరలా వస్తాను. నా మనస్సు నీ దగ్గరే ఉంచి వెళ్తున్నాను. అంతకన్నా ఏమి చెయ్యలేని నిస్సహాయుడు ప్రస్తుతం నీ రాజా నీవు త్వరగా కోలుకోవాలని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తుంటాను '' ఉత్తరం చదివాక ఒక్కక్షణం ఆరోజు హడావిడి గుర్తు వచ్చింది

''డబ్బే ఊపిరిగా బ్రతుకుతున్న వాళ్ళని మనుష్యులంటారా ? ఏమో ! అమ్మా నీ కోరిక తీరింది హాయిగా తృప్తిగా వెళ్ళిపోయావు యిన్నేళ్ళు నీకు చేదోడు, వాదోడుగా నిన్ను కనిపెట్టుకొని ఉన్నా నీకేమి చెయ్యలేకపోయాను నీ గుండెల్లో మంటలు రేపితేనేం ? ఉన్నన్నాళ్ళు నీకు పిడికెడు మనశ్శాంతి నివ్వకపోతే ఏం ? పోయేముందు నీకు సంతృప్తి నిచ్చారు నీ కొడుకు, కూతురు మొదటి నుండి నేను దురదృష్టవంతు రాలినే. . నన్ను నమ్ముకున్న నా మనిషికి నేనేమి యివ్వలేని నష్ట జాతకిని పోనీలేమ్మా చచ్చిపోయి బ్రతికిపోయావు నువ్వు'' అవిరామంగా వర్షిస్తున్న కన్నీళ్ళు చూసి బార్లీ పట్టుకొని వచ్చిన బామ్మగారు ''ఊరుకోవే అమ్మా ఏంచేస్తాం దాని కష్టాలు గట్టెక్కి అది వెళ్ళిపోయింది. కూతురు ఆదుకునే సమయంలో పోయింది ఉంటే... ఆ వైభవం కళ్ళచూసును'' అంటూ మళ్ళీ పాత ధోరణిలో పడిపోతుంటే లేని ఓపిక తెచ్చుకొని చటుక్కున లేచి బార్లీ త్రాగేసి అటుతిరిగి కళ్ళు మూసుకొంది ఆరతి. చిన్నతనపు రోజులు, తండ్రి యిల్లు, వాతావరణం క్రమంగా వచ్చిన మార్పులు అన్నీ గుర్తు చేసుకొంటూ శూన్యంలో చూస్తూ పడుకొంది ఆరతి

''బామ్మగారు ! ఆర్తి లేచిందా ?'' అంటున్న చంద్రకాంత్ మాటలకు కళ్ళు తుడిచేసుకొని లేచి కూర్చుంది.

''ఆర్తీ ! లేచావా ! కంగారు పెట్టేశావ్ కదా ! సరే బాగుంది కదా ! ఈ బామ్మగారు తోడుంటారు నేనే రాత్రికి వెళ్ళిపోతాను అయితే. అక్కడ బోల్డు పన్లుండిపోయాయి. ఒకందుకని వస్తే మరొకటి జరిగింది ఏం చేస్తాం ? రెండు రోజులు పోయాక ఆఫీసుకి వెళ్ళు కబురు చేస్తాలే ! యిదిగో ఈ డబ్బు ఉంచు.. '' అంటూ హడావిడిగా నాలుగు నోట్లు తలదగ్గర పెడుతూ . యింక తన ప్రమేయం అవసరం లేనట్లు హడావిడిగా వెళ్ళిపోతున్న అన్నగార్ని నిర్లిప్తంగా చూస్తుండిపోయింది ఆరతి. ఆ రాత్రే వెళ్ళిపోయాడు చంద్రకాంత్.

* * *

నాలుగు రోజులు పోయాక ఆఫీసుకి వెళ్ళింది ఆరతి ఓపిక చేసుకొని ఉన్న కొద్దిమంది స్టాఫ్ మళ్ళీ వచ్చి పరామర్శించారు

## మేల్కొంటున్న జనతరంగం

—నిఖిలేశ్వర్

గడచిన దినాల వెంబడి
గడచీగడవని బతుకుభారం
దేశం రహదారుల వెంట
వోట్లతో హైజాక్ అవుతున్న జీవితం,
ఈ జాతి శ్రమ పెట్టుబడితో సాగే
''పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రహసనం !''

రైల్వే ప్లాట్‌ఫామ్‌ల చుట్టూ
చెట్లకింద బోర్లించిన గిన్నెలు
దిక్కులేని శవాల తలాపునే జీవచ్ఛవాలు
పల్లె పరిసరాల పల్లెరుగాయలకు
అల్లుకుంటున్న వీడియోలలోకి
చొచ్చుక వస్తున్న బ్లూ ఫిల్ములకు
అర్పిస్తున్న అమాయకత్వం,
లేదా తెలుగు సినీ డాన్సర్‌ల
తొడల అడవుల్లో తప్పిపోడం !

ఇదే దేశాభివృద్ధి
పాలకులు తలచుకుంటున్న
రాబోయే 16 సంవత్సరాల సాంకేతిక ప్రగతి
2000 సం॥ల నాటికి శిథిలాల్లో కూడా
జాడ కూడా దొరకని ఏశియాడ్ ప్రశస్తి,
నామ్ [NAM] కిరీటంలో
వెతికినా కనపడని తటస్థత కలికితురాయి,
చోగ్మ [CHOGM] వైభోగాలకు ధారపోసిన
కోట్లాది ప్రజల కన్నీళ్ళు అడిగే ప్రశ్నలు

1983 రాజకీయాల రంగుల రాట్నంలోంచి
1984 కుడి ఎడమల చెట్టాపట్టాలు
కర్రసాములో యువరాజు తర్ఫీదు !

ప్రజలు మేల్కొనేదాకా సాగే
ఈ రాజకీయ శకారుల ప్రవచనాలకు
గతించే కాలం కడుతున్న సమాధులు !

కుగ్రామాల మారుమూలల నుంచి మౌనంగానే
నడిచే భుజాలపై కూచున్న వర్తమానం
మట్టితో మాట్లాడుతున్న చేతులతో
సమాయత్తమవుతున్న సామూహిక శక్తితో
సమాంతరంగా కదులుతున్న జనతరంగం !!

''ఆరతిగారు 'రాగిణి' మీ అక్కటగా, మాకెపుడూ చెప్పలేదేం!'' ఆదేదో తప్పయినట్లు అడిగాడు సురేష్, క్లర్కు

''అది చెప్పాల్సినంత విశేషంగా అనిపించలేదు !'' అంది ఆరతి సీరియస్‌గా

''మీ ఫాదర్ పోయినపుడెవరూ రాలేదు మీ మదర్‌కి వచ్చారు '' ''కారణం తెలుసుకోవచ్చా'' అన్నట్లు అడిగింది లేబ్ అసిస్టెంట్ కాత్యాయని

''ఆ కబురు అందక రాలేదు వస్తానండి బోల్డు వర్క్

# జీవన సరళిలో తీయని రవళి

పెండింగ్‌లో ఉండిపోయింది !'' నీరశంగా నవ్వుతూ తన సీట్లోకొచ్చి పడింది ఆరతి. డి యమ్. స్వయంగా వచ్చి పలకరించాడు ఎలాగో అయ్యిందనిపించి పెండింగ్‌లోనున్న ఆర్డర్స్ అన్నీ టైపుచేసి సంతకాలు చేయించి డిస్పాచ్ క్లర్క్ సురేష్‌కి అప్పచెప్పి పైకివచ్చిన ఆరతికి కళ్లు చీకట్లు కమ్మినట్లయ్యింది నీరసంతో రిక్షా చేయించుకొని యింటికొచ్చే సరికి హాల్లో రాజా ఎదురుచూస్తూ కూర్చున్న తీరు చూసేసరికి కొండంత బలం వచ్చినట్లయి ఒక్కుదుటన రిక్షా దిగి మరుక్షణం రాజా దగ్గరుంది

''రాజా వచ్చావా . నేను నేను వంటరిగా యిక్కడుండలేను నన్ను తీసుకువెళ్లిపో రాజా ..''

''రతీ. . ఏమిటా మాటలు ? యింత బేలవైపోతున్నావేమిటి సరె ! ముందు కాస్త కాఫీ త్రాగిరా ఉంటాలే మాట్లాడుకుందాం వెళ్లి మొహం కడుక్కో'' ఆ మాటలకు ఎదురు చెప్పలేనట్లు నిస్త్రాణగా లేచి లోపలికి వెళ్లింది. బామ్మగారిచ్చిన కాఫీ తెచ్చుకొని మళ్లా హాల్లో కొచ్చింది. రాజాను చూస్తుంటే ఎన్నెన్నో చెప్పేసుకొని గుండె బరువు తీర్చేసుకోవాలన్న ఆరాటాన్ని అణచిపెట్టలేక అవస్థపడిపోతోంది ఆరతి కళ్లతోనే వారిస్తూ... కాస్సేపు అయ్యాక డాబామీదకు నడిచాడు రాజా ! తనూ అనుసరించింది ఆరతి.

''రాజా . ఇంటర్వ్యూ ఏమయ్యింది ? తెలిసిందా ? చూసావుగా ఏం జరిగిందో ! నేనింక వంటరిగా ఉండలేను దిక్కులేనిదాన్ని...''

''రతీ ఆవేశపడకు. సెలక్ట్ కాలేదు వెయిటింగ్‌లిస్ట్‌లో ఉందట పేరు. నెక్స్ట్ టైమ్ వచ్చినపుడు ప్రిఫరెన్స్ యిస్తారట ! అదిలా ఉండగా నా ప్రయత్నం నేను చేస్తూనే ఉన్నాను రతీ ! ఏం చేయను ? నిన్ను నాదాన్నిగా చేస కొని ఓదార్చే హక్కు సంపాదించుకోలేని అసమర్థుడనైపోతున్నాను రతీ . ఆ రోజు నిన్నా స్థితిలో విడిచివెళ్లాలంటే మనసొప్పలేదు కానీ ఉండి ఏంచేయను ? కనీసం నీకోసం డాక్టర్ని తీసుకొచ్చే స్వాతంత్ర్యం కూడా లేనట్లు అయిపోయిందా స్థితిలో... అందుకే ఉండలేక వెళ్లిపోయాను రతీ .. కొద్ది రోజులు ఓపికపట్టు...''

''నా దురదృష్టం నిన్నుకూడా చుట్టుకొన్నట్లుంది రాజా ! నువ్వేం చేస్తావ్ ? రాజా ఎందుకో అస్సలు ఉండలేకపోతున్నా నీ యింట్లో ఒంటరిగా. అమ్మ, నాన్న జ్ఞాపకాలు నన్ను నిలువనీయడంలేదు. పిచ్చెక్కి పోతానేమో భయం వేస్తుంది !'' నిర్వేదంగా అంటున్న ఆరతి నోరు మూసేసాడు చప్పున.

''అలా అనకు రతీ ! వినయ కేదో సంబంధం వచ్చింది మొన్న నాన్నగారితో చెప్పేశాను . నాకుద్యోగం వచ్చేంతవరకు పెళ్లి చేసుకోను ఏ అప్పోచేసి దాని పెండ్లి జరిపించేయమన్నాను. నేను బాధ్యత వహిస్తానని చెప్పాను. వాళ్లు విసిగిపోయి సరేనన్నారు ఏదో దేవుని దయవలన ఈ సంబంధం దానికి స్థిరపడిపోతే యింక ఉండేది విమల దానికి మనసంగతి తెలుసు దాని బాధ్యత నెమ్మదిగ తీర్చుకొందాం అదెంత కష్టమైంది కాదు మా పెద్ద బావగారు వాళ్లు చూసిందే ఈ సంబంధం ఆయనకి చెప్పేశాను రతీ . ఏ చిన్న ఉద్యోగం వచ్చినా నిన్ను నాదాన్ని చేసేసుకుంటాను పోనీ ఈ పెళ్లయినంత వరకన్నా ఓపికపట్టు ప్లీజ్ నువ్వలా బాధపడుతుంటే నేనేం చేస్తానో నాకే తెలీదు ''

''లేదు రాజా లేదు నేను తొందరలో ఏదో అన్నాను వినయ పెళ్లి జరిగిపోనీ అంతవరకూ ఉంటాను నువ్వన్నట్లు విమల ఒక్కతే కదా...మన దగ్గరే ఉంచుకొందాం రాజా నీ కోసం ఎన్నేళ్లు అయినా ఎదురుచూసే శక్తి నా ప్రేమకుంది .''

''రతీ!'' చప్పున దగ్గరకు లాక్కున్నాడు ఆ స్పర్శకు బండబారి పోయిన ప్రతి అణువు స్పందించి అశ్రువులు రాల్చింది. ఆ దగ్గరతనం తోని ఆత్మీయత, అనురాగం ఎన్నో, మరెన్నో సంవత్సరాలకి సరిపడా స్థైర్యాన్నిస్తున్నాయి. ఓదార్పులోని శాంతి లభించాక, అంతవరకూ అణచి ఉంచిన వయసు ఉసిగొల్పుతూ ఒళ్లు విరుచుకుంది. అనుభూతి లోని తేడా అనుభవం గ్రహించి మరింత చేరువయ్యారు సర్వాన్ని మరపింపజేసే మత్తు నరనరాన్న ప్రవహిస్తుండగా... ''అమ్మాయ్ ఆరతీ...'' అన్న బామ్మగారి పిలుపుకి ఈ లోకంలోకి వచ్చిన ఆరతి అతన్నుండి విడివడి దూరం జరిగింది. జరిగిపోనున్న తప్పునుండి మేల్కొలిపిన బామ్మగార్కి మనసులోనే కృతజ్ఞతలు తెల్పుకుంటూ—

''గుడ్‌నైట్ రాజా ! '' అంటున్న ఆరతి గొంతులో మాధుర్యం మత్తకోయిలను తలపింపచేసింది. మనసు, శరీరము తేలికయినట్లు హాయిగ నవ్వుకొన్నాడు రాజా !

* * *

రేయింబవళ్లు ఒకదాన్నొకటి తరుముకొంటూ కాలచక్రాన్ని గిరగిర త్రిప్పేస్తున్నాయి.

''నందూ ! మీ అన్నయ్య ఎంతకాలం నీ మీద —ఆధారపడి ఉంటాడు ఉండొచ్చు, నేను కాదనను కష్టపడి పని చెయ్యమను. తినమను అంతేకాని కష్టపడి సంపాదిస్తున్న డబ్బు అతని విలాసాల కోసం కాదని నువ్వు చెప్పలేకపోతే నేనే చెప్పవలసి ఉంటుంది. అతని ప్రవర్తన ఏమీ బాగోలేదు. ఆ ఎక్స్ట్రావేషాలు వేసే నళినితో తిరుగుతున్నాడు. బహుశ పెళ్లి కూడా చేసుకొంటాడేమో. చేసుకొంటే చేసుకోనీ కానీ, అతను ఫేమిలీ యిక్కడ పెడితే మాత్రం కుదరదు. మీ ఊళ్లో మీ నాన్న సంపాదించిన యిల్లు ఉంది ఓ పదో పదిహేను వేలో పారేస్తే ఏదో బిజినెస్ చేసుకొని సెటిల్ అవమను. అంతేకాని జీవితాంతం అతని విలాసాలు, అతని కుటుంబం పోషించడానికి యిక్కడేం వట్టినే రాసులు పోసి లేదు ! '' హఠాత్తుగ ఉరమని పిడుగులా వార్నింగ్ యిచ్చి వెంటనే వెళ్లిపోయాడు రాజేష్.

ఎప్పుడో ఒకవుడీవిషయం వినాల్సివస్తుందని తెలిసినా యింత, హఠాత్తుగ త్వరలో వింటుందని ఊహించని నందని హతాశురాలై పోయింది రెండు మూడు నెలలుగ చంద్రకాంత్ ప్రవర్తన సరిగ్గాలేని మాట వాస్తవమే కానీ ఏమని చెప్పాలో అర్థంకాక ఊరుకొంది. యిపుడు రాజేష్ దృష్టిలోపడి అతనితో 'చెప్పించుకొన్నారు.' అంటే ఆ పని జరిగి తీరవలసిందే ! 'అన్నయ్య కదా!' అని ఏ మాత్రం వెనకేసుకువచ్చినా, అతన్ని కాదంటే కేరాఫ్ 'మద్రాసు వీధులే'నన్న నగ్నసత్యం అనుభవ పూర్వకంగా అర్థం చేసుకొన్నది కనుక ..అతనికి జవాబుచెప్పే ఆలోచన విరమించుకొని అన్నకెలా చెప్పాలో రిహార్సల్ చేసుకోసాగింది.

''నందూ అర్జంటుగా ఓ వంద రూపాయలియ్యి...'' అంటూ వచ్చాడు కాంత్. లంతకన్నా ఎక్కువ మొత్తం ఆ చెల్లి దగ్గర ఉండదని అతనికీ తెలుసు.

''అన్నయ్యా! ఓ విషయం...కాసేపు కూర్చో మాట్లాడాలి.'' అంది.

''అదే నేనూ మాట్లాడదామనుకొంటున్నాను, కానీ నీకు తీరికేదే? అదే.. ఆ నళినిని పెళ్లి చేసుకొందామనుకొంటున్నాను. గ్రాండ్‌గా కాదులే...తిరుపతిలో దండలు మార్చేసుకొని ఓ పదిరోజులు గడిపివస్తాం. కాటేజి కూడా బుక్ చేసాను డబ్బు కాస్త సర్దితే .'' అంటున్న అన్నవంక తిరస్కారంగా చూసింది నందిని

''అన్ని ప్లాన్ చేసుకొని, నిర్ణయించేసుకొని డబ్బుకోసం నాదగ్గర చెయ్యి చాపడానికి సిగ్గులేదూ. .'' కోపంగా అంది

''నీ దగ్గర చెయ్యి చాపడమేమిటె? ఏం ఆ రాజేష్‌గాడు తినడంలే నీ సొమ్ము. నాకివ్వడానికి ఏడుస్తున్నావా? నీ పనులు చూడటంలే జీతం ఏమన్నా యిస్తున్నావా? వాడుబాగా ఎక్కిస్తున్నాడు నీకు వాడి చెప్పు క్రింద తేలులా ఉన్నావు నువ్వు ''

## ఏమయిపోతోంది ?

ఏమయిపోతోంది మనదేశం
చుట్టుకుంటూంది యమపాశం
వేదఘోషలతో, శంఖనాదాలతో
ధార్మికోపన్యాసాలతో వెలుగొందిన
ఈ పవిత్ర భారతదేశం ఏమయిపోతోంది ?

సహనం, ధర్మం, మానవత కరుణ
కాలి బుగ్గయిపోతున్నాయి మారణహోమంలో
అటు అస్సాం, ఇటు పంజాబు
అటు బొంబాయి, ఇటు హైద్రాబాదు ;
మతదురహంకారాలతో, విద్వేషాలతో
రగిలి స్మశానాల్లో చితులకుమల్లే మండుతున్నాయి
పవిత్రదేశం రక్తపుధారలతో
తుదినిస్వాసాల పొగలతో అపవిత్రమైపోతుంది

ఈ దేశంలో ఉన్నన్ని మతాలు ఏ దేశంలో లేవు
హిందు, ముస్లిమ్, బౌద్ధ, జైన్,
సిక్కు, పార్శీ, క్రిస్టియన్ కలసి రావు
భిన్నత్వంలో ఏకత్వం కావటంలే
ఒకే దేశంలో ఎన్నెన్నో మతాలు
రాజ్యాంగంలోని సమాన తూకాలు
ఒకనాడు రాజ్యాలు వేరై
రణరంగంలో పోరి మరణించేం
ఈనాడు మతాలు వేరై
ఇంటి ముంగిటే పొడుచుకు చస్తున్నాం

పవిత్రదేవాలయాలు మందిరాలు కాని,
మసీదులు కాని, గురుద్వారాలు కాని
ఆయుధాలకు, హింసాకారులకు
దుర్గమైన నిలయాలయేయి
భగవానుడు సిగ్గుతో ఏనాడో
ఈ పోరును చూడలేక పరారైనాడు
మానవత లేని మానవుడు దగ్ధమైపోతున్నాడు
దేముడు లేని దేశం
ఆఖరికి ఏమయిపోతుందో !

**— యర్రగుంట్ల వరలక్ష్మీదేవి**

''అవును... అంతే. యింక నీ దారి నువ్వు చూసుకోవడం మంచిది. రాజేష్ కూడా ఆ విషయమే చెప్పమంటే 'ఎలా చెప్పాలా ?' అని ఆలోచిస్తున్నాను. నువ్వు పెళ్లి చేసుకొంటావో ఏం చేసుకొంటావో నాకనవసరం నువ్వు మన ఊరు వెళ్లిపోయి యిల్లుంది హాయిగ ఉండు కావాలంటే ఏదోబిజినెస్ చేసుకొంటానంటే కొంత సహాయం చేస్తాను అంతేగాని యింక నామీదపడి తినడానికి ప్రయత్నించకు రాజేష్ సంగతి తెలుసుగా ! అతను చెప్పినట్లు వినకపోతే నీతోపాటు నాకు అధోగతి పడుతుంది. దయచేసి నన్నిలా ఉండనిస్తే నిన్ను అపుడపుడు ఆదుకోడానికన్నా పనికొస్తాను !''. రెండు చేతులు జోడించేస్తున్న చెల్లెల్ని చూసి చిందులు త్రొక్కుతూ వెళ్లిపోయాడు

**(ఇంకా వుంది)**

ప్రతి ఇంటా ప్రతి క్షణం విజ్ఞానం - వినోదం

# ఉదయం

నవలకు 12000 రూ. అవార్డు

కథకు 5,000 రూ. బహుమతి

సృజనాత్మక సాహిత్య సముచిత సన్మానం

# ఉదయం

రాయండి...
మీ హృదయాన్ని కదిలించి
ఊగించిన సంఘటన గురించి
రాయండి.. సాఫీగా
గాలిలా స్వేచ్ఛగా, నీరులా స్వచ్ఛంగా,
ప్రాణంలా శక్తివంతంగా,
సముద్రంలా విశాలంగా
నదిలా సజీవంగా, హాయిగా
వినూత్న సృష్టికి జన్మనిచ్చే
తల్లిలా రాయండి

**ఆఖరుతేదీ**
**సెప్టెంబర్ 30, 1984**

అతి త్వరలో హైదరాబాద్
నుంచి వెలువడనున్న
మా వార పత్రిక పోటీకే కాక
మామూలు రచనలు కూడా
పంపండి. మీ సృష్టికి తగిన
పారితోషికం అందుకోండి.

నవల, కథ
మీరు రాసిందే నన్న
ఒక చిన్న హామీపత్రం
జత చేయండి
తెల్లటి కాగితంపై
ఒక వేపే రాసి కింది
చిరునామాకు
పంపండి

**ఏకైక బహుమతి**
**నవల: రు 12 వేలు**
**కథ: రు 5 వేలు**

తారక ప్రభు పబ్లిషర్స్ ప్రైవే
గగన్ మహల్ కాలనీ
దోమలగూడ
హైదరాబాద్
500029

ప్రతి ఒక్కరి కోసం ప్రత్యేక వారపత్రిక!

ఉదయం

# మెట్టు

యన్.తారకరామారావు



"కుఱ్రాడు కలిశాడా ?" మహాలక్ష్మి మెట్లెక్కుతున్న భర్త సీతారామయ్యకు ఎదురెళ్లి అడిగింది !"

సీతారామయ్య, కుర్చీలో చతికిలబడి, మొహాన పట్టిన చమట తుడుచుకుని "మంచి నీళ్లు తీసుకురా ! అన్నాడు.

రెండు అంగల్లో మహాలక్ష్మి మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది. గడపనానుకుని నిల్చుంది భర్త చెప్పబోయే విశేషాలు విందామని.

"కుఱ్రాడు ఎలా వున్నాడు ?"

"కుఱ్రాడికేం బాగానే వున్నాడు !"

"ఎప్పుడొస్తానన్నాడు ?"

సీతారామయ్య క్షణం మాట్లాడలేదు. ఆయన మౌనం మహాలక్ష్మికి ఆతురత కలుగ చేసింది. "అన్నీ వివరంగా చెప్పండి !" అంది.

"ముందు అన్నంపెట్టు !"

సీతారామయ్య అన్నం తిని, మంచంమీద నడుం వాల్చి చుట్ట కాల్చుకునేలోపల, మహాలక్ష్మి చకా చకా తనూ అన్నంతిని, వంటిల్లు కడుక్కొని వచ్చి, భర్త మంచం ప్రక్కన చాప పరుచుకు కూర్చుండిపోయింది.

"అబ్బాయి నిక్షేపంలా వున్నాడు. వెనకా ముందూ ఎవ్వరూలేరు. అమలాపురం దగ్గర ఓ పెంకుటిల్లు మాత్రం వుంది అంతే ఆస్తి. మిలటరీ ఎక్కౌంట్స్‌లో ఉద్యోగం పదేళ్లబట్టీ. ఇంతకుముందు జబల్‌పూర్‌లో పనిచేసి యిక్కడకు నాలుగు నెలల క్రితం వచ్చాడు."

మహాలక్ష్మికి ఈ సంబంధం కుదిరితే బావుండు అని అనిపించింది. వెంటనే ఏడుకొండలవాడికి మనసులోనే మ్రొక్కుకుంది. "రాధ పెళ్లి అయితే, దంపతులొచ్చి దర్శనం చేసుకుంటామని !"

"కట్నం అదీ..."

"అంతదాకా పోలేదు !"

"ఏం ?... అన్నీ తేల్చుకువస్తే పొయ్యేదిగా ?"

సీతారామయ్య లేచి కూర్చున్నాడు.

"అదే ఆఫీసులో... బ్రహ్మానందం అని ఓ కుఱ్రాడు వున్నాడు. అతను కొద్దిగా తెలుసులే నాకు ! వస్తుంటే పలకరించి, మీ అమ్మాయిని... శంకరానికి యిద్దామనా మాష్టారూ అని అడిగాడు. అవునన్నా. అతనో క్షణం ఆలోచించి, "కుఱ్రాడు పైకి బాగానేవున్నాడు. పెళ్లంటే చాలా జాగ్రత్తగా వుండాలి. వెనకా ముందూ ఆలోచించి దిగండి !" అని సలహా యిచ్చాడు !"

"ఏం కుఱ్రాడి కేమన్నా చెడు అలవాట్లున్నయ్యా !"

"బ్రహ్మానందం యిదీ అని చెప్పలా తేల్చి!"

"అసలు విషయ మేమిటండీ ?"

"పెళ్లికొడుకు నాకు బాగా నచ్చాడు. దురలవాట్లేమీకూడ లేవుట. కట్నం అదీ

పట్టింపులేమీ లేవన్నాడు. మీ యిష్టం మీకు పూర్తిగా నచ్చితే దిగండి !'' అనన్నాడు !

మహాలక్ష్మికి ఏం పాలుపోలా ! ''మరేం చేద్దామని ? ''

''అదే ఆలోచిస్తున్నా ! ''

సీతారామయ్యకు తొలి సంతానం ఆడపిల్ల. పెళ్లయి అత్తారింటి కెళ్లింది. ఆ తర్వాత ముగ్గురు మొగపిల్లలు. చదువుకుని, రెక్కల కష్టం మీద తలాఒకచోట బ్రతుకుతున్నారు. బాదర బందీలు అయిపోయాయి అనుకుంటుండగా, మళ్లీ పదేళ్ల తర్వాత ఆడపిల్ల పుట్టింది. ఆ రోజుల్లో నిరోధ్‌లు, ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్లు లేవు. పదేళ్ల తర్వాత బారసాల పీటల మీద కూర్చోడం, సీతారామయ్యకు, మహాలక్ష్మికీ కొంత ఇబ్బంది, సిగ్గు కలుగచేసింది. అయితే పెద్ద పిల్ల, కొడుకులు ధైర్యం ఇచ్చారు.

''దాని అదృష్టమెలా వుందో ! అయినా మేమంతా లేమూ ! ముద్దు చెల్లెలు అదేగా ! దాని అచ్చటా ముచ్చటా, పెళ్లి పేరంటం చదువు మేమూ బాధ్యతలు పంచుకుంటాం'' అని ఉత్సాహం, ధైర్యం ఇచ్చారు.

ఆ విధంగా రాధ గారాబంగా పెరిగింది. పుట్టినప్పుడు అర్భకంగా వున్నా, రాను రాను వళ్లుచేసి, పుష్పవతి అయ్యాక మరీ సోయగం, అందం, వచ్చి, రాధ అందగత్తె అనిపించుకుంది. కాకపోతే చదువబ్బలేదు. అందుకు తల్లి గారాబం, అన్నల అనురాగం కారణం. పదోతరగతి ప్యాసయింది.

అప్పట్నుంచీ పెళ్లి ప్రయత్నాలు చేస్తుంటే, ఒక్కటీ సంతృప్తికరంగా, పెళ్లి సంబంధం దొరకలేదు.

ఆ సాయంత్రం, సీతారామయ్యగారు, బ్రహ్మానందం ఇల్లు వెతుక్కుని వెళ్లాడు. సమయానికి బ్రహ్మానందం ఇంట్లోనే వున్నాడు. సీతారామయ్యగారిని మర్యాదచేసి కూర్చోబెట్టి—

''మేష్టారూ కుర్రవాడు మేడిపండు చూడగానే పిల్లనిద్దామనిపిస్తుంది. నిజానిజాలు నాకు తెలియవనుకోండి. అయినా నాకు తెలిసిన విషయాలు దాపరికం లేకుండా చెపుతాను. శంకరానికి ఉద్యోగం వుంది. కొద్దో గొప్పో ఆస్తి కూడ వుందని అతనే చెబుతాడు కుర్రాడు బాగానే వున్నాడు — మరిన్నాళ్లా పెళ్లెందుకు కాలేదూ ? అంటే, చాలా రోజులుగా ఆంధ్ర దేశం వదిలివుండటంవల్ల అని అతనే అంటాడు. సరే ఒప్పుకుందాం ? మీరు గమనించారో లేదో ! నాకు కట్నం పట్టింపులు లేదంటాడు.''

''అవును నాతోనూ చెప్పాడు.''

''చెప్పాడుగదా ! వెధవది ఈ రోజుల్లో గుడ్డి కుక్కకుకూడ పదివేలు, పదిహేను వేలు, లాంఛనాలు, అదనీ యిదనీ ప్రాణం తీస్తున్నారె ! మరి ఇతగాడేమిటే ? ఏమీ వొద్దు ! పెళ్లయితే చాలు అన్నట్లుంటాడు ?''

బ్రహ్మానందం చెప్పడం, ఆపి సీతారామయ్య ముఖ కవళికలు గమనించాడు. తను చెప్పేది నమ్ముతున్నాడా లేదాన్నట్లు.

సీతారామయ్యకు బ్రహ్మానందం అన్నీ విడమరచి చెబుతుంటె, చింతపండుతో తోమగా, పాత నాణేనికి అంకెలు, అక్షరాలు కనబడినట్లు, శంకరం వ్యక్తిత్వం అవగతం కాసాగింది.

''అసలు, ఆ గేదె మంచిదైతే, ఆ వూళ్లోనే కొనేవాళ్లు అన్నది సామెత. నిజంగా శంకరం చెప్పేవన్నీ నిజం అనుకుంటే, ఈ పాటికి ఆడపిల్లల తండ్రులు ఎగరేసుకుపోరుటండీ. అంతదాకా ఎందుకూ, మా చెల్లెలే వుంది బి. ఏ. ప్యాసయింది. గుట్టుచప్పుడు కాకుండా, శంకరాని కిచ్చి చేయనా !''

సీతారామయ్యకు, ఆ మాటా నిజమే అనిపించింది.

''నేనంటే సంసారం పెద్దది. కట్నాలు కానుకలు ఇచ్చుకోలేను. మీకేంటండీ పదిహేను వేలు ఇచ్చుగోగలరు. పైగా ఆఖరిపిల్లంటున్నారు. నన్ను సలహా అడిగితే, తొందరపడటం మంచిది కాదూ ! అంటాను !'' అన్నాడు బ్రహ్మానందం పాలు చిలికి వెన్న తీసినట్లు.

అయితే సీతారామయ్యకు శంకతీరలేదు. ''మరి అతని పూర్తి వివరాలు తెలిసే మార్గమేదీ ?''

బ్రహ్మానందం శ్రీకృష్ణపరమాత్మలా నవ్వి ''మేష్టారూ, అందరూ ఆవలిస్తే పేగులు లెక్కపెడతారు. నేను ఎదట మనిషి క్షణం నిలబడితే చాలు ఎక్స్‌రే తీసినట్లు పూర్వాపరాలు చెప్పగలను. మా మిత్రులకు ఉత్తరాలు వ్రాశాను. ఇవాళో రేపో జవాబు రావాలి ! రాగానే మీకు చెబుతాను. సరా ? '' అన్నాడు.

సీతారామయ్య, బ్రహ్మానందం చేసిన ఉపకారానికి మహదానందపడి, ఇంటికి వెళ్లి, హిస్ మాష్టర్స్ వాయిస్‌లా అంతా భార్యకు విన్నవించాడు.

రోజులు గడుస్తున్నాయి. శంకరం వ్యవహారం తేలేదాకా, సీతారామయ్య మరో సంబంధం గురించి వాకబు చెయ్యదల్చుకోలేదు.

ఓరోజు బజార్లో, శంకరం కనపడ్డాడు. సీతారామయ్య కొంచెం ఖంగు తిన్నాడు, పలకరించాలా వద్దా అన్న మీమాంసలో వుండగానే, శంకరమే పలుకరించాడు.

''మాష్టారూ బాగున్నారా ! ''

''ఆ ! ఆ ! ''

''మీరామధ్య మీ అమ్మాయి గురించి వచ్చారు మళ్లీ వస్తామన్నారు రాలేదేం ? ''

సీతారామయ్య గుడ్లు మిటకరించాడు. గుక్క త్రిప్పుకుని, ''మా యింటి ఆవిడ పడకేసింది బాబూ ! వద్దామనుకుంటున్నా''అని, ''మీరు ఏదన్నా సంబంధం సెటిల్ చేసుకుంటున్నారా ? '' అని వాకబు చేశాడు.

''సంబంధాలు చాలా వస్తున్నాయండీ. కానీ ఏదీ నిర్ణయించుకోలేదు.''

''ఎందుకనీ ! ''

''నాకు నచ్చిన సంబంధాలు కొన్ని వున్నాయి. ఎందుకో వాళ్ల మళ్లీ కనపడటం లేదు మీలాగానే. నాకంతగా నచ్చనివాళ్ళు తిరిగి పోతున్నారు !''

ఆ సాయంత్రం సీతారామయ్య పరుగెత్తి కెళ్లి బ్రహ్మానందానికి, శంకరం కల్పిన విషయం, తమ మధ్య జరిగిన చర్చల సారాంశం చెప్పాడు.

బ్రహ్మానందం, ముక్కాలిపీట బాసీపెట్లు వేసుకుని, చిరునవ్వు నవ్వుతూ, ''నాకు తెలుసు మాష్టారూ వాడు అమాయకుడిలా మొహం పెట్టి, సంప్రదాయం, గౌరవంకల కుటుంబాల ఇంటి అల్లుడిగా అవ్వాలని తాపత్రయ పడుతున్నాడు. వాడివల్ల కానిపని అది. ఏ తల మాసిన వెధవా వాడి మాయలకు మోసపోడు'' అని చెప్పాడు.

సీతారామయ్య, భార్యకు ఈ విషయాలన్నీ దాచక చెప్పాడు. వాళ్లిద్దరికీ, కూతురు పెళ్ళి కన్నా, ఈ శంకరం వ్యవహారం, కాశీ మజిలీ కథలాగా క్రొత్త మలుపులు తిరుగుతూ ఆసక్తికరంగా వురది.

ఆ తర్వాత బ్రహ్మానందం మరికొన్ని క్రొత్త విషయాలు చెప్పాడు ''శంకరానికి ఇదివరకే పెళ్ళయిందిటండీ ! ఆ పిల్లకూ వీడికీ సరిపడిక, ఆ పిల్ల తాలూకు వాళ్లు తన్నడానికివస్తే, పారిపోయి చావుతప్పి కన్ను లొట్టబోయి యిక్కడకు తగులబడ్డాడట. త్రాష్టుడు. అమ్మమ్మ. వాడి మొహం చూశావా ఎప్పుడన్నా నింపాదిగా, గండు చీమలుతిన్న బెల్లంగడ్డలా వుంటుంది.''

సీతారామయ్య, ''సంబంధం తప్పిపోయింది చాలు'' అనుకున్నాడు.

ఆ తర్వాత కొన్నాళ్లకు సీతారామయ్య మహాలక్ష్మి, గుళ్లో పురాణం వింటానికి వెళ్లారు. అదిగో అక్కడ శంకరం కనపడి పలకరించాడు.

''నమస్కారం మాష్టారు ! ... ఈ మధ్య నా పెళ్లయింది. ఇదిగో ఈవిడ వసుంధర మా ఆవిడ'' అని భార్యను పరిచయం చేశాడు.

సీతారామయ్యకు కుతూహలం కలిగింది. ''అత్తగారిది ఏ వూరూ ?'' అనడిగాడు.

''ఈ ఊరేనండి ! బ్రహ్మానందం అని మా ఆఫీసులో, నా కోలీగ్ ! అతని చెల్లెలు.''

సీతారామయ్య ''అమ్మనీయమ్మ ! ఎంత కుట్ర జరిగిందీ ! '' అనుకున్నాడు మనసులో ! ఆ మాటే పైకన్నాడు.

మహాలక్ష్మి భర్తను విచిత్రంగా చూసింది. 


Lipton
RUBY DUST
RUBY DUST
ఉత్తేజాన్నిచ్చే, అతి చిక్కని టీ లిప్టన్ రుబి డస్ట్ టీ!!
లిప్టన్
రుబి డస్ట్
టీ

## "క్రూరచేష్టలు"లో వెర్రి బుద్ధులు

తండ్రి భూపాల్‌రావు (గొల్లపూడి)ని నిలబెట్టి కల్యాణ్ (సుమన్) తన మనోవేదనను కాస్త అక్కసుతో కలగలిపి వెళ్ళగక్కాడు ''ఒక తప్పు కప్పిపుచ్చుకోటానికి మరో తప్పు చెయ్యటం నాకిష్టం లేదంటే నువ్వేం అన్నావ్ ? తప్పు దిద్దుకోటానికి చాలా తెలివితేటలు కావాలిగాని, 'అది నీ దగ్గరలేదు కాబట్టి మేం చెప్పినట్లు ఈ నాటకం ఆడక తప్పదు,' అన్నావ్ ఆడాను అందువల్ల ఏం జరిగింది ? నా మీద కోపంతో మరింత మనసు విరుచుకుని, మీ కోడలు వెళ్లి ఆభానుచందర్‌గాడి ఆఫీస్‌లో జాయిన్ అయింది నేను మంచివాడ్ని అని చెప్పను కాని, వాడు మాత్రం ఓ రోగ్ !''

భూపాల్‌రావు తాపీగా అన్నాడు ''ఓ–కే ఓ–కే ఈ ప్రపంచంలో ఏ పని నేర్చుకోటానికైనా ఓ ట్రయినింగ్ సెంటర్ ఉందిగాని, మొగుడు పెళ్ళాలు హాయిగా - ఎలా కాపురం చెయ్యాలో చెప్పటానికి ఒక్క ట్రయినింగ్ సెంటరు లేదు — అని బాధపడ్డాను ఈ కాపురాల విషయాలు కాలేజీల్లో చెప్పరు తల్లిదండ్రులు నేర్పించకూడదూ ? కాబట్టి నా ఆలోచన పద్ధతిలో నేను బోధించబోయాను పెద్దవాడిగా నేను ఫెయిల్ అయ్యాను కాని, నువ్వున్నావ్‌గా ? నీ భార్య తన తప్పు తాను తెలుసుకునే వరకు ఆవిడ్ని కంటికి రెప్పలా కాపాడే పూచీ నీది ఇందుకు నువ్వు ఏం చేసినా కాదనను కాదంటే, నువ్వు నీ పర్లే చెప్పాలదాకా ఎందుగ్గాని, నేను చెప్పినట్లు చెయ్!''

కల్యాణ్ నొసలు చిట్లించి, దీర్ఘాలోచనలో మునిగిపోయాడు

దగ్గుపాటి భాస్కరరావు నిర్మించే అనంత లక్ష్మి క్రియేషన్స్ ''క్రూరచేష్టలు'' చిత్రానికి రాజాచంద్ర దర్శకుడు

అనూరాధ "కొత్త పెళ్లి కూతురు"



విజయశాంతి 'క్రూర చేష్టలు'లో



# సినిమా

## బాలకృష్ణ హీరోగా తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో "వల్నాటిపులి" రెండవ షెడ్యూల్

''మే 21 నుంచి 27 వరకు హైదరాబాద్‌లో మొదటి షెడ్యూల్ జరిగింది రెండవ షెడ్యూల్ జూన్ 15 నుంచి 30 వరకు విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం ప్రాంతాలలో జరుగుతుంది చివరి షెడ్యూల్



'పల్నాటి పులి'లో బాలకృష్ణ, భానుప్రియ

# విశేషాలు

-జి. వి. జి.

జూలై 15 నుంచి 31 వరకు,'' అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీమతి రోహిణీ చక్రవర్తి సమర్పించే సాయిచక్ర ప్రొడక్షన్స్ ''పల్నాటి పులి'' చిత్రంలో బాలకృష్ణ, భానుప్రియ, జగ్గయ్య, సత్యనారాయణ, రాళ్ళపల్లి, సుమిత్ర వగైరా తారా సందోహం. భీసెట్టి లక్ష్మణరావు కథకు, పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయ, శివశంకర్ నృత్యాలు, నాయుని మహేశ్వరరావు కూర్పుతో గోగినేని ప్రసాద్ నిర్మాత.

## సురేష్ ప్రొడక్షన్స్ చిత్రంలో నందమూరి బాలకృష్ణ హీరో

''మా సంస్థలో తొలిసారిగా బాలకృష్ణ, శారద, సంగీత, పరుచూరి గోపాలకృష్ణ నటిస్తున్నారు'' అన్నారు నిర్మాత డి. రామానాయుడు వీరి తాజా చిత్రంలో చంద్రమోహన్, గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్, విజయశాంతి, రమాప్రభ, నిర్మల ఇతర ముఖ్యభూమికలు పోషిస్తున్నారు కథ, సంభాషణలను పరుచూరి సోదరులు రాశారు చక్రవర్తి సంగీతం, ఎస్ గోపాలరెడ్డి ఛాయ, శంకరరావు శిల్పం, మార్తాండ్ కూర్పు నిర్వహిస్తున్నారు ''జూన్, జూలై, ఆగస్టులలో ప్రతినెలా 1–15 తేదీల మధ్య జరిగే మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తయిపోతుంది'' అన్నారు ఈ చిత్ర దర్శకుడు మురళీమోహనరావు

## కొన్ని చిత్రాల పేర్లు

★ బాలకృష్ణతో మురళీమోహనరావు దర్శకత్వంలో సురేష్ ప్రొడక్షన్స్ డి రామానాయుడు నిర్మించే చిత్రం ''కథానాయకుడు.'' 1969లో ఇదే పేరుగల చిత్రంలో ఎన్ టి ఆర్ నటించిన విషయం పాఠకులకు విదితమే

★ మోహన్‌బాబు ప్రధాన పాత్ర నిర్వహిస్తూ భారీ ఎత్తున నిర్మిస్తున్న శ్రీ లక్ష్మీ ప్రసన్న పిక్చర్స్ వారి చిత్రానికి ''ప్రాణంలో ప్రాణం'' అని పేరు పెట్టారు ఇటీవల ఈ చిత్రంకోసం ఎనిమిది లక్షల రూపాయల వ్యయంతో నిర్మించిన నాలుగు సెట్లలో అనూరాధ, బొంబాయి నర్తకీమణులు

''తంచు కాగడా''లో కృష్ణ



'లింగడు—రామలింగడు'లో రాజేశ్వరి, నరసింహరాజా



'మిస్టర్ విజయ్'లో రాధ

# సినిమా

## యండమూరి వీరేంద్రనాథ్ రచనతో జి. రాజ్ కుమార్ దర్శకత్వంలో ఎం. కె. చౌదరి చిత్రం

"సామాజిక స్పృహ గల ప్రయోజనాత్మక చిత్రం," అన్నారు జి రాజకుమార్ లోగడ ఈయన "పునాదిరాళ్ళు" చిత్రాన్ని డైరెక్ట్ చేశారు ఇప్పుడీయన దర్శకత్వంలో ఎస్. ఎస్ ప్రొడక్షన్స్ అనే నూతన సంస్థ నిర్మించే చిత్రానికి టి చలపతిరావు సంగీత దర్శకత్వంలో కొన్ని పాటలు రికార్డయ్యాయి. యండమూరి వీరేంద్రనాథ్ కథ, మాటలు రాశారు వి ఎస్ ఆర్ కృష్ణారావు ఛాయ, అంకిరెడ్డి కూర్పు, ఎస్ చంద్రశేఖరరావు ప్రొడక్షన్‌తో ఎస్ ఎ అజీజ్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. చంద్రమోహన్, ప్రభ, సత్యేంద్ర కుమార్, పి ఎల్ నారాయణ, ఝాన్సి, నవ నటి శ్రీ గౌరి పాత్రధారులు. "మరికొందరు కొత్త ఆర్టిస్టులను కూడా పరిచయం చేయాలనుకుంటున్నాం. జూలై నుంచి షూటింగ్ ఉంటుంది," అన్నారు నిర్మాత ఎం. కె చౌదరి

## రాజాచంద్ర దర్శకత్వంలో గుప్తా క్రియేషన్స్ చిత్రం

"నీతికి – అవినీతికి, ధర్మానికి – అధర్మానికి మధ్య జరిగే సంఘర్షణ ప్రధాన ఇతివృత్తం," అన్నారు రాజాచంద్ర ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె వి నారాయణగుప్త నిర్మించే చిత్రం మొదటి షెడ్యూల్ పూర్తయింది చంద్రమోహన్, సుమన్, ఈశ్వరరావు, గొల్లపూడి మారుతీరావు, నూతన్ ప్రసాద్, విజయశాంతి, పూర్ణిమ, రాజ్యలక్ష్మి, అన్నపూర్ణ, సూర్యకాంతం వగైరా నటవర్గం 'విశు' కథకు కాశీవిశ్వనాథ్ మాటలు రాశారు వేటూరి గీతాలకు కృష్ణ – చక్ర బాణీలు కూర్చారు పి చెంగయ్య ఛాయ, కళాధర్ శిల్పం నిర్వహిస్తున్నారు "జూన్ 15 నుంచి జూలై 25 లోగా ఏకబిగిన చిత్ర నిర్మాణమంతా ముగుస్తుంది," అని తెలియజేశారు ఈ చిత్రాన్ని సమర్పించే సంకలనకర్త కె సత్యం

## కృష్ణంరాజుతో హాస్యనటుడు సారథి చిత్రం

"జూలైలో సాంగ్స్ రికార్డ్ చేస్తున్నాం," అన్నారు సారథి ఈయన డాక్టర్ ప్రభాకరరెడ్డి కథ, సమర్పణలో నిర్మించే చిత్రంలో కృష్ణంరాజు, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి ప్రభృతులు ఉంటారు మద్దిపట్ల సూరి సంభాషణలకర్త భాస్కర్ దర్శకుడు

"పాపం ఇతనికి హోటల్లో రూము దొరకలేదట !"



## అవి - ఇవి

★ ప్రముఖ హాస్యనటుడు (సుత్తి)వేలు పూర్తి పేరు కురుమద్దాలి లక్ష్మి నరసింహారావు ఒకప్పుడు ఈయన విశాఖపట్నం నేవల్‌డాక్ యార్డ్‌లో పని చేశారు.

★ హాస్యనటి బిందు ఘోష్‌కు నర్తకిగా ఉన్నప్పటి పేరు విమల. అసలుపేరు కృష్ణవేణి ఈమె చక్కని గాయని కూడా

★ నృత్య దర్శకురాలు తార స్వస్థలం నెల్లూరు.

★ తమ కార్ఖానాలో ఉత్పత్తి అయ్యే అన్ని రకాల ముడి ఫిలిమ్‌ను విక్రయించడానికి ప్రసాద్ లాబ్, ఎ వి ఎం. లిమిటెడ్ సంస్థలను ఏజెంట్లుగా హిందూస్థాన్ ఫోటో ఫిలిమ్స్ సంస్థ నియమించింది.

★ ఇప్పుడు తెలుగు, హిందీ చిత్రరంగాలలో బిజీగాఉన్న జయప్రద 3 తమిళ చిత్రాల్లోనే నటించింది వాటన్నిటికీ కె. బాలచందర్ దర్శకుడు

★ కోయంబత్తూరులో కొత్తగా నిర్మితమైన 'మారుతి థియేటర్' లోని వి. ఐ. పి బాక్స్‌లో టెలిఫోన్, ఐస్‌వాటర్ సౌకర్యాలున్నాయి

★ భీశెట్టి లక్ష్మణరావు కథతో ఎ వి. యం. వారు తమిళంలో నిర్మించిన "వెళ్లైపురా ఒంద్రు" త్వరలో శతదినోత్సవం జరుపుకోబోతోంది ఈ చిత్రాన్ని ఇదే సంస్థ తెలుగులో పునర్నిర్మిస్తుంది. "భోళాశంకరుడు, "నానే రాజా" చిత్రానికి కూడా భీశెట్టి కథకుడు.

శ్రీ పంచవటి
చిత్రాలయ

# బంగారు కాపురం

నిర్మాత: కోగంటి విశ్వేశ్వరరావు

కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: చంద్రశేఖరరెడ్డి బి.ఏ.,




PADMALAYA PUBS

Bhaskar

# సాగర్ స్కిమ్ మిల్క్‌తో ఆతిథ్యం

మీ యింటికెవరైనా రాగానే, గడపతొక్కి లోపలికి రాగానే, మీ అతిథులకి మీరు చేసే సత్కారం ఏమిటి? ఓ చిరునవ్వు, ఓ కప్పు టీ—అవునా? మరి పరంపరాగతంగా వస్తూన్నదది—మీ సంప్రదాయం, సంస్కృతి, ఆదరణ-వీటి చక్కని పరిణామ స్వరూపం.

మరి వాళ్లొచ్చేసరికల్లా మీ యింట్లో పాలు అయిపోయాయనుకోండి. మీకెలాగో యిబ్బందిగా అనిపించదూ? ఇక అప్పటి కప్పుడు ఉన్న పళంగా పాలు రమ్మంటే ఎలా వస్తాయి గనక?

సాగర్ స్కిమ్ మిల్క్ పౌడర్, మరి మీ అమ్మగారి, అమ్మమ్మగారి నుంచీ తరతరాలుగా వస్తూన్న ఆ చక్కని సంప్రదాయాన్ని నిలబెడుతుందిక. అది కూడా పొదుపుగా, త్వరగా, తేలికగా. ఇక తీపి పదార్థాలూ, పుడ్డింగులూ అవీ చేసుకోవడానికి యిదెంతో బాగుంటుంది.




## సాగర్
### స్కిమ్ మిల్క్ పౌడర్

పాలలోని మంచిదనాన్నంతా యిస్తుంది, కొవ్వు పదార్థాలు లేకుండానే.



మార్కెట్ చేసేవారు:
గుజరాత్ కోపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001. గుజరాత్.

ASP/SMP/5/84

# హిందీ చిత్ర విశేషాలు

★ "కిస్మా ఖేల్" చిత్రంలో సంజీవ్‌కుమార్ పై చిత్రీకరింపబడే రెండు పాటలను హీరో సచిన్ పాడాడు. ఛాయాగ్రాహకుడు బాబూభాయ్ మిస్త్రీ దర్శకుడు.

★ రేఖకు దిలీప్‌కుమార్ ఉర్దూ నేర్పిస్తూ, ఆమె వద్ద నుంచి యోగాసనాలు నేర్చుకుంటున్నాడట.

★ "హీరో" చిత్ర నిర్మాత సుభాష్‌గాయ్ తన చిత్రాన్ని విడియోలో చూడొద్దని విజ్ఞప్తి చేస్తూ, బొంబాయిలో కొన్ని పెద్ద పెద్ద హోర్డింగ్‌లను అక్కడక్కడ పెట్టించాడు.

★ సంజయ్‌ఖాన్ అంగరక్షకుడు బాబ్ క్రిష్టో ఎక్కువగా దక్షిణ భారతంలో తయారయ్యే హిందీ చిత్రాల్లో నటిస్తున్నాడు.

★ రాజేష్‌ఖన్నాతో "ఆద్మీ ఖూల్ హై" చిత్రాన్ని రాజశ్రీ వారు తీయాలనుకున్నారు. కాని, పతాక సన్నివేశాన్ని మార్చాలని ఆ నటుడు పట్టుబట్టేసరికి చివరకి ఆ చిత్ర నిర్మాణాన్నే విరమించేశారట.

★ హీరో వినోద్‌మెహ్రా కొన్ని చిత్రాల్లో కేరెక్టర్ ఆక్టర్‌గా కనిపించబోతున్నాడు.

★ "స్టార్‌ట్రక్"లో పెర్సిస్ కంబట్టాలాగ "బహుమాంగే ఇన్సాఫ్" చిత్రంలో నటి సుప్రియాథక్ బోడిగుండుతో కనిపిస్తుంది.

★ బొంబాయిలోని మలద్ ప్రాంతంలో ఒక హోటల్‌కు శ్రీదేవి అని పేరు పెట్టబడింది. సందీప్ అనే ఆమె అభిమాని ప్రతి రోజూ ఆ హోటల్‌కే ఫలహారం ఆరగించడానికి వెళ్తుంటాడట.

★ సంగీత దర్శకుడు సలీల్‌చౌదరి వయసు 60. "కానూన్ క్యా కరేగా" చిత్రం మొత్తం రీరికార్డింగ్‌ను ఒక రోజు ఉదయం 9 నుంచి రాత్రి 10 లోగా ఏకబిగిన పూర్తి చేశాడట.

★ దేవ్ ఆనంద్ చిత్రం "ఆనంద్ ఔర్ ఆనంద్" లో నటించిన నటాషా ఇటీవల గీత రచయిత స్వర్గీయ శైలేంద్ర కొడుకు బాబ్లు శైలేంద్రను పెళ్ళి చేసుకుంది. ఇతను బాసు చటర్జీ వద్ద అసిస్టెంట్ డైరెక్టర్‌గా కొన్ని చిత్రాలకు పనిచేశాడు.

★ సలీమ్ జవేద్‌లు విడిపోయాక సలీమ్ తన పేరు సలీమ్‌ఖాన్‌గా, జవేద్ తన పేరును జవేద్‌అక్తర్‌గా పొడిగించుకున్నారు.

★ దారాసింగ్ నిర్మించే "రుస్తుమ్" చిత్ర నాయిక బిన్నీరాయ్ గత ఆరు మాసాలుగా ఎక్కడుందో ఐపులేదట. ఆమె ఉనికి ఆమె తల్లిదండ్రులకు కూడా తెలియదట.

★ "వీట్టుకు ఒరు కణ్ణగి" తమిళ చిత్ర దర్శకుడు ఎస్. ఎ. చంద్రశేఖర్ దాన్నే హిందీలో తయారు చేస్తున్నాడు. నాయిక హేమమాలిని పై ఒక హోటల్‌లో పాట చిత్రీకరణకు నెల రోజులపాటు వేచి ఉండవలసి వచ్చిందట. కాల్‌షీట్ సమస్య వల్లకాదు. ఆ సన్నివేశంలో ఆమె ధరించవలసిన విగ్‌మ విదేశం నుంచి తెప్పించడానికి అంత కాలం పట్టింది.

★ శ్రీదేవి ప్రతి రోజూ సిన్హా వద్ద హిందీ, వారానికి రెండుసార్లు గోపీకృష్ణ వద్ద నృత్యం నేర్చుకుంటోంది. ఒక్కోసారి గోపీకృష్ణ బొంబాయి నుంచి విమానంలో వచ్చి నేర్పించిపోతున్నాడు.

★ "ఏక్‌దుజెకెలీయే" చిత్రం తర్వాత కమల్‌హాసన్, రతిఅగ్నిహోత్రి నటించే "దేఖాప్యార్ తుమారా" చిత్ర నిర్మాణం వారిద్దరి మధ్య ఏర్పడిన భేదాభిప్రాయాల వల్ల కుంటుపడింది. ఇటుపైన ఇద్దరూ కలిసి నటించకూడదనుకున్నారు. కాని, ఇద్దరికీ ఇటీవల విజయవంతమైన హిందీ చిత్రాలు కరువైనందున ఆ "దేఖా ప్యార్ తమారా" చిత్రాన్ని త్వరితగతిన పూర్తి చేయాలనే నిర్ణయానికొచ్చారట.

★ ఆంగ్ల చిత్రాలు "ఆర్థర్" ఆధారంగా "షరాబీ", "ఫోర్ ఫెదర్స్" ఆధారంగా "కయ్యార్" చిత్రాలను ప్రకాష్ మెహ్రా రూపొందిస్తున్నాడు.




(గత సంచిక తరువాయి)

అతని వెనుకే లోపలకు నడిచిందామె

''మీ ఇంటికి ళ్ళివచ్చావా కృష్ణా ?''

ఆత్రుతగా అ

అతనికి కోపం ముంచుకొచ్చింది కానీ అతికష్టంమీద తమాయించుకున్నాడు

ఎలాగూ ఆమెను ఈ రోజుతో వదిలించుకో దల్చుకున్నాడు తను ఇంక చిరాకుపడడం ఎందుకు ?

''కూర్చో సావిత్రీ !'' అన్నాడతను తనూ సోఫాలో కూర్చుంటూ

ఆమె అతనిపక్కనే కూర్చుని అతని మొఖంలోకి చూడసాగింది

''మీవాళ్ళతో మాట్లాడారా ?''

''మాట్లాడాను ''

ఆమె మరింత ఆదుర్దాపడింది

''ఏమన్నారు ? వప్పుకున్నారా ?''

అతను జవాబివ్వలేదు

టీపాయ్‌మీదున్న ఓ మాగజైన్ అందుకుని పేజీలు తిరగేయసాగాడు

ఆమె మొఖంలో భయం కమ్ముకుందిప్పుడు

అతని చేతిని తన రెండు చేతుల్తో నెమ్మదిగా పట్టుకుంది

''మాట్లాడవేం కృష్ణా ?''

అతను తలెత్తి ఆమె కళ్ళల్లోకి చూశాడు

''వాళ్ళేమంటారోనని భయపడ్డానో – అదే అన్నారు –'' అన్నాడు విచారంగా మొఖంపెట్టి

ఆమె శరీరం సన్నగా వణకడం ప్రారంభించింది

ముఖం పూర్తిగా పాలిపోయింది

''అంటే ఇప్పుడు మనమేం చేయాలి ?''

వణుకుతున్న గొంతుతో అడిగింది

''నాకూ ఏమీ పాలుపోవడంలేదు'' బాధగా అన్నాడతను

ఆమె కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది

దుఃఖం పొంగుకొస్తోంది కానీ ఏడ్చేందుకు కూడా భయంగా ఉంది

తన జీవితం నాశనం అయిపోయిందన్న భావన, ఏవేవో పిచ్చి ఆలోచనలు

''కృష్ణా !'' నెమ్మదిగా పిలిచిందామె

''ఏమిటి సావిత్రీ ?''

''మనం ఎవరికీ చెప్పకుండా రిజిస్టర్ మారేజ్ చేసుకోకూడదా ?'' దీనంగా అడిగింది

''ఆ సంగతి కూడా ముందే ఆలోచించాను సావిత్రీ ! అదీ సాధ్యంకాదు ఎందుకో తెలుసా ? ఆ విషయం తెలిసినా మా అన్నా, వదినలయితే ఊరుకుంటారు కానీ మా అమ్మ విషయం నీకు తెలీదు నేనలాంటి పనేదయినా చేస్తే తను ఆత్మహత్య చేసుకుంటానని ముందే స్పష్టంగా చెప్పేసింది ''

ఆ మాటతో పూర్తిగా కృంగిపోయింది సావిత్రి

అతని తల్లి విషయం కాదు తనను బాధ పెడుతోంది–అతనిలోని మార్పు !

అతను అదివరకటి మనిషి కాదు

తనమీద చూపిన ప్రేమ ఇప్పుడతని మాటల్లో కనిపించడంలేదు

అసలానాటిమాటలే అతనికి గుర్తున్నట్లు లేదు

తామిద్దరూ ఒకటవాలన్న ఆత్రుత,ఆవేదన ఇవేమీ అతనిలో లేశమాత్రమయినా కనిపించడం లేదిప్పుడు

అయితే అతని మాటల అర్థం తమ వివాహం జరగడం అసంభవమనా ?

గుండెలు ఝల్లుమన్నాయ్ ఆమెకి

ఎందుకిలా జరిగింది ?

అతనికి తనమీద ఏర్పడ్డ ప్రేమ, అభిమానం, ఆకర్షణ, అన్నీ మాయమయిపోయాయా ?

అవన్నీ కేవలం తన శరీరం కోసం పుట్టినవేనా ?

తన శరీరం లభించగానే అవి దూరమయిపోయినాయా ?

అవి నిజంగా అంత తాత్కాలికమయినవా ?

ఒకవేళ ఆ మాటే నిజమయితే మరి తనలో అతనిమీద అదే ప్రేమ ఇంకా అలాగే ఎందుకుంది ?

ఎప్పటికయినా అతనే తన భర్త అవాలని ఎందుకు కోరుకుంటోంది ?

ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి ?

మలినమయిన మనసుతో ఎలాగోలా జీవించవచ్చు కానీ అతనిదయిన ఈ శరీరాన్నెలా భరించడం ? దీన్ని ఎలా ఇంకొకరికి అర్పించడం ?

ఒక్కసారిగా ఏడుపొచ్చేసిందామెకి

అంతవరకూ ఆపుకున్న దుఃఖం కట్టలు తెంచుకుంది రెండు చేతుల్లో మొఖం దాచుకొని విలపించసాగింది

ఈ పరిణామానికి నివ్వెరపోయాడు కృష్ణ

ఆమె బాధపడుతుందనుకున్నాడేగాని ఇలా చిన్నపిల్లలా ఏడ్చేస్తుందనుకోలేదు

''ఏయ్ సావిత్రీ ! ఏమిటిది ? ఏడుపెందుకు ?'' ఆమెను దగ్గరకు తీసుకుంటూ అడిగాడు

ఆమె అతని కౌగిట్లో పూర్తిగా ఒదిగిపోయింది

**జరిగిన కథ–6 :** కృష్ణ, ప్రసాదు స్నేహితులు కృష్ణ తనో డాక్టరుగా ఆ హాస్పిటల్ సిస్టర్‌కు చెప్పి తన పేషంటు ఒకామెకు ఇంజక్షన్ చేయడానికి ఆమెను రమ్మని వేడుకుంటాడు కృష్ణ అన్న సీతారామయ్య వస్తున్నట్లు టెలిగ్రాం ఇస్తాడు సిస్టర్ కృష్ణ ఇంటికి వస్తుంది కృష్ణ విచ్చలవిడి ప్రవర్తనకు ప్రసాద్ చికాకు చెందుతాడు తమ్ముడు అనుభవిస్తున్న ఆడంబరమైన జీవితాన్ని చూసి సీతారామయ్య ఆనందిస్తారు ఎలాగయితేనేం తను వేస్తున్న వెధవ వేషాలేమీ తన అన్న కంటబడకుండా మేనేజ్‌చేసి అతన్ని బస్ ఎక్కించేస్తాడు కృష్ణ తనకు పెళ్లి కుదిరిందని, ఆ తర్వాత నీ దగ్గరకు రానని ఖచ్చితంగా చెప్పేస్తుంది, చంద్రకళ కృష్ణతో నిదానంగా మార్గరేట్‌ను తన సహజ వాక్చాతుర్యంతో తన దారిలోకి తెచ్చుకుంటాడు ఆ తర్వాత తన పాత స్నేహితురాలు రాజేశ్వరి వచ్చి తన దాహం తీర్చుకొంటుంది ఆమె వెళ్లిన తర్వాత సావిత్రి దర్శనం సావిత్రికి తన స్నేహితుడి ఇండస్ట్రీలో అతనిద్వారా తనే జీతం ఇచ్చే మాట మీద ఉద్యోగం ఇప్పిస్తాడు కృష్ణ కృష్ణ సావిత్రిని ప్రేమిస్తున్నానని చెపుతాడు అతని తత్వం తెలీని సావిత్రి తనూ అతనిని ప్రేమిస్తున్నట్లు చెపుతుంది ప్రసాద్ ఉద్యోగంలో చేరను హైదరాబాదు వెళ్లిపోతాడు కృష్ణ తన మాయమాటలతో సావిత్రిని లొంగతీసుకొని మొహం చాటువేస్తాడు సావిత్రి తనకు పెళ్లి కుదిరిందని చెప్పినా కృష్ణ ఆ విషయాని కంత ప్రాముఖ్యత నీయకపోవడం ఆమెకు కలవరపాటును కలిగిస్తుంది సావిత్రిని ఏ విధంగా వదిలించుకుందామా ! అని ప్లాన్స్ వేస్తుంటాడు కృష్ణ

''కృష్ణా! నన్ను అన్యాయం చేయకండి! మీరు పక్కనలేని జీవితం ఊహించడం కూడా నావల్ల కాదు ''

ఏడుపు మధ్యలో మాట్లాడిందామె

''సావిత్రీ! ఎందుకలా బాధపడతావ్? ఇప్పుడు నువ్వింతగా బాధపడాల్సిన ఘోరం ఏం జరిగిపోయిందని?''

''ఇంతకంటె ఇంకేం ఘోరం జరగాలండీ! మీరు ఎన్నో మాటలు చెప్పి, ఇంత దూరం మీతోపాటు ప్రయాణం చేయించి ఇప్పుడు నన్ను నడిరోడ్డున వదిలేస్తే నేనేమయిపోవాలి?''

''నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వు సావిత్రీ! ఇప్పుడు ఇద్దరం తొందరపడి ఏమి చేసినా మనకే నష్టం —''

''కానీ ఇంకెంత కాలం మావాళ్ళ నాపగల నండీ? ఇప్పటికే మామయ్య ముందు సిగ్గుతో తల ఎత్తలేకపోతున్నాను అమ్మకు మొఖం చూపడంలేదు మీ ఇద్దరూ అంతగా ప్రేమించుకుంటే అతను మనింటికి ఎందుకు రావటం లేదు? నిన్ను పెళ్ళి చేసుకోడానికి ఎందుకు వెనుకాడుతున్నాడు? ఇప్పుడు చేసుకోడానికి వీలుకాకపోయినట్లయితే పోనీ ఫలానా రోజు చేసుకుంటానని మాతో ఎందుకు చెప్పడు? అంటూ నన్ను నిలదీస్తుంటే నా ప్రాణం పోతోంది నన్నిలా చిత్రవధ పెట్టటం మీకేమయినా న్యాయంగా ఉందా చెప్పండి!'' ఆక్రోసిస్తూ అందామె

అతను ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా నిమిరాడు

''సావిత్రీ! దయచేసి ఇంక మాట్లాడకు! నిన్ను నడిరోడ్డున వదిలేయాలనీ, నీకు అన్యాయం చేయాలనీ నేను మాత్రం అనుకుంటున్నానా? నాకు కొంచెం వ్యవధి కావాలని మాత్రమే చెప్తున్నాను నా పరిస్థితి ఎలావుందో తెలుసా? అసలు ఎటూ ఆలోచించుకోలేక పోతున్నాను''

ఆమె ఇంక మాట్లాడలేదు

తనింక ఏం మాట్లాడినా ఎంత ఏడ్చినా, తన హృదయంలోని బాధ ఎంత వివరంగా చెప్పినా అతను అర్థం చేసుకోలేదు అర్థం చేసుకోవాలనీ, తన బాధ పంచుకోవాలనీ అతనికుంటే కదా!

తనకిప్పుడు తెలిసిపోయింది

అతను తన నసలు మనస్ఫూర్తిగా ఎప్పుడూ ప్రేమించనేలేదు కేవలం తనను భ్రమింపజేశాడు తన శరీరం కోసం, తనతో అతనికి కావలసిన శరీర సౌఖ్యంకోసం, తనను లోబరుచుకున్నాడు

తన చుట్టూ వలపన్నాడు

తనకు ఏవేవో మాయమాటలు చెప్పి రంగుల లోకం లోకి తీసుకెళ్ళాడు

అతని కోరికలన్నీ తీరాక, తను పూర్తిగా అతని సొత్తయాక ఇప్పుడు తనను వదిలించుకోడానికి ప్రయత్నిస్తున్నాడు

ఆమె ఆలోచనలకు హఠాత్తుగా అంతరాయం కలిగింది

ఒకవేళ.. ఒకవేళ కేవలం తనను వదిలించుకోడానికే అతని తల్లికి ఇష్టంలేదన్న సాకు చెప్పటం లేదుకదా?

నిజంగా అతను అతని తల్లికి తమ విషయం చెప్పాడా?

ఆమె నిజంగా ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించిందా?

అంత వ్యతిరేకత ఆమెకెందుకు కలుగుతుంది?

ఒకవేళ అతని అన్న, అతని తల్లి అంత మొండి పట్టుదలగలవారనుకుంటే, మరి ఆ విషయం తనను ప్రేమించేముందు ఎందుకు గుర్తులేకపోయింది?

''మనిద్దరం పెళ్ళి చేసుకుందాం సావిత్రీ!'' అన్నప్పుడు ఆ విషయం ఎందుకు గుర్తురాలేదు?

'ఏనాటికయినా మనిద్దరం ఒకటవుదాం' అన్న మాట ఎలా ఇవ్వగలిగేడు?

ఆలోచిస్తున్నకొద్దీ ఆమె మనసు వికలమయిపోతోంది

''సావిత్రీ! ఇంకా ఇదే ఆలోచిస్తూ కూర్చున్నావుకదూ? ప్లీజ్! కాసేపు జరిగిందంతా మర్చిపో!''



ఆమెతో మాట్లాడడంగానీ, సంజాయిషీ చెప్పుకోవడంగానీ అతనికి సాధ్యమవడం లేదు

ఆమె నెమ్మదిగా బయటకు నడవసాగింది

కాళ్ళు వణుకుతున్నాయ్.

శరీరం మంటల్లో ఉన్నట్లు సెగలు—

ఏం జరిగింది?

ఏం చెయ్యాలిప్పుడు?

మగాడిని నమ్మకూడదని తెలుసు ఆడదానికి శీలమే సర్వస్వం అన్న విషయమూ తెలుసు! అది పోగొట్టుకుంటే మనుగడలేదనీ తెలుసు.

తెలిసి తెలిసి ఎందుకలా అతని వలలో పడిపోయింది?

ఎలా అతనికి తన సర్వస్వం అర్పించింది?

అంతగా తనను మోసగించే అవకాశం అతని కెందుకు కలిగించింది?

అతను చూపిన ప్రేమ, ఆరాధన, అభిమానం — అన్నీ నాటకమని ఇంతకాలం ఎందుకు తెలుసుకోలేకపోయింది?

రోడ్డుమీద కొచ్చేసిందామె

ఏం చేయాలి అనేది తెలీడం లేదు

ఎక్కడికెళ్ళాలి అనేది అర్థంకావడంలేదు

అతను తన శరీరాన్ని మలినం చేసినందుకు కాదు తన బాధ.

దానికోసం తనమీద అంత ప్రేమ నటించడం భరించరానిదిగా ఉంది.

అది నిజమయిన ప్రేమ, పవిత్రమయిన ప్రేమ అని తనకి నమ్మకం కలుగజేయడం దారుణంగా ఉంది.

ఇప్పుడు తనకి దుఃఖంలేదు

కన్నీళ్ళు కారడం లేదు

అతనిమీద కోపమూ లేదు

అసలేదీ తెలీని స్థితి.

తనేమిటో తనకి అర్థంకాని స్థితి

చాలాసేపు బస్స్టాప్ దగ్గరే నిలబడిపోయిందామె.

ఎన్నో బస్సులు రావడం పోవడం — ఇవేమీ ఆమెకు కనిపించడంలేదు

ఆమె బయటికెళ్ళిపోయాక నీరసంగా సోఫాలో కూర్చుండిపోయాడు కృష్ణ.

కొద్దినిమిషాల తర్వాతగానీ తిరిగి మామూలు మనిషి కాలేకపోయాడు.

మార్గరెట్ బట్టలు కట్టుకుని వచ్చి, అతని కెదురుగ్గా నిలబడింది

'ఎవరా అమ్మాయ్?'' అడిగిందామె.

''తెలిసిన అమ్మాయ్..''

''పూర్తిగా తెలుసా? ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నావా?'' వ్యంగ్యంగా అంది.

అతను తడబడ్డాడు.

''అబ్బే. ఆమె మా ఫ్రెండ్ సిస్టర్..''

''కాదని నేననలేదుగా! అయినా ఫ్రెండ్ సిస్టరయినంత మాత్రాన నువ్వు మడిగట్టుకుని కూర్చున్నావంటే నేనెలా నమ్మను?''

# జీవితం—సెంటిమెంట్

''మార్గరెట్—'' ఏదో చెప్పబోయాడతను

''ఎందుకలా అబద్దాలు చెప్తావ్? నేనిప్పుడు ఆ అమ్మాయికీ, నీకూ ఏమిటి సంబంధం అని అడగలేదుగా? ఒకవేళ అడిగినా నీకు భయమెందుకు? ఆమె నీలాంటి మరో స్నేహితురాలు అని ఎందుకు చెప్పేయకూడదూ? నీకూ ఆ అమ్మాయికీ సంబంధం ఉందని చెప్తే, నేనేం చేయగలను? నేను నీ భార్యను కాదుగదా చొక్కా పట్టుకోడానికి?''

అతను మాట్లాడలేకపోయాడు.

ఆమెవంక తెల్లబోయి చూడడం తప్పితే ఇంకేమీ చేయలేకపోతున్నాడు

ఆమె నెమ్మదిగా గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయాక చాలాసేపు అక్కడే కూర్చుని ఆలోచనల్లో మునిగిపోయాడతను

సావిత్రి మార్గరెట్ని చూసినందుకు కాదు బాధ! మార్గరెట్ సావిత్రిని చూసినందుకు.

మార్గరెట్కి కోపం వచ్చిందో లేదో తెలీదు

తనకు ఆమెతోనేకాక మరో స్త్రీతో కూడా సంబంధం ఉందన్న విషయం ఆమె ఎలా తీసుకుంటుందో తెలీటంలేదు

ఆమె అంతగా అప్సెట్ అవదనే తన నమ్మకం.

ఈ దెబ్బతో సావిత్రిని పూర్తిగా వదిలించుకున్నట్లే లెక్క!

ఫోన్ మోగసాగింది.

లేచి ఫోన్ అందుకున్నాడతను

''హలో—''

''కృష్ణా! అర్జంటుగా ఇంటికి రావాలి నువ్వు!'' శీతారామయ్య గొంతు. కృష్ణ ఉలిక్కిపడ్డాడు. అన్నయ్య గొంతులో మొట్టమొదటిసారిగా ఏదో తత్తరపాటు, ఆందోళన-కనబడుతున్నాయ్

''ఎందుకన్నయ్యా?''

''రుక్మిణి సీరియస్ కండిషన్లో ఉంది నువ్వు వెంటనే బయల్దేరు—'' ఆ మాటతో

## కిమ్మనరు!

విలేఖరిగా
విచిత్రమైన వార్తలు రాస్తే
కడుచిత్రంగా చూస్తారీ జనాలు
కానీ నాయకులపై
వారి అక్రమాలు రాస్తే
రాసేవారిపై కూతలు కూసినా
కిమ్మనరీ ప్రజలు

— ఆర్. పద్మనాభరావు

అతనికి చెమటలు పట్టేసయ్ కాళ్ళూ చేతులూ వణకసాగినయ్

''సరే. వస్తున్నాను''

అనేసి ఫోన్ పెట్టేశాడు

స్కూటర్మీద అప్పటి కప్పుడే అనకాపల్లి బయల్దేరాడతను ఇంటికి చేరుకునేసరికి లోపల్నుంచి ఏడుపులు వినబడుతున్నాయ్. అన్నయ్య, వదిన రుక్మిణి పక్కనే కూర్చుని బిగ్గరగా ఏడుస్తున్నారు.

అక్కడే నీరసంగా కూలబడి పోయాడు కృష్ణ. రుక్మిణి మొఖం చూసి తనూ చిన్న పిల్లాడిలా ఏడ్వేయసాగాడు

ఆ సాయంత్రమే కర్మకాండలు జరిగిపోయాయ్

రాత్రి శీతారామయ్య చెప్పాడు, రుక్మిణి పాయిజన్ తీసుకుంది

''ఎందుకని అన్నయ్యా?''

''అది ప్రెగ్నెంట్!''

కళ్ళముందు ఛటుక్కున ఆ రోజు తను చూసిన దృశ్యం మెదిలిందతనికి. ఖచ్చితంగా ఆ ఎదుటి మేడలోని స్టూడెంట్స్ పనే అది

''ఎలా జరిగిందది?''

''కొద్ది నెలల క్రితం వరకూ ఆ ఎదుటి బిల్డింగులో స్టూడెంట్స్ కొంతమంది అద్దెకుండేవారు. అందులో ఎవరో కారణమయి ఉండాలి''

''వాళ్ళేమయ్యారిప్పుడు?''

''ఎప్పుడో ఖాళీచేసి వెళ్ళిపోయారు వాళ్ళ వాళ్ళ ఊళ్ళకు!''

''పోలీస్ రిపోర్ట్ ఇవ్వలేదా అన్నయ్యా?''

''ఇంకా వీధినపడి ప్రయోజనం ఏమిటి?''

కృష్ణ మాట్లాడలేదు

హఠాత్తుగా అతనికి సావిత్రి గుర్తుకొచ్చింది

సావిత్రికీ, రుక్మిణికీ ఏమిటి తేడా?

రుక్మిణిని ఆ స్టూడెంట్ ఎలా మోసం చేశాడో, తనూ సావిత్రినలా మోసం చేశాడు. అవసరం తీరాక అతను రుక్మిణిని నట్టేట్లో వదలి ఎలా పలాయనం చిత్తగించాడో తనూ సావిత్రి నలా గెంటివేశాడు అతని హృదయమంతా పశ్చాత్తాపంతో నిండిపోసాగింది

రుక్మిణి చనిపోయే ముందు ఎంత చిత్రవధ అనుభవించిందో! తనను అమితంగా ప్రేమించే అన్నలిద్దరికీ తను చేసిన అనుచిత మయిన పని తెలియజేయడానికి మనసొప్పక ఈ మార్గం ఎంచుకుందామె ఆమె ఈ విషయం తమతో చెప్తే ఎంత బాగుండేది? ఆ స్టూడెంట్నే రెక్కలిరిచి తీసుకొచ్చి తాళి కట్టించే వాళ్ళు. వాడడిగినంత కట్నం ఇచ్చి ఉండేవాళ్ళు.

వారం రోజులు గడచిపోయినయ్

హఠాత్తుగా అతనికో ఆలోచన వచ్చింది.

ఒకవేళ సావిత్రి కూడా రుక్మిణి లాగా ఆత్మహత్య చేసుకుంటుందేమో?

ఆ ఆలోచన రాగానే అతనింక ఒక్కక్షణం కూడా అక్కడ ఉండలేకపోయాడు. ఊహుఁ సావిత్రి జీవితం అలా ముగియకూడదు. తను ఆమెను పెళ్లి చేసుకోవాలి చేసినతప్పు సరిదిద్దు కోవాలి ఆ రాత్రే బయల్దేరి వైజాగ్ చేరు కున్నాడతను. గదిలో సావిత్రి గురించే ఆలోచన లతో నిద్ర పట్టనేలేదు. ఉదయం సావిత్రి ఇంటికెళ్లి తన నిర్ణయం ఆమెకు తెలియ జేయాలి.

అంతవరకూ మనశ్శాంతి ఉండదు తనకి.

తెల్లవారుతోండగా నిద్ర పట్టిందతనికి

తిరిగి మెలకువ వచ్చేసరికి కాలింగ్‌బెల్ ఆగకుండా మోగుతోంది

లేచి టైమ్ చూసుకున్నాడతను

మధ్యాహ్నం పన్నెండవుతోంది 'బహుశా కుర్రాడు భోజనం తెచ్చి ఉంటాడు' అనుకున్నా డతను. వెళ్ళి తలుపు తెరచాడు.

ఎదురుగ్గా పోలీసులు.

ఆశ్చర్యపోయాడతను

''కృష్ణ మీరేనా?'' అడిగాడతను

''అవును!''

''మీరు వెంటనే పోలీస్ స్టేషన్‌కి రావాలి!''

''ఎందుకు?''

''మీకు సావిత్రి అనే అమ్మాయి తెలుసా?''

కృష్ణ ఉలిక్కిపడ్డాడు

''తెలుసు. ఎందుకు?''

''రాత్రి ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంది ''

''ఆ త్మ హ త్యా '' నివ్వెరపోతూ అన్నాడతను

అతనికా క్షణంలో వళ్ళంతా చెమటలు పట్టేసినయ్. కాళ్ళు చేతులు తనకు తెలీకుండానే వణకసాగినాయ్!

''ఆత్మహత్య చేసుకుందా?'' నమ్మలేనట్లు అడిగాడు

''అవును!''

''ఎందుకు?'' అయోమయంగా అడిగాడు

''ఆ విషయం ప్రశ్నించడానికే నిమ్మల్ని స్టేషన్‌కి తీసుకెళ్తోంది ''

కృష్ణ ఖంగారు పడిపోయాడు

కృష్ణ మొఖం పూర్తిగా పాలిపోయింది

తనను కున్నంతా జరిగిపోయింది

ఎందుకంత తొందర పడింది సావిత్రి? ఎందుకలాంటి పనిచేసింది? ఇంకొక్క రోజు ఆగితే తనామెను దక్కించుకునేవాడు కదా!

''సావిత్రీ! ఎందుకింత దారుణానికి తల పడ్డావ్?'' బాధగా అనుకున్నాడతను

''మీరు త్వరగా రావాలి. '' కానిస్టేబుల్ హెచ్చరించాడు

హఠాత్తుగా అతనిలో భయం చోటు చేసుకుంది

# ఇ'వేమన'పద్యాలు




గుణవతైన భార్య గృహము చక్కగ నుంచు
చీకటింట దివ్వె చెలగు రీతి
దేవియున్న యిల్లు దేవాలయంబురా
విశ్వదాభిరామ వినుర వేమ

తనను ఈ కేసులో ఇరికించరు కదా! వెంటనే ప్రసాద్‌కు టెలిగ్రామ్ ఇవ్వాలి లేపోతే తను చిక్కుల్లో పడిపోతాడు త్రోవలో ప్రసాద్‌కి వెంటనే రమ్మని టెలిగ్రామ్‌లిచ్చాడతను.

పోలీస్ స్టేషన్లో తననుకున్నట్లుగా తనను ఇరికించలేదు

సావిత్రికీ తనకూ స్నేహం ఉందా? ఆమె ఆత్మహత్య చేసుకోడానికి గల కారణాలేమయినా తెలుసా? అన్నీ ఇలాంటి ప్రశ్నలే వేశారు ఇంటికి చేరుకునేసరికి మధ్యాహ్నం అయిపోయింది

లెటర్ బాక్స్‌లో ఒక కవరు ఉంది

సావిత్రి దస్తూరి తెలుస్తూనే ఉంది

వేగంగా కొట్టుకుంటున్న గుండెల్తో గదిలోకొచ్చి తలుపులు మూసివేసి ఉత్తరం చదవసాగాడతను.

**(ఇంకా వుంది)**

డబ్బు తిరిగి యిచ్చే పూచీపై 45 రోజుల

# ఉచిత ట్రయిల్



జెనీవా ఆల్,వరల్డ్ టూ బ్యాండ్ ట్రాన్సిస్టర్ ఇప్పుడు ఫ్యాక్టరీ ధర **140/-** లకే లభించును (అన్ని చేరి) ఇంటిలో/ప్రయాణంలో చక్కని తోడు రెండు సంవత్సరములు గ్యారంటీ లైసెన్సు అవసరము లేదు ప్రతి గ్రామానికి పట్టణానికి విపిపిలో పంపబడును నేడే మీ ఆర్డరు ఇంగ్లీషు లేదా హిందీలో మాత్రమే పంపండి

**Deepak Enterprises, (W.A.P.)**
**86, Gobind Nagar,**
**AMBALACANTT-133001.**
**Phone : 22795**



**EAGLE**
RESTAURANT & BAR
PRAKASAM ROAD, VIJAYAWADA-2 PH 63903




FOR YOUR CHOICEST COCK TAILS & ICE CREAMS

**CANTON**
AIR CONDITIONED RESTAURANT

CATERING VARIETY OF CHINESE FOOD



Exclusive family Section in **Anupam** GARDEN
ENJOY IN SPACIOUS GARDEN
A TOUCH OF CLASS TO A NEW EXPERIENCE



VIMAL A RELIANCE PRODUCT

భారత దేశంలో అత్యధికంగా అమ్ముడుపోయే "విమల్" వస్త్రముల ఆథరైజ్‌డ్ షోరూమ్

# విమల్ దీప్

ప్రకాశంరోడ్, గవర్నరుపేట సెంటర్
విజయవాడ 2. PHONE:75558

నవ్యత, నాణ్యతగల సూటింగ్స్, షర్టింగ్స్ శారీస్, డ్రస్ మెటీరియల్స్ మిల్స్‌ద్వారా సిఫారసు చేయబడిన ధరలలో లభించును



14-7-84 విడుదలయ్యాయి! శ్రీశ్రీనివాస వారి నవ నవలా మాలికలు!

| | |
|---|---|
| ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి-**నివేదిత** (డైరెక్ట్ నవల) | రూ 20/- |
| వాసిరెడ్డి సీతాదేవి-**ప్రణయ వీచికలు** (జ్యోతి మాసపత్రిక సీరియల్) | రూ. 16/- |
| లల్లాదేవి - **భార్గవనాగు** (డైరెక్ట్ నవల) | రూ 20/- |
| కె.రామలక్ష్మి-**సుడిగాలి** (డైరెక్ట్ నవల) | రూ 16/- |
| గిరిజశ్రీ భగవాన్-**ప్రేమ ప్రళయం** (డైరెక్ట్ నవల) | రూ 16/- |

# శ్రీ శ్రీనివాస పబ్లిషింగ్ హౌస్

ఎ.టి. అగ్రహారం, గుంటూరు-522004

# బామ్మగారు - మనుమడు

ముమ్మిడి శ్యామలారాణి



"ఒరేయ్! కామేశం! నా మాట వినురా, బాబూ! కామేశం మాష్టారుగారి మనుమరాలు కనకమహాలక్ష్మిని నీకిస్తాం అని కబురు పెట్టారు. కనక మహాలక్ష్మి నిజంగానే లక్ష్మి దేవిలా ఉంటుందిరా ఆ అమ్మాయే నీ భార్య అయితే పార్వతీ పరమేశ్వరుల్లా ఉంటుందిరా మీ జంట" అన్నారు బామ్మగారు

"చస్! చస్తే నేనాసంబంధం చేసుకోనే బామ్మ రోడ్డు మీద జులాయిగా తిరిగే జులాయి వెధవలకి పాతికవేలు ఇస్తున్నారు డిగ్రీ చదివి బ్రహ్మాండమైన ఉద్యోగం చేస్తూ చచ్చు పదిహేనువేలకి చేసుకోమంటావా?" కోపంగా అన్నాడు కామేశ్వరావు

కామేశ్వరావు పెడసరం మాటలువిని "ఓరి నాయనోయ్ తల్లిదండ్రులులేని పిల్లడని గారబం చేసిన మాట నిజమే కాని ఇలా ఇంత పెడసరంగా, పెద్దదానిమాట లెఖ్ఖ చేయకుండా తయారు అయ్యావు ఏమటిరా నాయనా! లక్ష్మి దేవిలాంటి పిల్లను వెధవ కట్నంకోసం కాదంటావా? నలుగురు పదింట్లోను, రోడ్డు మీద నడిచిపోతుంటే, మీ ఇద్దరి జంట చూడ ముచ్చటగా ఉంటే చూసి మెచ్చుకుంటారు గాని వెధవ కట్నం చూసి మెచ్చుకోరురా సన్నాసి అయినా నాకు, తెలియక అడుగుతాను నీకు ఈ డబ్బు పిచ్చి పట్టుకుంది ఏమిటిరా నాయనా" అన్నారు రాగాలు తీస్తూ బామ్మగారు

బామ్మగారి మాటలకు, కామేశ్వరావు పాంట్ జేబుల్లో చేతులు పెట్టి హీరోలా నవ్వబోయి విలన్‌లా నవ్వి "రెక్కలు రాకముందు ఐమీన్ నీ ఒడిలో పెరిగినప్పుడు తెలియలేదు గాని రెక్కలు వచ్చి బయట ప్రపంచంలో అడుగు పెట్టాక . హోటల్ కాంధారీలో ఒక కాఫీ సింగిల్ ఇడ్లీ తిన్నాక డబ్బు విలువ తెలిసిందే" అంటూ బామ్మగారు మారు మాట్లాడానికి అవకాశం ఇవ్వకుండా వీధిలోకి పరిగెత్తాడు.

కాలం దొర్లుతూనే ఉంది కామేశ్వరావు పెళ్ళికున్నాడని తెలిసి ఆడపిల్లల తండ్రులు 'క్యూ'లో నిలబడి బామ్మగారి దర్శనం చేసుకొని, తమ అమ్మాయిలను చూసుకోవడానికి రమ్మని చెప్పి పోతూనే ఉన్నారు

బామ్మగారి మనసు మనసులో లేదు. చచ్చి స్వర్గాన ఉన్న కొడుకును పదిసార్లు తలంచుకొని ''పిచ్చి నాయనా ! లింగు లిటుకు అంటూ ఒక్క కామేశంగాడినే కన్నావుగాని ఎంతమంది ఆడపిల్లలు ఉన్నారో చూడు ! పెళ్ళి—పెటాకులు లేకుండా, వాళ్ళని చూస్తుంటే మనసు తరుక్కుపోతుంది'' అని తెగబాధపడిపోయారుబామ్మగారు.

* * *

ఆఫీసుకి టైమ్ కావడంతో అద్దంలో చూసుకుంటూ, చిన్నగా ఈల వేసుకుంటూ దువ్వుకుంటున్న కామేశ్వరావు సడన్‌బ్రేక్ వేసినట్లు ధవ్‌మని దువ్వుకోవడం ఆపి, కెవ్వున కేకవేసి, మరోసారి అద్దంలో చూసుకున్నాడు.

అందంగా, మనోహరంగా రింగు చుట్టుకొని నుదురుమీద ఆడుకుంటున్న ముంగురులో తెల్లవెంట్రుకలు కనబడ్డాయి కామేశంకి.

ఇన్నాళ్లు తనకి ఎస్టేటు లేకపోయినా, ఉండడానికి పెద్ద బంగళా లేకపోయినా, తిరగడానికి కారు లేకపోయినా బాధ అనిపించలేదుగాని అందంగా నుదుటిమీద ఆడుకుంటున్న రింగులు తిరిగిన జుత్తులో తెల్లవెంట్రుకలా ? అద్దంలో స్పష్టంగా కనబడుతున్న తెల్లవెంట్రుకలు చూస్తుంటే బాధతో మనసు చుట్టుకుపోసాగింది కామేశ్వరావుకి.

అందంలో, పర్సనాలిటీలో తను హీరోలా ఉంటాడు, తనకి తక్కువ ఏమిటి ? తనంటే, తన చూపులంటే... తన నుదురుమీద దోబూచులాడుతున్న ముంగురులు అంటే ఆడపిల్లలు పడిచస్తారు అని మురిసిపోతున్న ఈ సమయంలో ఏమిటి ఈ విపరీతం ? తను...నిజం చెప్పాలంటే అందం చూసుకొని... ముచ్చటయిన ఉంగరాల జుత్తు చూసుకొనే కదా అమ్మాయిల తండ్రులు క్యూలోనిలబడి పిల్లనిస్తాం అంటున్నా స్టయిల్‌గా అక్కరలేదు పొమ్మన్నాడు. తన ఉద్యోగం... హోదా... అందం అన్నీ చూసి ఇరవై వేలు ఏం కర్మ... యాభై వేలయిన ఇస్తారు అనుకున్నాడు. అంతేకాదు పెద్ద వయసు ఏం ముదిరిపోయింది కర్మ, ఒక్క నాలుగైదేళ్ళు ఆగి అయినాసరే తను అనుకున్న కట్నంకి పైస తగ్గకూడదు అనుకున్నాడు. కాని ఇప్పుడే... ఇంత తొందరలోనే తన అందమైన ఉంగరాల జుత్తులో తెల్లవెంట్రుకలా ? ఈ సంగతిగాని ఆడపిల్లల తల్లిదండ్రులకు తెలిసిపోతే తన రేటు ఒక్కసారి పడిపోదూ ? అసలు తన వయసెంత ? రిజిష్టరులో ఉన్న ప్రకారం అయితే... చకచకా వేళ్ళమీద లెక్కపెట్టుకున్నాడు.

అమ్మో ! ఇరవై ఎనిమిదేళ్ళు... తను యింకా కాలేజీలో డిగ్రీ చదువుతున్నప్పటి వయసే గుర్తుపెట్టుకున్నాడు అని మనసులోనే దిగులు పడిపోయి,కొంపదీసి తల అంతా తెల్లవెంట్రుకలు బయలుదేరలేదు కదా అనుకొని తలని చెల్లా

# బామ్మగారు-మనవడు

చెదురు చేసుకొని అద్దంలో చూసుకున్నాడు కామేశ్వరరావు.

మేం వచ్చేసాం చూసుకోండోచ్ అంటూ అక్కడక్కడ తెల్ల వెంట్రుకలు ఉండడం చూసి గుండెలు బాదుకోసాగాడు కామేశ్వరరావు.

''ఏమిట్రానాయనా ? ఏం జరిగిందిరా'' అని బామ్మగారు హడావిడిగా గదిలోకి వచ్చి అట్లకాడ క్రిందపడేసి మనుమడిని కౌగలించుకొంది.

''ఇంకేం జరగాలే బామ్మ ! జరగకూడనిదే జరిగిపోయింది'' అని గొళ్ళుమన్నాడు.

చెట్టంత తండ్రి గుండెపోటుతో చెప్పపెట్టకుండా చనిపోయినప్పుడు కూడ ఇలా గుండెలు బాదుకోలేదు. పిచ్చిసన్నాసి చుట్టాలలో ఎవరోపోతే ఇలా గొళ్ళుమనాలా ? అనుకొని ఎప్పుడొచ్చిందిరా నాయనా టెలిగ్రాం ? ఇంతకీ ఎవరు పోతా ? దిక్కుమాలిన రోజులు అన్నిటికీ కరువే బ్రతికిఉండి ఏం బావుకుంటాంలే చచ్చినోళ్ళే అదృష్టవంతులు... మీ అమ్మ, నాన్న... మీ తాతగారు హాయిగా కళ్ళు మూసుకొని వైకుంఠం వెళ్ళారు. బ్రతికి నీపెళ్ళి పెటాకులు చూడకుండా పీనుగలా బ్రతుకుతున్నాను. ఆ భగవంతుడు కొడుకుని, కోడలిని భర్తను పొగొట్టుకొని మొండిదానిలా ముండ బ్రతుకు బ్రతకమని నా నుదుట రాశాడు'' అని చచ్చిపోయిన వాళ్ళందరిని తలంచుకొని ఒకటే ముక్కు చీదసాగారు.

అంతవరకు గొళ్ళున ఏడుస్తున్న కామేశ్వరరావు టక్కున నోరు మూసేసి ఆశ్చర్యంగా బామ్మగారి వైపు చూసి ''ఛ...ఛ...ఏడవకే... ఎవరు చావలేదు... ఎవరో చస్తే నే నెందుకు ఏడుస్తాను ? నా వయసు కరెక్టుగా ఇరవై ఎనిమిదేళ్ళేకదూ ? అప్పుడే తెల్ల వెంట్రుకలు వచ్చేసాయి ఏమిటి...'' అని మరోసారి ఘొళ్ళుమన్నాడు కామేశ్వరరావు.

బామ్మగారు పరీక్షగా మనుమడి వైపు చూసారు.

బుగ్గలు చేత్తో నొక్కుకుంటూ ''రాక ఏం చేస్తాయిరా సన్నాసి... చెబితే విన్నావా ? చిన్నోడివా ? చిటికోడికా ? ఇంకా ఇరవైఎనిమదేళ్ళే అనుకుంటున్నావ్ ? మీ అమ్మ, నాన్నకి లేకలేక పుట్టావని స్కూలో నాలుగేళ్ళు వయసు దాచి మరీ వేసారు ? ఈ వయసుకి ఈపాటికి పెళ్ళికెదిగిన కూతురు ఉండవలసింది. ఛ !... ఛ !... ఏం కాలమో ? ఏమో ? అంత అయిపోయినాక సంతలా వయసు లుడిగిపోయి, కోరికలు చల్లారిపోయి అందాలు హరించుకునిపోయినాక ... ఏదో కాలం వెళ్ళదీయడానికి తోడు కావలన్నట్లు ఈ పెళ్ళిళ్ళు. మా కాలంలో నయితేనా ఏంచక్కా మగాడికి నూనూగు మీసాలు రాగానే, ఆడపిల్లకి నిండా పన్నెండు ఏళ్ళు వయసొచ్చి ముద్దబంతి పువ్వుల సిగ్గుతో కుందనపు బొమ్మలా నలుగురిలోకి రావడానికి పెటపటాయిస్తున్న సమయంలో రంగవైభోగంగా పెళ్ళిళ్ళు చేసేవారు. ఇదేం కాలమో ? ఏమో ? సిగ్గు, శరం రెండు వదిలి, మొగుడు కావాలి మొర్రో ... పెళ్ళిళ్ళు ...'' ఏకధాటిగా ఉపన్యాసం ఇస్తున్న బామ్మగారివైపు చూసి కామేశ్వరావు పెద్ద పెద్ద కేకలు వేసాడు.

''ఆపవే నీ దండకం ! బి.పి. పెరిగిపోయిందే నీ ఉపన్యాసం వింటే ... ఈ విషయాలన్ని ముందు చెప్పి ఏడవలేకపోయావా ? ఈ రోజే పద ... నువ్వు ఏ పిల్లను చూడడానికి రమ్మంటే ఆ పిల్లను చూడడానికి వస్తాను ... అర్థమయిందా'' అన్నాడు ఆవేశంగా కామేశ్వరావు.

బామ్మగారి మొఖం సంతోషంతో చాటంత అయింది.

దిక్కుమాలిన తెల్లవెంట్రుకలు వస్తే వచ్చాయిగాని ఎంత మేలుచేసాయి అని బామ్మగారు మురిసిపోయి, ఉండ్రానాయనా శాస్త్రులుగారిని కబురుపెడతాను అన్నారు సంతోషంగా బామ్మగారు.

* * *

ఆఫీసునుండి వచ్చి రావడంతోనే... ''బామ్మా ! ఏమిటే ఇంకా అలా పిచ్చిదానిమల్లే మడిగుడ్డతోనే నేలమీద పడుకున్నావ్ ? ఏం జరిగింది ? వంట్లోగాని బాగుండలేదా ? అన్నట్లు ఈరోజు సాయంకాలం ఆఫీసునుండి రాగానే పెళ్ళిచూపులకు వెళ్ళవచ్చు అన్నాను కదా? శాస్త్రులుగారితో చెప్పావా ?'' అన్నాడు.

కామేశ్వరావు మాటలకి కయ్‌మని లేచారు బామ్మగారు ''నోరుముయ్యరా! పెద్ద వెళతాడట, పెళ్ళిచూపులకు ... లక్షణమైన పిల్లలు ఉన్నప్పుడు పెళ్ళిచూపులకు రమ్మంటే కసిరి పొమ్మన్నావ్ ! వాళ్ళకేం !... చక్కగా నువ్వా నేనా అన్నటువంటి వాళ్ళని పెళ్ళిచేసుకొని బిడ్డల తల్లులు కూడ అయ్యారు. ఇప్పుడు అలాంటి పిల్లలుండవద్దు'' అన్నారు కోపంగా బామ్మగారు.

బామ్మగారి మాటలకు హతాశుడయ్యాడు కామేశ్వరరావు.

''ఏమిటే బామ్మ నువ్వంటున్నాది ! మన దేశంలో పెళ్ళిచూపులకు అమ్మాయిలే కరువయ్యారా, నమ్మశక్యంగాలేదు'' అన్నాడు ఆందోళనగా కామేశ్వరరావు.

''నీ బొంద.. అమ్మాయిలు కరువయ్యారు అని నేను చెప్పానటరా ? బోలెడుమంది ఉన్నారు. ప్చ్ ! శాస్త్రులుగారు ఫొటోలు తెచ్చి చూపెట్టారు. ప్చ్ ! ఒక్క అమ్మడు మొఖంలోను లక్ష్మి కళలేదు'' అన్నారు బాధగా బామ్మగారు.

''నా బొందకాదు... నీబొంద. లేకపోతే లక్ష్మీకళ ఎవరికి కావలే ? నాకు కావలసింది ఫ్యాషనబుల్ ఫేస్ అంటే మోడరన్ కళ వుంటే చాలు'' అన్నాడు కామేశ్వరావు.

కామేశ్వరావు మాటలకు చిర్రెత్తు కోపం వచ్చింది బామ్మగారికి. ''ఏం ఫేస్టో... ఆ అమ్మడు నీకిష్టం అయితే చాలు, నాకెందుకురా కామేశం మధ్యన'' అన్నారు.

* * *

బామ్మగారు కామేశ్వరావు దగ్గర తీరుబడిగా కూర్చోని ఆ రోజు చేసిన లడ్డూలు, జంతికలు, కామేశ్వరావు తింటుంటే ప్రేమగా చూస్తూ ''అందుకేరా కామేశం నిన్ను త్వరగా పెళ్ళిచేసుకోమని ఇన్నాళ్ళు పోరు పెట్టింది. భగవంతుని దయవలన అమ్మడు నీకు నచ్చింది. ఇక ఆ మూడుముళ్ళువేసి ఇంటికి తీసుకొచ్చావంటే నీకిష్టం అయిన గుత్తివంకాయకూర,సాంబారు, అరటికాయ బజ్జీలు అన్నీ నేర్పుద్దును''అన్నారు.

తింటున్న లడ్డుండ ముక్క విరిగి క్రింద పడబోయేంతలో గబాలున చేత్తో అందుకుని, ''అందుకనే బామ్మ, కట్నం నేననుకున్నంత కాకపోయినా, చేసుకుంటాను అన్నాను కాశీనాధంగారి అమ్మాయి కామాక్షిని అని అన్నాడు కాని కామేశ్వరావు అసలు కామాక్షిని చేసుకోవడానికి అంగీకరించడానికి కారణం ఆ రోజు ఆఫీసులో జరిగిన సంఘటనే కారణం !

''ఏంవోయ్! కామేశ్వరావు ! ఇంకెప్పుడు పప్పు అన్నం పెడతావ్'' అన్నాడు ఆఫీసులో కామేశ్వరావుతో పనిచేసే గుర్నాధం.

''పాపం గురూ ! ఏం చెబుతాడు... పెళ్ళి చేసుకుంటే బెడదలని మానివేసాడు. సుష్టుగా కడుపునిండా ఆప్యాయంగా పెట్టే బామ్మగారు ఉన్నారు, మాడూ ! చూస్తుండగానే మనోడికి చిరుబొజ్జ వచ్చేసింది'' అన్నాడు రమేష్ నవ్వుతూ.

''ఒక్క చిరుబొజ్జ ఏం కర్మ... తెల్ల వెంట్రుకలుకూడ వచ్చేసాయ్. చూస్తూ... చూస్తూ ఏ ఆడపిల్ల మాత్రం చేసుకుంటుంది పెళ్ళి'' అన్నాడు అందరిని ఎగతాళిగా మాట్లాడే తత్వంగల రామనాథం !

వాళ్ళందరి కామెంటులు వింటుంటే కామేశ్వరావ్‌కి కోపంతో వళ్ళు మండిపోయింది. అంతలోనే వాళ్ళు అలా అన్న మాటలలో నిజం ఎంతవరకు ఉందా అనుకొని తన శరీరం వంక చూసుకున్నాడు.

చిరుబొజ్జ ముచ్చటగా మూడునెల్ల గర్భిణితో ఉన్న స్త్రీకిలా కనిపించడంతో తను.. తను...ఇంతవరకు కట్నం ఎక్కువ కావాలంటూ.. కాలాన్ని అంతా మింగేసి ఇలా తయారు అయ్యాడా అనిపించింది కామేశ్వరావుకి. అంతే కాదు తను.. తక్కువ కట్నాలు ఇచ్చే పెళ్ళికూతుళ్ళను చూడనంటూ బామ్మను ఏడిపించడం గుర్తు వచ్చింది కామేశ్వరావుకి. అంతే! బుద్ధి వచ్చిందిన్నట్లు చెంపలు రెండు గట్టిగా వాయించుకొని అప్పటికప్పుడే ఒక నిర్ణయానికి వచ్చేసాడు. తను అనుకున్న కట్నం రేటు కొంచెం తగ్గించి అయినా సరే వివాహం చేసుకోవడానికి అంగీకరించాలి అనుకున్నాడు.

ఆఫీసులో జరిగిన సంఘటన గుర్తు రావడంతో దడాలున చేతిలో టిఫిన్ ప్లేటు టేబుల్‌మీద పెట్టి, ''బామ్మా ! ఇంకెప్పుడు ఇలాంటి టిఫినులు పెట్టకే తల్లి'' అన్నాడు కోపంగా కామేశ్వరావు.

''ఏమయిందిరా ! లడ్డూలు నెయ్యిపోసి చేసాను. జంతికల్లో వెన్న బాగవేసి కలిపి మరీ చేసాను. కమ్మగా ఉన్నాయి. పిచ్చి సన్నాసి కామేశం తింటాడని ప్రొద్దున్నుంచి నీకోసం కలవరించి చేస్తుంటే వద్దంటావేమిటిరా'' అన్నారు కంగారుగా బామ్మగారు.

''లడ్డూలకేం బ్రహ్మాండంగా ఉన్నాయి ఎటొచ్చి అవి తింటే కొన్నాళ్ళకి షేపులు మారిపోతాయి, నీకు చెప్పినా అర్థం కాదులే అది సరేగాని... ఏమే బామ్మ నిన్న పెళ్ళివారు బాగ ఉన్నవాళ్ళలా ఉన్నారు. యాభైవేలు ఇవ్వగలరంటవా'' అన్నాడు ఆశగా !

బామ్మగారికి మనమడి ఆశ చూస్తుంటే వళ్ళు మండిపోయింది.

''నోరు మూసుకోరా సన్నాసి, ఎవరైన వింటే నవ్విపోతారు వాళ్ళకి మరో ముగ్గురు అమ్మాయిలు ఉన్నారు. వాళ్ళకి నీలాంటి చచ్చుదద్దమ్మలను వెతికి కట్టబెట్టవద్దూ ? అయ్యో రామా ! ఆడపిల్లల బ్రతుకులు ఎంత అధ్వానం అయిపోయింది. అయినా ఇటోఅడుగు అటోఅడుగు వేస్తున్నావు ఏమిటిరా కామేశం. ముప్పయి, నలభైవేలయిన సరిపెట్టుకుంటాను అన్నావు ఇంతకి కాశీనాధంగారి అమ్మాయి కామాక్షిని చేసుకుంటావా లేదా చెప్పు'' అన్నారు కోపంగా బామ్మగారు.

ఒక్కనిముషం తటపటాయించి...''అలాగే కానివ్వవే బామ్మ'' అని కామేశ్వరావు అంటుండగానే...''మీరు, మీ మనుమడు వప్పుకున్నా...ఆ అమ్మాయి పెళ్ళికొడుకుని చేసుకోను వద్దు పొమ్మని తెగేసి చెప్పిందమ్మా'' అని శాస్త్రులుగారు ప్రవేశించారు.

శాస్త్రులుగారి మాటలకి నిశ్చేష్టులయ్యారు బామ్మగారు, కామేశ్వరావు.

''ఏమిటండి శాస్త్రులుగారు మీరు చెప్పేది? నా మనుమడు ఆ పిల్లకు నచ్చలేదా? ఏం పోయేకాలం? కాలువంకరా? కన్నువంకరా? అంతా వాళ్ళ తాత పోలికలతో పుట్టాడు. నిండుగా ... బొద్దుగా...జామపండులా నిగనిగలాడుతున్న నా మనుమడిని అక్కరలేదు పొమ్మందా? ఎంత బరితెగించింది. అసలు నాకు ఆ పిల్లమొహం నచ్చనేలేదు. ఏదో పేస్తంట. వాడికి నచ్చిందట. నేనా కాపురం చేసేది ఆ పిల్లతో? వాడిష్టం అని సరిపెట్టుకున్నాను. నేమాస్తాగా నా మనుమడిలాంటి వాడు ఆ పిల్లకు ఎలా వస్తాడో? ఎలాంటి చచ్చుదద్దమ్మ వస్తాడో'' ఆవేశంతో ఊగిపోయారు బామ్మగారు.

''శాస్త్రులుగారు నేను నచ్చకపోవడానికి కారణం చెప్పండాండి'' అన్నాడు కామేశ్వరావు- ఆ అమ్మాయికి తను నచ్చకపోవడానికి కారణం తెల్సుకోవాలని.

''ఏం చెప్పను బాబు, నీ ఫేస్, పర్సనాలిటీ పరవాలేదట. కాని ఎటొచ్చి అదిగో ఆ నుదుటిమీద ఉంగరాలు తిరిగిన జుత్తులో తెల్ల వెంట్రుకలు...ఇదిగో ఈ బొజ్జ...ఆ అమ్మాయికి నచ్చలేదట. మిడుమిక్కిలి ఏమన్నాది అనుకున్నావ్? ఈ రెండింటిని బట్టి చూస్తే ఆ అబ్బాయి చిన్నవాడేంకాదు...ముదురు బెండకాయలా ఉన్నాడు...ఆ ముసలివాడితో నా పెళ్ళా అందట...వాళ్ల అమ్మ, నాన్నలతో'' అన్నారు శాస్త్రులుగారు.

శాస్త్రులుగారి మాటలకు కామేశ్వరావు మతిపోయింది. బామ్మగారు కోపంతో వళ్ళు ఊగిపోతుంటే పిచ్చిదానిలా కేకలు వేయడం మొదలు పెట్టారు.


మొదట నవలనే ఎవరో విమర్శించారని
ఇలా ఆత్మహత్యకు పాల్పడుతారటే?
వెంటనే నాలుగైదు నవల్లు రాయాలిగాని!

# బామ్మగారు-మనవడు

"దీని జిమ్మ పడిపోను. దీని కళ్ళు కాలిపోను. నా మనుమడి బొజ్జ మీద దిష్టి పెట్టిందా? మగాడికి బొజ్జ ఆడదానికి జుత్తు లేకపోతే అందమేమిటి? ఇక తెల్ల వెంట్రుకలు అంటారా? అడ్డమైన కల్తీ నూనెలు రాస్తే ఉయ్యాలలో పసి బిడ్డలకు కూడా తెల్లబడిపోతున్నాయ్?

నా మనుమడు ముదిరిపోయిన బెండకాయా? ఏవయ్యా! శాస్త్రుల్లూ గుడ్లు తెల్లబెట్టి ఆ పిల్ల వాగిన వాగుడు వినివచ్చి ఇక్కడ చెబుతావా? నా మాటగా చెప్పు ఆ బరి తెగించిన పిల్లకు. నిండా ఇరవై ఏళ్ళు నిండలేదు అని అదీగాక ఆ బామ్మగారు చూస్తుందట, ఈ జన్మలో నా మనుమడులాంటివాడు వస్తే గుండు గీయించు కుంటుందట అని నా మాటగా చెప్పు, అని ఆవేశంతో వళ్ళు, నోరు మరచిపోయి తిట్ట సాగారు బామ్మగారు.

బామ్మగారి ఆవేశం చూసి ఒకింత ఆశ్చర్య పోయి "శాంతించండి అమ్మా...పూర్వం రోజులు అనుకున్నారా? ఈ కాలం పిల్లలుకదూ? వాళ్ళ అభిప్రాయాలు వాళ్ళకి ఉంటాయి. అంతదాక ఎందుకు ఈ సంబంధం ఇలా చెడిందనీ అవధాన్లు గారి అమ్మాయి అనంతలక్ష్మిని, పెదబొట్ల భోగేశ్వరరావుగారి అమ్మాయి భువనేశ్వరిని మన అబ్బాయ్ కామేశ్వరావు గురించి మాట్లాడితే వాళ్ళు ఏమన్నారు అనుకున్నారు? "ఏవయ్యా శాస్త్రులు! నీకు మతిగాని పోయిందా? ముక్కు పచ్చలారని పసిపిల్లలు వీళ్ళు. ఆ బామ్మగారి మనుమడికి అడగడానికి మన సెలా ఒప్పిందయ్యా... గున్నఏనుగులా ఉండి... వెంట్రుకలుకూడ తెల్ల బడ్డాయి. ఎంత లేదన్నా.."

ఇంకా శాస్త్రులుగారి మాట పూర్తికానే లేదు కామేశ్వరావు పిచ్చిపట్టినవాడిలా గట్టిగా అరిచాడు.

"స్టాప్! ఇక చెప్పకండి" అన్నాడు కోపంగా.

"వీళ్ళ నోళ్ళు పడిపోను, వీళ్ళు నాశనం కాను" అని తెగ తిట్టసాగారు బామ్మగారు.

కాలచక్రం గిర్రున తిరగడమే తన పని అన్నట్టు గిర్రున రెండేళ్ళు తిరగేసింది.

చుట్టుపక్కల తెలిసినవాళ్ళకి ఇంచుమించు పొరుగు ఊరువాళ్ళకికూడ బామ్మగారు, మనుమడు అంటే ఈజీగా తెలిసిపోయేది.

ఆ తెల్లవెంట్రుకల అబ్బాయేనా అని ఒకరు, లావుగా బొద్దుగా, లడ్డులా ఉంటాడు అని కొందరు మొత్తంమీద కామేశ్వరావు వయసుకి అదనంగా మరో, ఐదారు ఏళ్ళు కలిపేసి అబ్బే మా అమ్మాయిది చిన్న వయసు, అతను ముదరు వాడు అనేడం మొదలుపెట్టారు.

చూస్తుండగానే కామేశ్వరావు పెళ్ళి పెద్ద సమస్య అయిపోయింది.

బామ్మగారి సంగతి వేరే చెప్పక్కరలేదు! "నా బంగారు తండ్రి!... నా మనుమడి పెళ్ళి ఇంత పెద్ద సమస్య! అమ్మో! ఆడపిల్లలు మీ గురించి ఏదో అనుకొని జారిపడ్డాను. ఎంతకి బరితెగించారు" అని ఒకటే నిందించసాగారు.

* * *

కామేశ్వరావు తనకి వచ్చిన పెళ్ళి సంబంధం వాళ్ళు తనని వద్దు ముదరువాడు అనడానికి కారణాలు రెండే రెండు అనుకొన్నాడు.

ఒకటి తెల్లవెంట్రుకలు, రెండు బొజ్జ! ఈ రెండింటివలన హీరోలా కనబడవలసినవాడు హీరో ఫాదర్‌లా కనభడుతున్నాడు. అంతే! అప్పటికప్పుడే ఆ రెండు కారణాలకి నివారణోపాయం ఆలోచించాడు. మొదటిదానికి తెల్ల వెంట్రుకలు నల్లబడడానికి వాడే హెయిర్ డై వేసుకోవడం, రెండోది బొజ్జ తగ్గిపోవడానికి డైట్ కంట్రోలు (మితభోజనం) చేయడం.

ఈ రెండు పద్ధతులు అవలంభించినాక మన తెలుగు హీరోలా అయిపోయాడు కామేశ్వరావు.

కామేశ్వరావు హీరోలా అయిపోయినా దగ్గరలోనున్న పెళ్ళి సంబంధాలు చూడడానికి వెళ్ళకూడదనుకున్నాడు. ఎందుకంటే ఇంచుమించు అందరికి తెలుసు తను ఎలా ఉంటాడో! అందుకే దూరంగా ఉన్న ఊర్లో ఒక సంబంధం ఉందని తెలిసి బామ్మగారితోసహా పెళ్ళిచూపులకు బయలుదేరాడు.

బామ్మగారికి మాత్రం ఆ అమ్మాయి అసలు నచ్చలేదు. కారణం బొద్దుగా నిండుగా కుందనపు బొమ్మలా ఉండకుండా సన్నగా రివటలా... గాలికి ఊగి పడిపోయేట్లు ఉండడమే కాకుండ చందమామలా పరువం పొంగుతో నిగనిగలాడవలసిన మొఖం ఎండిపోయి వడలిపోయిన తోటకూరకాడలా ఉన్న పెళ్ళికూతురు మొఖం చూస్తుంటే చిరాకేసి —

"అమ్మాయి బొత్తిగా అలా ఎండు తడికలా ఉందేమిటండి" అని డైరక్టుగా పెళ్ళికూతురు తండ్రిని అడిగేసారు.

సమాధానం ఠక్‌మని చెప్పలేక తెల్లమొఖం వేసాడు పెళ్ళికూతురు తండ్రి.

పెళ్ళికూతురు తల్లి మాత్రం బామ్మగారు కూతురు వయసు ఎక్కడ కనిపెట్టేస్తుందో ఏమో అని కంగారుగా "బామ్మగారు మీరిలా వస్తారా" అని లోపలి గదిలోకి దారితీసింది.

బామ్మగారు లోపలికి దారితీసారు.

"ఏం చెప్పమంటారు ఇటు చూడండి ఈ ఫోటో!" అని నిండుగా అందంగా మెరిసేకళ్ళతో పదహారోఏట కూతురికి తీయించిన ఫోటో చూపెట్టి "మొన్నమొన్ననే తీయించుకుంది. దిక్కుమాలిన స్నేహితులు లావుగా మోటుగా ఉన్నావని అన్నారట. అంతే డైట్ కంట్రోలు అంటే తిండి తినడం మానేసింది. బొత్తిగా పిడికెడు అన్నం తింటుంది. ఎంత చెప్పినా వినదు. రేపొద్దున్న పెళ్ళి అయినాక అబ్బాయి, మీరు మందలిస్తే అదే లావు అవుతుంది. వళ్ళు రావడం ఎంతసేపు, మొన్నటి వరకు నిగ నిగలాడుతూ ఉండేది" అని ఉన్నవి లేనివి నాలుగు చేర్చి అబద్దం మీద అబద్దం ఆడేసి హమ్మయ్య ముసలిముండ నమ్మిందో లేదో అనుకొంది.

పెళ్ళికూతురు తల్లి అనుకున్నట్లు బామ్మగారు ఆ మాటలు నమ్మలేదు కాని కామేశ్వరావు మాత్రం బామ్మగారు చెప్పింది విని నమ్మేసాడు. అంతే కాదు... తను నోరు విప్పి కట్నం అడగకుండానే యాభైవేలు ఇస్తాం అని పెళ్ళికూతురు తండ్రి అనడం చూసి ఎగిరి గంతు వేసాడు.

బామ్మగారు పెద్దగా ఇష్టపడకపోవడం చూసి "ఎందుకే, బామ్మా అలా ఇదైపోతావు... విఘ్నేశ్వరుడి పెళ్ళికి అన్నీ విఘ్నాలే అన్నట్లుంది. నువ్వేం బాధపడకు. నువ్వు నెయ్యితో చేసే మినపసున్నుండలు, లడ్డూలు ... మినపరొట్టెలు తింటే నాలుగు రోజుల్లో దిబ్బరొట్టిలా అయిపోతుంది" అని బామ్మగారికి నచ్చచెప్పాడు కామేశ్వరావు.

కామేశ్వరావుకి పెళ్ళయి కావేరి కాపురానికి వచ్చింది.

"నీ పెళ్ళి కళ్ళారా చూసానురా కామేశం! ఇక చచ్చేముందు పుణ్యతీర్థాలు చూసి వస్తామురా!" అని బయలుదేరారు బామ్మగారు.

బామ్మని ఎంతైనా అభినందించాలి అనుకున్నాడు కామేశ్వరావు, పెళ్ళయిన తామిద్దరిని ఏకాంతంగా వదిలి వెళ్ళిపోయినందుకు.

కాని కామేశ్వరావుకి ఒక సమస్య తయారయింది. తలకి రంగు వేసుకునేటప్పుడు కావేరి చూస్తుందేమో అని గాభరాపడ్డాడు. చివరికి ఎలాగైతేనేం దానికో ఉపాయం ఆలోచించాడు.

కావేరి మొద్దునిద్రపోతుంది. తెల్లారిగట్ల పాలవాడు వస్తే లేపినా గంటకు గాని లేవదు కాబట్టి తెల్లారి నాలుగు గంటలకే లేచి, రంగు గబగబా వేసుకొని, ఆ సీసాని తీసుకు వెళ్ళి స్టోర్రూమ్‌లో చెత్త సామానులు మధ్యన దాచేసేవాడు.

కామేశ్వరావు ఆఫీసుకితయారు అయ్యాడు.

"సాయంకాలం ఆఫీసునుండి పెందలాడే వచ్చేస్తాను. సినిమాకి వెళదాం రెడీగా ఉండు" అని చెప్పి మరీ బయలుదేరాడు.

కామేశ్వరావు ఇలా అడుగు బయటపెట్టగానే తలుపు గొళ్ళెంవేసి కూనిరాగం తీస్తూ లోపలికి వెళ్ళింది.

కావేరికి చెప్పలేని ఆనందంగా ఉంది. తనెంత అదృష్టవంతురాలు ... తన భర్త తనంటే పడి చస్తాడు. అంతేకాదు ... తన కోసం ఏం చేయమన్నా నిముషాలలో చేస్తాడు. అసలు కామేశ్వరావు తన భర్త అయ్యే అదృష్టం వుండి ఏమో నాన్న అంత మొండి పట్టు పట్టాడు డాక్టరుగాని, ఇంజనీరుగాని కాకపోతే వేరే సంబంధం చేయనని. ఎన్ని సంబంధాలు రాలేదు. వాళ్ళకు తను నచ్చితే వాళ్ళు కోరిన కట్నం నాన్న ఇచ్చుకోలేక, నాన్నవాళ్ళు కోరిన కట్నం ఇచ్చుకోగలిగితే, ఆ సంబంధం నాన్నకు నచ్చక ఎన్ని సంబంధాలు తప్పిపోలేదు. తీరా నాన్న తన పెళ్ళికోసం బెంగతో మంచంపట్టి వాళ్ళు కోరిన కట్నం ఇవ్వడానికి సిద్ధపడితే తను ముదిరిపోయిందట. వాళ్ళకు కావలసింది ఇరవై ఏళ్ళ పడుచుపిల్లట. వాళ్ళమాటలు విని నాన్న, అమ్మ ఎంత ఆవేదనకు గురి అయ్యారు. తన వాళ్ళకొక పెద్ద సమస్య అయింది. తనకు ఎందుకో మగజాతిమీద తీరని కక్ష, కోపం బయలుదేరాయి. అసలు మగజాతి మొఖమే చూడకూడదనుకొంది. కాని తన కన్నతల్లి

తండ్రుల కోసం పెళ్ళిచేసుకోక తప్పలేదు అంతేకాదు మోసంతో పెళ్ళిచేసుకోక తప్పలేదు మగజాతినే అసహ్యించుకున్న తను కామేశ్వరరావు మంచితనం చూస్తుంటే ఇంతమంచి వాడినా తను మోసం చేసింది అని తను ఎంతో బాధ పడుతుంది ఆ ఆలోచనలతోనే కావేరిస్టోర్‌రూమ్ తలుపు తెరిచింది.

స్టోర్‌రూమ్ చెత్త సామానులతో గలీజుగా ఎలాపడితే అలా ఉంది. ఎప్పటినుంచో సర్దాలి అనుకుంటుంది. ఈ రోజుకి వీలుపడింది అనుకుంటూ పనికిరాని సామానులన్నీ తీసి బయట పారేయవచ్చునని డబ్బాలు చిల్లులపడి తుప్పు పట్టిన డబ్బాలు తీస్తున్న కావేరి డబ్బాలు ప్రక్కగా ఒక సీసా, బ్రెష్ గిన్నె చూసి విస్తుపోయింది. సీసా తీసి దానిమీద పేరు చదివింది తెల్లవెంట్రుకలు నల్లబడడానికి వాడే రంగు బ్రష్ గిన్నె తడిగా ఉన్నాయి తెల్లారిగట్ల తన భర్త లేచి తలారస్నానం ఎందుకు చేసాడో అప్పుడు అర్థం అయింది కావేరికి

''ఏమండీ! ఏమిటిది? నేను మంచి నిద్రలో ఉండగానే, కనీసం లేపనయినా లేపకుండా తలకి స్నానం చేసారు? అయినా అంత తెల్లారుజామున ఎందుకండీ? ఈసారిమీకు నేను తలంటుతానండి మీ అందమైన వుంగరాలు జుత్తు అంటె నాకెంతో ఇష్టం ఈసారి నా చేతులతో మీ తలస్నానం చేయిస్తాను'' అని గోముగా, ప్రేమగా పెళ్ళయిన క్రొత్తలో భర్త నడిగినప్పుడు కంగారు పడిపోయి 'కావేరీ! ప్లీజ్! నీవి అసలే సున్నితమైన లేత తమలపాకులు లాంటి చేతులు నువ్వు ఈ వెధవ తల అంటడంకోసం కష్ట పడుతుంటే నేను చూడగలనా? ప్లీజ్! ఏ కోరికైనా కోరుగాని ఈపని మాత్రం చేయకు పండగపూట కూడ నలుగుపెట్టుకొని నేనే నీళ్ళు పోసుకోవడం అలవాటు బామ్మ ఎన్నిసార్లు పోట్లాడిందో, ''కామేశం!నేను తలంటుతానురా'' అని, అన్న భర్త మాటలు గుర్తు వచ్చాయి కావేరికి

ఇన్నాళ్ళు తనే భర్తను మోసం చేసింది అనుకొంది కాని తన భర్త తక్కువవాడు ఏం కాదు నిజం చెప్పాలంటే తన భర్తను మోసం చేసింది అని ఇన్నాళ్ళు బాధ పడింది కాని ఈ రోజు ఆ బాధ కాస్త పోయింది.

కావేరి మనసు తేలికపడింది

స్టోర్‌రూమ్ సర్దడం పూర్తిచేసి, స్నానం చేయడానికి బాత్‌రూమ్‌లోకి వెళ్ళబోయేంతలో వీధిలో తలుపు ఏకధాటిగా కొడుతుండటం విని ఈ వేళప్పుడు ఎవరొచ్చారు అనుకొని తలుపు తెరిచింది

ఎదురుగా కామేశ్వరరావు

కామేశ్వరరావుని చూసి భయంతో శరీరం

# బామ్మగారు-మనవడు

ముచ్చెమటలు పోస్తుంటే ''మీరా'' అంది కంగారుగా.

కావేరిని చూసి కామేశ్వరరావు ఒక్క క్షణం కొయ్యబారిపోయాడు

అందంగా మనోహరంగా నవ్వినప్పుడు కనబడే ముందు వరుసలో మూడు పళ్ళు ఖాళీగా బోసిగా ఇంచుమించు బామ్మ బోసి నోరులా కనబడుతున్న కావేరిని చూసి రెండు చేతులతో చెవులు గట్టిగ మూసుకొని కెవ్వున కేకవేసి ''అన్యాయం, అన్యాయం మోసం'' అని అరిచాడు కామేశ్వరరావు

అప్పటికే చేతిలోనున్న కట్టుడు పళ్ళు మూడు వెనక్కి తిరిగి టక్కున పెట్టేసుకుంది

''కావేరీ! నీకు నాకు సరి నన్ను నన్ను ఇంత మోసం చేస్తావా'' కోపంగా అన్నాడు కామేశ్వరరావు

అప్పటికే కావేరి కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి

''ఏమండీ! క్షమించండి నేను నేను చేయాలని మోసం చేయలేదండీ మీ మగవాళ్ళ అహంకి కట్నాల దురాశకి బలి అయి పోయాను'' అంది ఏడుస్తూ.

కామేశ్వరరావుకి కావేరి ఏడుస్తున్నకొలది కోపం తారస్థాయి నందుకుంది.

''మోసం మోసం. ఎంత అన్యాయం చేశావ్? అసలు నీ వయసెంత? పళ్ళు కట్టుడు పళ్లా మైగాడ్'' అని అరిచాడు కామేశ్వరరావు

కామేశ్వరరావు అలా అరుస్తుంటే కావేరికి ఎక్కడలేని ఆవేశం ముంచుకొచ్చింది

''మీకిష్టం లేకపోతే నేను ఇక్కడ ఉండను చెప్పండి వెళ్ళిపోతాను .అంతేకాని నన్ను అవమాన పరచకండి మీరు అనుకున్నట్లు నేనే ముసలి దానను కాను '' అంది

''అసలు నీ వయసెంత .మీ అమ్మనిండా 21 ఏళ్లు నిండలేదు అని ఎంత పెద్ద అబద్ధం ఆడింది. నువ్వు ఆవిడ కూతురువి కదూ? నువ్వు మాత్రం నిజం చెబుతావు ఏమిటిలే'' అన్నాడు

''ఉహు మీరు . మీరు ఏం చెప్పినా నమ్మేస్థితిలో లేరు కావాలంటే మీ మీద ఒట్టు వేసి చెబుతాను'' అని కామేశ్వరరావు తలమీద ఒట్టువేయడానికి అన్నట్లు మూడు అడుగులు ముందుకి వేయబోయేంతలో

చప్పున కామేశ్వరరావు వెనక్కి నడచి ''మధ్యన నామీద ఒట్టు వేస్తావా? ఆడాళ్లకి కట్టుకున్న మొగుడు-న్నా తల్లిదండ్రులు-టే ప్రేమ కదూ? వాళ్ళమీద ఒట్టు వేయ్! అసలు ఏ ఒట్టువేసినా నేను నమ్మను'' అని పిచ్చివానిలా అరవడం మొదలుపెట్టాడు.

''మా అమ్మ, నాన్నమీద ఒట్టువేసి చెబుతున్నాను కావాలంటే నా డేట్ ఆఫ్ బర్త్ చూడండి ఇదంతా నా దురదృష్టం నా వయసు ముప్ఫయి ఏళ్ళు నిండాయి మా అమ్మ చెప్పినది అబద్ధం'' అంది

''ముప్ఫయి ఏళ్ళా? అమ్మో! మీ అమ్మ ఎంత తెలివైన మనిషి ఇంకా ఇరవై ఒకటి నిండలేదని ఏకంగా పదేళ్ళు అబద్ధం ఆడేసిందా? అయినా ముప్ఫయి ఏళ్ళకి ఎక్కడైనా పళ్ళు ఊడిపోతాయా? అంతా అబద్ధం'' అని ఆవేశంతో ఊగిపోసాగాడు

కావేరికి కామేశ్వరరావు అలా పిచ్చిపట్టినట్లు అరుస్తుంటే వళ్ళు మండిపోయింది

''మీ ఇష్టం నమ్మితే నమ్మండి లేకపోతే మానేయండి. మా అమ్మమ్మకు ముప్ఫయి ఏళ్ళకు పళ్ళన్నీ పుచ్చిపోయి ఊడడం మొదలు పెట్టాయట. మా అమ్మకు అలానే ఊడిపోవడం మొదలు పెట్టాయి

నా దురదృష్టం! పాతికేళ్ళు వచ్చేటప్పటికి పళ్ళు పుచ్చిపోయి ఊడడం మొదలు పెట్టాయి పారిన్‌నుంచి డాక్టరుగారు వస్తే నాన్నగారు చూపెట్టారు. డాక్టరుగారు చాల రకాల మందులు వ్రాసారు వారసత్వం అని చెప్పారు మీరు మీరు నా గురించి ఇంత చిన్న విషయానికి అంత ఆలోచిస్తున్నారు మీరు మాత్రం నన్ను మోసంచేసి చేసుకోలేదా? మీరలా ఆఫీసుకి వెళ్ళగానే నేను స్టోర్‌రూమ్ సర్దుదామని వెళ్ళాను. మీరు తెల్లవెంట్రుకలు నల్లబడడానికి వేసుకునే సీసా కనబడింది. ఛ్ఛ! ఎందుకులెండి. ఎన్ని చేసినా మీకు. మీ మగవాళ్ళకి చెల్లింది మీరు ఒక విధంగా నన్ను మోసంచేస్తే నేను మరో విధంగా మోసం చేసాను అయినా మీ మనసు నొప్పించాను - వెళ్ళిపోతానులెండి'' అంది ఏడుస్తూ కావేరి

తను . తను మోసంచేసి కావేరిని చేసుకున్నాడు అనుకున్నాడు కాని తనని రెట్టింపు మోసంచేసి కావేరి తనని చేసుకుంది దొందుకు దొందే! ఏది ఏమైన ఈ విషయంలో బయట పడడం సిగ్గుచేటు. నలుగురికి తెలిస్తే నాలుగు రకాలుగా చెప్పుకుంటే తను రేపటినుండి వీది మొఖం చూపగలడా? ఆలోచన రావడమే తడవుగా వెళ్ళబోతున్న కావేరిని వారిస్తూ దగ్గరకు తీసుకున్నాడు కామేశ్వరరావు ★

మంధా వెంకట రమణారావు సీరియల్

# ఉదయసంధ్య

## 14

(గత సంచిక తరువాయి)

మంగళ వాద్యాలు మ్రోగేయి అక్షింతలు జల్లేరు. పెళ్లికొడుకు పెళ్లికూతురి మెడలో పుస్తె కట్టేడు శారద కామయ్య భార్య అయిపోయింది ఆ క్షణాన

పెళ్లికి బంధుమిత్రులొచ్చేరు ఎక్కడెక్కడి వారూ బీరకాయ పీచులాటి బంధుత్వాలు చాలామందెవరో రామానికి తెలీదు పట్నంనించి ఆదినారాయణ, వెంకటేశ్వరులు, సుబ్బారావు, విశాల వచ్చేరు ఒకరోజుండి పెళ్లి అవగానే వెళ్లిపోయేరు ఉన్న ఒక్కరోజూ చాలా ఆనందంగా గడిపేరు

కాళిదాసు అందరినీ ఉచిత రీతిగా మర్యాదలు చేసేడు కొండయ్య ఏమీ పేచీలు పెట్టలేదు పెళ్లి మాత్రం అన్ని తంతులతోనూ మూడు రోజులు జరిగింది పల్లకీ, దాని బోయిలూ, టకోరామేళం, పల్లకిలో ఊరేగింపూ, తోటలో దిగడాలూ అన్నీ అయ్యేయి బంతి ఆటలు, ఇత్యాది వేడుకలన్నీ జరిగేయి ప్రతిఒక్కరూ, ప్రతిఒక్కరితోనూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడేరు అత్తరు, ఊదొత్తులూ, కర్పూరపు పేరుల వాసనలు గుబాళించేయి బరంపురం పట్టుచీరలు కావిడి పెట్టెలలోంచి బయటపడి మానవ శరీరాలని అధిష్ఠించేయి సూర్యరస్మిని చూసేయి కొంతమంది వడ్డాణాలూ, నాగరాలూ పెట్టుకున్నారు అగ్రహారంలోని పండితులంతా పెళ్లికి హాజరయ్యేరు మంత్రాలు కలిసి పఠించేరు అందరికీ సంభావనలు దొరికేయి

పెళ్లికూతురు అత్తవారింటికి వెళ్లిపోయింది మూడు నిద్రలు అక్కడ జరిగేయి

వంటాలూ, భోజనాలూ, విందులూ, పిండివంటలూ, ఈ సంబరం నడిచింది ఏడు రోజులు

తరువాత ఎవరి మానాన వాళ్లు వెళ్లిపోయేరు పెళ్లి పందిరి చిన్నబోయింది

రామం ఒక్కడూ మిగిలేడు ఒక్కొక్కరి భావీ నిర్ణయం అయిపోతున్నాది తన భావి ఏమౌతుంది ఈ పల్లెటూరిలో ఉండి వ్యవసాయం చూసుకుంటే బాగుంటుంది కాని ఆ మిగిలిన భూమిమీద వచ్చే ఫలసాయం ఎవరికీ చాలదు చదవడమూ ఇంకా? ఎలా చదవడం? చదవకపోతే 'ఏం చెయ్యడం? అన్నీ సమస్యలే సుగుణ తెలివైన పిల్ల తన సమస్యలని ప్రస్తుతానికి పరిష్కారం చేసుకుంది

ఇంట్లో తింటూ, ఊళ్లో తిరుగుతూ ఒక నెల గడిపేడు రామం రోజూ పేపరు కోసం ఎదురుచూసేవాడు రిజల్ట్సు పడతాయని ఆ రిజల్ట్సు ఇప్పటికీ అప్పటికీ వచ్చేలాలేవు

* * *

బంతిమీద కాలు పెట్టి నిల్చున్నాడు ఆదినారాయణ రిఫరీ విషిల్ ఇచ్చేడు ఆట ఆరంభం అయింది పాస్ ఇవ్వడంతో ఎడమ వేపు ఫార్వర్డ్‌గా ఉన్నాడు ఆది బంతి వస్తే ఎదుటివాళ్లని తప్పించుక డ్రిబ్లింగ్ చేస్తూ ముందుకు దూసుకపోతున్నాడు ఎదుటివాడిని తప్పించుకోలేనపుడు పాస్ ఇస్తున్నాడు బంతికి ఆది అంటే ఆకర్షణలా ఉంది ఏదో విధంగా అది అతడి దగ్గరికి వస్తూనే ఉంది. ఏదో నిముషంలో ఎదుటి ఫుల్ బేక్, వాళ్ల కుడి ఫార్వర్డ్‌కి ఇచ్చిన పాస్‌ని మధ్యలో అడ్డి గోల్ కీపర్‌ని గురిపెట్టుకొని కిక్ కొట్టేడు అడ్డడమూ, కిక్ కొట్టడమూ ఒకే ఏక్షన్‌లో జరిగేయి. బంతి గోల్ కీపర్‌కి తగలలేదు గోల్‌లో వెళ్లి పడింది ప్రేక్షకులంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు టీమ్‌మేట్స్ వచ్చి ఆదినారాయణని భుజాలమీద మోసేరు బ్లూస్టార్ క్లబ్బు మొదటి గోల్ అది మరో పది నిముషాల తరవాత రెండో గోలు. ఇది కార్నర్ కిక్కువల్ల సాధించినది అది కొట్టినదీ ఆదినారాయణే పోర్ట్ టీమ్‌కీ, బ్లూస్టార్ క్లబ్‌కీ ఫైనల్సు అవి ఫుట్‌బాల్‌లో ఇంటరెస్టున్న కుర్రాళ్లనందరినీ చేరదీసి ఆదినారాయణ తయారుచేసిన టీమ్ అది. అయితే అందరూ మంచి ఆటగాళ్లే ఒకడు జట్కాతోలే వెంకటస్వామి మరొకడు కిళ్లీకొట్టు పెట్టుకున్న అప్పారావు. వీళ్లందరినీ కూడకట్టి ఒక జట్టుగా తయారు చెయ్యడం ఆదినారాయణ పనయింది మూడేళ్లబట్టి ఇదే టీము ఎన్నో టూర్నమెంటులలో పాల్గొంటూ వచ్చింది క్వార్టర్ ఫైనల్సు, సెమి ఫైనల్సు వరకూ వచ్చి ఆగిపోయేది విజయం ఈ సంవత్సరం ఈ పోటీలో ఫైనల్‌కి వచ్చేరు ఖర్గపూర్ నించి రావల్సిన టీమొకటి రాలేను అది చాలా మంచి టీము ఆ అడ్డు తొలగగానే ఫైనల్సులో ఒచ్చిపడ్డారు వీళ్లు. కప్పు ఎలాగన్నా కొట్టెయ్యాలి వెయ్యి రూపాయలు నగదుంది ప్రతి ఆటగాడికీ వివిధ కంపెనీలిచ్చే చిల్లర ప్రయిజులున్నాయి పోర్ట్ టీమ్ గట్టిది ఆటగాళ్లు ముదిరిన వయస్సున్నవాళ్లు మంచి శరీర దారుఢ్యం కలవారు అందులో ఒక ఫార్వర్డ్ చాలా మంచి ఆటగాడు ఆ ఆటగాడి చుట్టూ కాపలా పెట్టేడు నలుగురు ఆటగాళ్లని బంతి అతడికి వెళ్లకూడదు వెళ్లినా ఆ బంతి వాళ్లవాడికి అతడి దగ్గరినించి పాస్ కాకూడదు కొంత అదృష్టం ముఖ్యంగా మొదటి గోలు

హాఫ్ టైమయ్యేక రఫ్ ప్లే ఆరంభించేరు పోర్ట్ టీము ఫౌల్ తరవాత ఫౌల్ చేస్తూ వెళ్లేరు దాంతో ఒక పెనాల్టీ కిక్ దొరికింది ఆ కిక్ గోల్ క్రింద మార్చడానికి ఆదినారాయణకి అట్టేసేపు పట్టలేదు దాంతో పోర్ట్ టీమ్ వాళ్ల ఉత్సాహం పోయింది వాళ్లు ఉత్సాహం పోగానే బ్లూస్టార్ టీమ్‌లోని రెండో ఫార్వర్డ్ కూడా ఒక గోల్ కొట్టేడు

నాలుగూ, సున్నాతో గెలిచేరు బ్లూస్టార్ క్లబ్‌వాళ్లు ఆదినారాయణని భుజాలమీద మోసేరు "బ్లూస్టార్ క్లబ్! హిప్ హిప్ హుర్రే!" గ్రౌండంతా ఒకటే నినాదం కప్పు ఆదినారాయణ భుజంమీద ఆదినారాయణ

**జరిగిన కథ—12 :** రామం వారాలు చేసుకుంటూ చదువుకుంటుంటాడు పూర్ణమ్మ ఇంటిలోని వీధి కొట్టులో రామం నివాసం రామం సెలక్షన్సులో మొదటివాడుగా సెలక్టయ్యాడు రామం తను పుట్టి పెరిగిన అగ్రహారం వెళుతాడు రామం కుటుంబ సభ్యులు రామం రాకతో సంతోషిస్తారు. కామయ్యతో రామం చెల్లెలు శారద వివాహం నిశ్చయమవుతుంది పరీక్షలకు రామం విశాఖపట్నం వస్తాడు లత రామం దగ్గర లెఖ్ఖలు చెప్పించుకొంటుంది సుబ్బారావు లిల్లీతో స్నేహం చేస్తుంటాడు జబ్బుతో ఉన్న మేనత్తను చూసి రమ్మని తండ్రి రాసిన ఉత్తరం చూసుకొని రవణమ్మను చూడను వెళుతాడు రామం. పాల్ సహాయంతో తన తల్లిని హాస్పిటల్లో చేరుస్తుంది సుగుణ సుగుణ తల్లి చనిపోయింది పాల్‌కు సుగుణకు వివాహం జరిగిపోయింది

టీమ్ మేట్స్ భుజాలమీద. ఊరేగింపుగా వెళ్ళేరు, ఆదినారాయణ అన్న తెచ్చిన లారీలలో...

ఈ హడావిడిలో రిజల్స్ వచ్చిన సంగతి మూలపడింది... ఏ రాత్రో ఇంటికి వెళ్ళేసరికి సత్యం చెప్పేడు. ''నువ్వు పాసయినావురా! రామం, యెంకటేశ్వరులూ, ౘతమ్మ కూడా పేసయినారు...'' అన్న వార్త అందించేడు. ఎస్. ఎస్. ఎల్. సి. లో అందరిదీ పాసే... తరగతులు లేవు... కాని రామం రాష్ట్రం మొత్తంమ్మీద మొదటివాడుగా నిలబడ్డ సంగతి పేపరులో వేరేచోట పడడం ఎవరూ చూడలేదు.

ఆదినారాయణ ఆసంగతి వినగానే ఒక్క కేకపెట్టేడు... ''బి. ఎన్. ఆర్. క్లబ్... హిపిప్ హుర్రే...! రేపే కరగ్‌పూర్ ఎళతాను!''

* * *

వెంకటేశ్వరులు పేపర్ పట్టుకొని లత ఇంటికి వెళ్ళేడు. అప్పటికా వార్త వాళ్ళకి పాతదయిపోయింది. కాబట్టి వెంకటేశ్వరులు చెప్పడం వల్ల అతడు కూడా పాసయేడని వాళ్ళకి తెలిసింది. వెంకట్ వెళ్ళేసరికి లత అందరికీ పార్టీ ఇస్తున్నాది. అందరికీ అంటే ఇంట్లో వాళ్ళకి. స్వీట్లూ, హాట్లు చంద్రం తీసుక వచ్చేడు. వెంకట్ రాగానే నిర్మల ఎనౌన్సు



చేసింది. ''తెలుగు మష్టారి అబ్బాయొచ్చేడు!''

''మీదికి రమ్మను!'' అని తాకీదు వెళ్ళింది. వెంకట్ మీదికి వెళ్ళేడు. గదిలో అందరూ ఉన్నారు. లత, సావిత్రి, చంద్రం, సుబ్బారావు, నిర్మల.

''రండి కవిగారూ రండి... జాయిన్ అజ్.. లత పార్టీ ఇస్తోంది!'' అని ఆహ్వానించేడు సుబ్బారావు. వెంకట్ ఇబ్బందిగా గదిలోకి వెళ్ళేడు. ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు. ఒక ప్లేటు ముందుకు వచ్చింది.

''ఇక్కడ ఒక కవి, ఒక చిత్రకారుడు, అన్నయ్యలాటి మేధావి అందరూ ఉన్నారన్న మాట ... అయితే ఒక్కరే లేరు ... ఎవరో చెప్పకోండి ...'' సావిత్రి వెంకటేశ్వరులుని ఆకర్షించడానికి ప్రయత్నిస్తూ అంది.

''నీ గురువుగారు లేడంటావ్... నీ గురువుగారు పేద్ద పేరుప్రఖ్యాతులతో పాసయేరుగా?'' సుబ్బారావన్నాడు.

''ఇవాళ పాసయిన మి అందరికీ గురువు రామమేగా'' అని నిర్మల అంది.

''సరే... అదక్కడికలా ఉంచండి... మీరేం చెయ్యదలచుకున్నారు వెంకటేశ్వరులుగారూ?''

''ఏముందీ ఆర్ట్సులో చేరడమే అనుకుంటాను... సైన్సు నాకు పడదు ...''

''నేనూ అదే చేస్తాను'' లత జవాబిచ్చింది.

''మీరేమన్నా రాసేరా ఈ మధ్యని?'' అడిగింది చిరునవ్వుతో ...

''ఏవో ఊసుపోక రాయడం... నాలుగయిదు గేయాలు పంపేను ...''

''మీరు సినీమాలకి పాటలు రాయడానికి మెడ్రాస్ వెళ్ళిపోకూడదూ?'' చంద్రం చెప్పేడు.

''నాలాటి వాడిని ఎవడడుగుతాడు—దానికి బాగా పలుకుబడి ఉండాలి . ''

''నువ్వూ వెళిపోరా చంద్రం సెట్టింగులు పెయింట్ చెయ్యొచ్చు... నీ కళ బాగా పని కొస్తుంది...'' సుబ్బారావు హాస్యమాడేడు.

''ఒరే నా కళ సినీమాకి కాదురా బాబూ. నేనే చిత్రకారుడ్నయితే నా చిత్రాలు ప్రపంచం అంతటా ప్రదర్శించబడతాయి ...''

ఇంతలో శాంతమ్మ వచ్చింది. సంభాషణ

మారిపోయింది భావిలోంచి భూతకాలంలోకి వెళ్ళిపోయింది తండ్రులూ తాతలూ వాళ్ల ఘనకార్యాలూ వర్ణించిందామె

వెంకటేశ్వరుడికీ వాతావరణం పడలేదు లేచి శెలవు పుచ్చుకొని ఆదినారాయణ ఇంటికి వెళ్లేడు అక్కడ రాజకుమారుడికి దొరికే ఆదరణ దొరికింది వాళ్లకిదే తెలియడం ఆది లేదు ఆటల ఫైనల్సుస్సాయి వెళ్లి పొయేడు అంకమ్మ, రత్నం, వరలక్ష్మి మిఠాయి తెప్పించి తినిపించేరు. వరలక్ష్మి ఆనందానికి పట్టపగ్గాలు లేవు.

* * *

ఆ రోజు పేపరు ఎందువల్లనో రాలేదు అందుకా వార్త ఆ రోజు రామానికి తెలియలేదు మర్నాడు పది గంటలకి హెడ్‌మాష్టరుగారు ఒక ఉత్తరం ఇచ్చి ఎటెండర్ రామ్మూర్తిని పంపేరు . అందులో రాష్ట్రానికి మొదటి వాడిగా రామం పాసయినట్టు, అందుకు తను చాలా గర్వపడుతున్నట్టు, ఉత్తరం అందిన వెంటనే రావల్సిందిగానూ రాసి పంపేరు ఆ ఉత్తరం అందగానే రామం రామ్మూర్తిని కౌగలించుకున్నాడు ఆనందంతో ఇలా జరుగుతుందని ఎప్పుడూ అనుకోలేదు తక్కినవాళ్ల గురించి అడిగేడు రామ్మూర్తి చెప్పలేకపోయేడు పేపరింకా రాలేదు

ఇంట్లో ఈ వార్త తెలియగానే అందరూ చాలా సంతోషించేరు రామ్మూర్తికి భోజనం పెట్టి అయిదు రూపాయలిచ్చేడు కాళిదాసు. రామ్మూర్తి మధ్యాహ్నం బస్సులోనే వెళ్లిపోయేడు

సంతోషం తగ్గింది రాత్రికి. ఏంచేద్దాం అన్న ప్రశ్న పట్టుకుంది పరీక్షలు పాసవగానే తక్కిన ప్రశ్నలు ఎదురవుతాయి హెడ్‌మాస్టారు ఎందుకు రమ్మన్నట్టు ? స్కాలర్‌షిప్ దొరుకుతుంది చదవడానికి చదువుతే ఏంచేద్దామని చదవడం ? చదవకపోతే ఏంచేద్దామని చదువు మానిడం ? ఉత్త స్కూల్ ఫైనల్ పాసయిన

# ఉదయ సంధ్య

వాడికి సరిపోయే ఉద్యోగాలేవీ లేవు టెంపరరీగ ఎక్కడన్నా గుమస్తా ఉద్యోగం దొరకొచ్చు సర్విస్ కమిషనుంది టైపూ, షార్ట్‌హేండన్నా చదివి పాసవాలి, లేదా డిప్లమాకోర్సు అన్నా చదవాలి వెంటనే రామం పని చెయ్యవలసిన అవసరం లేదు చదువుకోవచ్చు తండ్రిని డబ్బు పంపించమని అడగనంతవరకూ తర్జన భర్జనలు జరిగిన మీదట, రామం, రామం తండ్రి కాళిదాసూ మర్నాడు పట్నం వెళ్లి, అందరి సలహాలూ తీసుకొని తరవాత ఏంచేసేదీ ఆలోచిద్దామన్న నిశ్చయానికి వచ్చేరు

మర్నాడు మంచిరోజే తండ్రీ కొడుకులిద్దరూ బయల్దేరేరు విశాఖపట్నం చేరుకున్నాక తిన్నగా శాస్త్రిగారి ఇంటికి వెళ్లేరు

* * *

ఒక్కరోజు ఉండి వెళ్లిపోదామనుకున్న కాళిదాసు మూడురోజులు ఉండిపోవలసి వచ్చింది చిన్ననాటి స్నేహితులెంతమందో ఉన్నారు ఊరినిండా అందరూ సలహాలిచ్చేవారే. మంచి మాటలు చెప్పేవారే ఎవ్వరూ నిజమైన సాయం చెయ్యడానికి మాత్రం ముందుకి రారు అందరూ మంచి పొజిషన్లలో ఉన్నారు ఇళ్ళూ వాకిళ్ళూ కట్టుకున్నారు హాయిగా సంసారాలు సాగిస్తున్నారు. వీళ్ల సంసారాలు ఎప్పుడో ఒకప్పుడు తన తండ్రి వల్లో, తాత వల్లో సహాయం ఏదో విధంగా పొందిన వారే

మాట వరసకి సీతారామయ్య అన్నయ్యా అతనూ కలిసి చదువుకున్నారు. ఇరవై నాలుగు గంటలూ తమ ఇంట్లోనే ఉండేవాడు. అక్కడే తినేవాడు పడుక్కునేవాడు సంసారంలో ఒక మనిషిగా వ్యవహరించేవాడు 'లా' చదివేడు అదృష్టం బాగుండి మంచి సీనియర్ క్రింద పడడం, ఆ సీనియర్ అయిదారేళ్ల తరవాత కన్ను మూయడం జరిగేయి శాంతమ్మని తనకివ్వవలిసింది కానీ సీతారామయ్య కిచ్చి పెళ్లి చేసి అతడిని మద్రాస్ చదువుకి పంపేడాయె తండ్రి. చిన్ననాడు అనుకున్నవి వేరు పెద్ద అయ్యేక జరిగేవి వేరు తన ఇంట్లో ఉంచుకుంటానని వాడంటే ? ఆ మాట అనాడనలేదు తరవాత ఎన్నోసార్లన్నాడు కాని రామానికా ఇంట్లో ఉండడం ఇష్టం లేకపోయింది వాడి మనస్తత్వం తన లాటిది వాడికి స్వేచ్ఛ కావాలి

బులుసు విశ్వనాథ శాస్త్రి, కాళిదాసుని ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించేడు వీధి గదిలో మంచం వేయించి అన్ని సదుపాయాలూ చేయించేడు విశాల అన్ని సదుపాయలూ జరిగేటట్టు స్వయంగా చూసుకుంది

తన ఇంట్లో కాళిదాసు దిగినందుకు సీతారామయ్య చాలా నొచ్చుకున్నాడు రామం అంత బ్రిలియంట్‌గా పాసవడం తనకెంతో గర్వ కారణం అని చెపుతూ రామాన్ని 'లా' చదివించే ఉద్దేశంతో బి ఏ లో చేర్చమనీ, తన ఇంటికి రామం బస మార్పించమనీ, నాలుగేళ్ల తరవాత తన దగ్గర జూనియర్‌గా రామాన్ని ఉంచుకుంటాననీ సీతారామయ్య నొక్కినొక్కి చెప్పేడు శాంతమ్మ అదే మాట చెప్పింది

* * *

"మీరూ రావడం మంచి పని చేసేరు " హనుమంతరావుగారు కళ్లజోడు తుడుచుకుంటూ కాళిదాసుతో అన్నారు రామాన్ని కుర్చీలో కూర్చోమన్నారు అంత గౌరవం ఏ స్టూడెంటుకీ అతనిప్పటికివ్వలేదు.

"మీరు చూపిన ఆదరాభిమానాలే మా వాడికి శ్రీరామరక్షగా నిలిచేయి!" కాళిదాసన్నాడు హెడ్‌మాష్టరి చేతులందుకుంటూ

"నేను పిలిచింది ఎందుకంటే, ఏ సందర్భంలోకూడా మీవాడి చదువు ఆపేకండి మీ వాడికి ఏ చదువు చదువుతే ఆ చదువు అఖరయ్యే వరకూ ఏదో విధమైన ధన సహాయం దొరికేటట్టు చూస్తాను గవర్నమెంట్ స్కాలర్‌షిప్ దొరుకుతుంది అది కాకుండా లోన్ స్కాలర్‌షిప్ దొరికే ఏర్పాటు చేస్తాను ఒకసారి కాలేజీలో చేరి మంచి మార్కులు తెచ్చుకుంటూ ఉంటే స్కాలర్‌షిప్‌కి అడ్డుండదు "

"అదే ఆలోచిస్తున్నాను నాకు ఇబ్బందయినాసరే వీడి భావి బాగుండాలి "

"రామం! నువ్వు మా స్కూలు స్టూడెంటు వయినందుకు ఎంతో గర్వపడుతున్నాను నువ్వు ఏ కాలేజీ, ఏ యూనివర్సిటీలో చదివినా వాటికి పేరు తెస్తావని నాకు నమ్మకం ఉంది. నీకు పై చదువులకి స్కాలర్ షిప్‌కి రికమండ్ చేస్తూ రాస్తాను నీ ఫోటో ఒకటి ఏర్పాటయిందివాళ సాయంత్రం స్కూలు మాష్టర్లతో. నీకు ఫేర్‌వెల్ మేం ఇస్తాం"

రామం కళ్లలో నీరు నిండగా "మీ మేలు



పరిపాలనా భారం ఒక్కరి పైనే ఎన్నడూ ఉండలేదు పూర్వకాలంలో ప్రజాక్షేమం కోరే రాజులు మంత్రులను నియమించి వివిధ శాఖలను వారికి ఒప్పగించి, వారి మూలంగా పనులు సాగించేవారు నేటి ప్రజాస్వామ్యంలో వేర్వేరు మంత్రులు వేర్వేరు శాఖలను నిర్వహిస్తూ ఉండడం మనం చూస్తూ ఉన్నాము

అవసరాన్ని బట్టి మంత్రుల మార్పులూ, శాఖల మార్పులూ జరగడం కూడా సహజమే! ప్రతీ యేడూ ఆయా గ్రహాల అధికారాలు మారుతున్నట్లు మన పంచాంగాలవల్ల తెలుస్తున్నది కాని దేవతల అధికారాలు స్థిరంగా ఉన్నట్లు మన ఇతిహాస పురాణాల వల్ల తెలుస్తుంది



# ధర్మపథం

-బులుసు వేంకటరమణయ్య

## దేవతల అధికారాలు

ఆయుస్సును గురించిన అధికారం బ్రహ్మకే ఉన్నది దాన్ని పొడిగించడం, తగ్గించడం అతని యిష్టానిష్టాల మీదనే ఆధారపడి ఉన్నది అలాగే మనకు ఆరోగ్యమిచ్చే అధికారం సూర్యభగవానుడికే ఉన్నది ''ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అని పెద్దల నానుడి ఐశ్వర్యం శివుడే ప్రసాదించాలి ''ఈశ ఐశ్వర్యే'' అనేదే యీ విషయాన్ని తెలియజేస్తున్నది అట్లే— ''ఇంద్రభోగం'' అని ప్రసిద్ధి సమస్త సౌఖ్యాలు అనుభవింపజేసే అధికారం ఇంద్రునిదే! ప్రతిభావంతుల్లో బృహస్పతిని మించినవాడు లేడు. అతడు గొప్ప నీతివేత్త. అతడు నీతిని బోధిస్తాడు వాక్పుణ్యం వాగ్దేవియైన సరస్వతి వల్ల లభించవలసినదే! ఇవన్నీ పోగా మిగిలినది యశస్సు దాన్నిచ్చే బాధ్యతను భగవానుడు శ్రీహరియే స్వీకరిస్తాడు ఈ విధంగా వీరందరూ ఇయ్యవలసినదని ఆశీర్వదించే శ్లోకం ఒకటి ప్రసిద్ధియై ఉన్నది అది —

''ఆయుష్యం కవలా సనో వితరతా —
దారోగ్య మీశ స్త్విషా
మైశ్వర్యం గిరికన్యకా సహచరః —
సామ్రాజ్య మా ఖండలః,
నీతిం నిర్జరదేశికో నిపుణతాం —
వాక్యేషు వాగ్దేవతా
పుణ్యశ్లోక మనేక మత్ర భగవాన్ —
లక్ష్మీపతిస్తే చిరమ్ ''

పై అభిప్రాయమే యీ శ్లోకంలో చక్కగా వివరించబడినది ★

ఏనాడూ మరచిపోలేను సార్— మీ సలహా ప్రకారం నడుచుకుంటాను'' అంటూ హెడ్మాష్టారి పాదాలకి నమస్కారం చేసేడు

ఇటువంటి స్టూడెంటు దొరకడం నా అదృష్టం, ఈ స్కూలు అదృష్టం కాని ఎంతమంది రామంలాటివాళ్ళున్నారు ఇంత తెలివితేటలుండక్కర్లేదు ఆ అణకువా, పెద్దలంటే గౌరవం ఇప్పుడెందరిలో ఉంది? కాలం మారిపోతోంది రాజకీయాలొచ్చి వాతావరణాన్ని కలుషితం చేస్తున్నాయి హైస్కూళ్ళు కాస్తనయం కాలేజీల పరిస్థితి, యూనివర్సిటీల పరిస్థితి ఎలాగుంది? విద్యారంగం రాజకీయ రంగంగా మారిపోతోంది ఉపాధ్యాయులని వెయ్యడం, ప్రమోట్ చెయ్యడంనించి స్టూడెంట్లకి మార్కులవరకూ, విద్యార్థులని రాజకీయవర్గాలే కాకుండా, టీచర్లు, లెక్చరర్లు స్వప్రయోజనాలకి వాడుకోడంనించి, విద్యాసంస్థల అన్ని శాఖలలోనూ, వర్గాలలోనూ, మనుష్యులలోను క్రమశిక్షణని పోగొట్టి, ఇన్డిసిప్లిన్ ప్రవేశపెట్టేవరకూ, స్వార్థం, ధనకాంక్ష, పదవుల వ్యామోహం, రాజకీయ పార్టీల బలం, పనిచేస్తున్నాయి

రామాన్ని లేవనెత్తి, రెండు చేతులతోనూ ఆలింగనం చేసుకొని ఆశీర్వదించేరు హెడ్మాష్టరుగారు

సాయంత్రం చిన్న అల్పాహారవిందు గ్రూఫ్ ఫోటో అయేయి రామం ఫోటో పేపర్లకి పంపేరు స్కూళ్ల ఇనస్పెక్టరు వచ్చేరు రామాన్ని పొగిడేరు రామానికి ఒక పైలెట్ పెన్ బహుమానంగా ఇచ్చేరు స్కూలు తరపున కాళిదాసు కూడా అక్కడే ఉన్నారు హెడ్ మాష్టారు రామంచేత కాలేజిలో సీటుకోసం దరఖాస్తు పెట్టించి, చేరడానికయ్యే ఖర్చు మొత్తం తను చూసుకుంటానని మాట ఇచ్చేడు ఎ వి ఎన్ కాలేజి ప్రిన్సిపాలు తనని కలిసి రామం గురించి మాట్లాడడం, స్కాలర్ షిప్పూ, తదితర ఏ సహాయాలు కావాలన్నా చేస్తాననడం, హెడ్ మాష్టర్గారు మనసులో ఉంచుకున్నారు

* * *

''ప్రభువుని నమ్ముకుంటే ప్రభువు దారి చూపుతాడు మనిషికి ప్రభువుతో విశ్వాసం ఉండాలి''అని జకరయ్య అన్నాడు, తన ఇంట్లోని డ్రాయింగ్ రూమ్లో కూర్చొని టీ కప్పు కాళిదాసుకి అందిస్తూ

సుగుణ, పాల్, లిల్లీ, వెంకటేశ్వరులు, రామం కూడా అక్కడే కూర్చున్నారు

సుగుణని చూస్తానని తండ్రి అంటే, ఇక్కడికి తీసుకొచ్చేడు రామం, ముందుగా జకరయ్యని, పాల్ని, తరవాత సుగుణనీ అడిగి వాళ్ళు ఇష్టపడ్డమీదటే కాళిదాసు రాగానే, పాల్, సుగుణ, హిందూ పద్ధతిని పాదాలకి మొక్కారు కాళిదాసు ఆశీర్వదించేడు సుగుణ మెడలో మంగళసూత్రాలు ఉండడం గమనించేడు కాళిదాసు రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి జరిగింది తరవాత తనతో తెచ్చుకున్న వెంకటేశ్వరుడి పఠం ముందు నిల్చొని పాల్ చేత పుస్తె కట్టించుకుంది సుగుణ అందుకెవ్వరూ అభ్యంతరం చెప్పలేదు

జకరయ్య చెప్పినదానికి ఔననికాని, కాదని కాని అనలేదు కాళిదాసు

''ఎక్కడో ఒకచోట, నువ్వు కులాసాగా ఉన్నావు. అదే కావాలి'' అన్నాడు కాళిదాసు రామం చదువు గురించి వచ్చింది చర్చ చదవడం అవసరం అని అందరూ అన్నారు

''మీకు అభ్యంతరం లేకపోతే మా ఇంట్లో ఉండి చదవొచ్చు'' అన్నాడు జకరయ్య

''మీకు ఇబ్బంది కలగచెయ్యడం నా కిష్టం లేదు మీ అభిమానం ఉంది! అంతేచాలు, అన్నాడు కాళిదాసు ఏకాంతంగా సుగుణతో మాట్లాడదాం అనుకున్నాడు కాళిదాసు కాని అది కుదురలేదు

కాలం మారిపోతోంది కాలంతోపాటు మనుష్యులూ మారాలి అనుకున్నాడతను తిరిగి వస్తూ రామాన్ని చదివించక తప్పేటట్టులేదు సీతారామయ్య ఇచ్చిన సలహాయే బాగుంది నాలుగేళ్లలో 'లా' పూర్తవుతుంది సీతారామయ్య కింద జూనియర్గా పెట్టవచ్చు తరవాత వాడి అదృష్టం అయితే ఈ నాలుగేళ్ళూ ఎలా చదివించడం అన్నది ప్రశ్న బసయితే ఎవరన్నా యిస్తారు కాని, తిండి కూడా ఎవరు పెడతారు? స్కాలర్ షిప్ దొరకుతే బాధ ఉండదు మర్నాడు ఊరు వెళ్లిపోయేడు కాళిదాసు రామం ఉండిపోయేడు

**(ఇంకా వుంది)**




ఆ వేళ ఆకాశవాణిలో విజిటర్స్ కార్నర్ ఖాళీ లేదు కారణం, సంగీతంలో ఉత్తీర్ణులైన అభ్యర్థులకు ఆడిషన్ టెస్టు జరుగుతుంది లయ, విద్వత్తు, విజ్ఞానం ఇవే టెస్టుకి అర్హమైన అంశాలైనా, వీటితోపాటుగా అందరూ డిప్లమో పొందినవారే!

అందరి ముఖాల్లోనూ అదోలాటి వుద్విగ్నత

వారిలో పాండురంగ కూడా వున్నాడు అతని మనసూ స్థిమితంగా లేదు "ఇందులో సెలక్టయి, అవకాశం వచ్చినప్పుడు ఇదే వుద్యోగంలో స్థిరపడాలనీ, అప్పుడుకానీ తను జీవితంలో నిలదొక్కుకునే స్థితి ఏర్పడదని " ఇలా సాగిపోతున్నాయి అతని ఆలోచనలు

ఇంతలో హుందాగా నడుచుకుంటూ వచ్చి స్టూడియో వైపు వెళ్ళబోతున్న ఒక వ్యక్తిని చూసి పాండురంగ అప్రతిభుడయ్యాడు

వేగంగా లేచి ఆయన దగ్గరకు వెళ్ళి "నమస్కారం మాస్టారూ!" అన్నాడు వినయంగా

ఆయన ఆగి ఒక్క క్షణం అతని ముఖంలోకి చూసి, "ఎక్కడో చూసిన జ్ఞాపకం ఓ, పాండురంగ కదూ!" అన్నారాయన మామూలుగా

"ఆడిషన్‌కి వచ్చాను మాస్టారూ! ఇంతలో మీరు కన్పించారు నాకు చాలా ఆనందంగా " అతని మాటలు పూర్తికాలేదు ఆయన 'వస్తా' అంటూ సౌంజ్ఞ చేస్తూ వెళ్ళిపోయారు

మల్లెపూవులాటి తెల్లని జరీ దోవతి, లాల్చీ, భుజాన ఉత్తరీయం, చేతివేళ్ళకు నాలుగు ఉంగరాలు, మొహంలో ఉట్టిపడే రాజసం, మణికట్టుకి బంగారు కంకణం, మూర్తీభవించిన సంగీత మూర్తిలా వున్నారు మహేశ్వరశర్మ ఆ రూపం ఎంతో కాలంనుంచి చూస్తూనే వున్నాడు పాండురంగ

ఆయనలో వున్న ఆ ఆకర్షణే. అతన్ని ఎన్నోసార్లు ఆయనచుట్టూ తిరిగేలా చేసింది

ఇంతకాలం గడిచినా ఆయన ముఖంలో తన పట్ల ఇది వరకు కనిపించిన నిరాసక్తత, అయిష్టత మళ్ళీ చూడటం వల్ల అతనిలో ఏదో బాధ పెల్లుబికింది

వచ్చి తన సీట్లో కూర్చున్నాడు ప్రక్కన కూర్చున్న యువకుడు "ఆయన మీకు తెలుసా?" అన్నాడు

"తెలుసు" అన్నాడు ముక్తసరిగా.

"అయితే మీ సెలక్షన్ గ్యారంటీ, అన్న మాట ఆయనే కదా మనకు జడ్జి" అన్నాడతను.

ఉలిక్కిపడ్డాడు పాండురంగ ఒంట్లో శక్తినంతా కృంగదీసినట్టుగా నెమ్మదిగా బైటకు అడుగులు వేశాడు

* * *

పండు వెన్నెల పిండారబోసినట్లుంది. పెరట్లో మంచం మీద మేను వాల్చాడు పాండురంగ ఉదయం జరిగిన సంఘటన్నుంచీ తేరుకోలేక పోతున్నాడతను

మహేశ్వర శర్మ గార్ని తలచుకోగానే

ఎనిమిది సంవత్సరాలు క్రితం తను సంగీతం నేర్చుకోవటం కోసం సంగీత కళాశాలలో చేరిన రోజులు కళ్ళముందు తిరిగాయి.

తమ సంగీతంతో శ్రోతల్ని మైమరపించి, ఏవో ఉన్నత లోకాలకు తీసుకు వెళ్ళి విహరింప చేసే మహత్తు కలిగిన సంగీత విద్వాంసుల్ని చూసి, తనూ ఒక సంగీత పండితుడు కావాలని, గళ మాధుర్యంతో సంగీత సరస్వతి కరుణా కటాక్ష వీక్షణాలతో పదిమందిలోనూ పేరు సంపాదించాలని తహ తహ లాడే వాడు అతను.

సంగీత మంటే వున్న ఇంట్రెస్టు వల్ల తండ్రికి సంగీతం నేర్చుకోవాలని వుందని విన్న వించు కొన్నాడు ఓ రోజు.

ఆయన వద్దన లేదు కానీ, సంగీతం నేర్చు కోవటమంటే కాలేజీకి వెళ్ళి రావటం కాదనీ, సంగీతం మీద ప్రత్యేక శ్రద్ధ, ఆసక్తి, ఓర్పు... ముఖ్యంగా ఆ తల్లి కరుణ, సాధన వుండాలన్నా రాయన.

నిజమేననిపించినా... అవన్నీ తనలో వున్నాయనే నిర్ణయానికి వచ్చి... ఆరు సంవత్స రాల డిప్లమో కోర్సులో చేరాడతను.

అతని లయజ్ఞానం, లయరాగం చూసి ఆనాడు మాస్టారు విస్తుపోయారు. నువ్వు తప్ప కుండా సంగీత విద్వాంసుడివి అవుతావోయి పాండురంగా అంటూ ఆశీర్వదించారుకూడా!

ఆధార షడ్జమం నుంచి స్థాయీ స్వర భేధాలు మెల్లగా గుండెల్లోనే భద్రపరచు కున్నాడు.

ఆ రోజుల్లోనే కలిగింది అతనికి మహేశ్వర శర్మగారితో పరిచయం. ఆయన అందరిలోనూ ఒకవిధమైన ప్రత్యేకత కలిగివుండేవారు.

ఆయన ప్రతివాడితోనూ మాట్లాడేవారు కాదు. ఆయన క్లాసుకి వస్తున్నారంటే ఆసక్తి పరులకు పరమానందంగానూ, మరికొందరికి కంటక ప్రాయింగానూ వుండేది.

వర్షం వచ్చినా... సూర్య తేజస్సు అధికంగా వున్నా, పరిసరాలు స్వచ్ఛంగా లేకపోయినా, ఆయన మనస్సు నిర్మలత కోల్పోయేది. ఇంక ఆ రోజు క్లాసు జరగదు. అందరికీ ఆయన క్లాసు చెప్పే రోజులు సంవత్సరంలో చాలా తక్కువగా వుండేవి.

మిగతా ఉపాధ్యాయులంతా గుసగుసగా చెప్పుకుని నవ్వుకునేవారు. కానీ బయట ప్రపంచంలో ఆయనకున్న సంగీత పరమైన గౌరవం, పెద్ద పెద్ద కచేరీలకు ఆహ్వానింప బడటం ఇవన్నీ పాండురంగకి అమిత ఆశ్చర్యంతో పాటు ఆయనపట్ల ఆకర్షణకూడా అధికం చేసింది.

ఆయన ముఖ వర్ఛస్సు చూస్తూ... ఆ గళ మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ ఒక్క నిముషం గడిపినా తన జీవితం ధన్యమైనట్టు భావించే వాడు అతను.

అదృష్టవశాత్తూ ఆ మరుసటి సంవత్సరం ఆయన అతని క్లాసులకి రావటం జరిగింది. ఆనందం పట్టలేకపోయాడతను.

సరిగమ పదనిస... సని దప మగరిస సప్త స్వరాల ఆకార సాధనలో ఆయనకున్న ప్రావీణ్యం, అది శిష్యులకు బోధించే తీరు పాండురంగకి ఎంతగానో సంతోషం కలిగించింది. ఆరోహణ అవరోహణ క్రమాన్ని అతి త్వరగా, అతి మధు రంగా నేర్చుకుని గురువుగారికి వివరించాడు.

"ఊ, బానే వుంది కానీ, అంత ఆరాటం పనికిరాదోయ్! ఇదీ సంగీత శాస్త్రం. దద్దోజనం కాదు" అన్న ఆయన మాటలకు చిన్నబుచ్చు కున్నా 'ఆయన క్లాసులే తక్కువ. కోపగించుకుని పాఠాలు వినకపోతే తనకే నష్టం' అనుకుని వూరుకున్నాడు.

కానీ మిగతా సంగీతోపాధ్యాయులంతా ఛాంధసుడు. అహంకారం ఆయనకు అలంకారమై పోయింది అనుకునేవారు. నిజానికి ఆయన ప్రవర్తన కూడా అలాగే వుండేది.

సరళీస్వరాలు ప్రారంభించిన కొద్ది రోజుల్లోనే లయ, తాళక్రమాల గురించి క్షుణ్ణంగా అర్థం చేసుకున్న పాండురంగ... మాయామాళవగౌళ రాగాన్ని ఆలాపించటానికి చేస్తున్న ప్రయత్నం చూసి మొదటిసారిగా మెచ్చుకోలుగా చూశారు గురువుగారు. అదే మహత్తరమైన ఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని కలిగించినట్టు భావించాడు అతను.

తర్వాత ఒక రోజు పాండురంగకి ఎక్కడ లేని ఆశ్చర్యాన్ని కలిగిస్తూ; "పాండురంగా, క్లాసు అయ్యాక ఒకసారి నా దగ్గరికి రావోయ్" అంటూ వెళ్ళిపోయాడు బైటికి.

అలాగే వెళ్ళాడు. అప్పుడేం మాట్లాడ కుండా, "సంధ్యవేళ ఒకసారి మా యింటికిరా. నీతో చిన్న మాట వుంది" అన్నారు.

ఎంత ఆలోచించినా కారణం అందటం లేదు అతని మనసుకి.

సూర్యుడు పశ్చిమాద్రికి జారిపోయాక ఆయన యింటివైపు అడుగులు వేశాడు అతను.

ధోవతి, ఉత్తరీయంతో వాలు కుర్చీలో విశ్రాంతి తీసుకుంటూ కనిపించారు మహేశ్వర శర్మ.

"నమస్కారం మాష్టారూ!" అంటూ ఆయన వారిస్తున్నా వినకుండా అరుగుమీద కూర్చున్నాడు.

"ఏం లేదు. పాఠాలు బాగా ప్రాక్టీసు చేస్తున్నావా ఇంటిదగ్గర. సాధన చాలా అవసరం పాండురంగా! అశ్రద్ధ చేయకు" అన్నారు.

ఆనందంతో మనసు పొంగింది అతనికి.

కొద్ది నిముషాల తర్వాత ఆయన అసలు విషయానికి వచ్చారు. "పాండురంగా, నాకో చిన్న సమస్య ఎదురయిందయ్యా! పరిష్కారానికి నీ చేయూత కావాలి. మీ సాంప్రదాయం, ప్రతిష్ట నాకు తెలిసిందే! నా మాట కాదనవనే నమ్మకంతో అడుగుతున్నాను" ఆయన కంఠంలో ఎన్నడూ వినిపించని కొత్త ధ్వని.

ఆతృత నణచుకుంటూ, "ఏమిటి మాష్టారూ! చెప్పండి" అన్నాడు.

"ఏం లేదు. మాకు ఒక్కగానొక్క ఆడపిల్ల. చాముండేశ్వరి. ఎంతో గారాబంగా పెరిగింది. పెద్దగా చదువుకోలేదు. యింటి దగ్గరే సంగీత పాఠాలు చెప్తున్నా. పెళ్ళీడు కొచ్చిన ఆడపిల్లని యింట్లో ఎంతకాలం అట్టే పెట్టుకుంటాం. మంచి సంబంధం చూసి పెళ్లి చేయాలని నా కోరిక" అంటూ ఆగారు ఒక్క నిముషం.

నరాలు బిగపట్టుకుని వింటున్నాడు పాండు రంగ.

ఆయన మళ్ళీ అన్నారు. "అమ్మాయి అందానికి గుణానికి లోపం లేదు. కాకపోతే చిన్న తనంలో పోలియో వచ్చింది. కాలు కాస్త ఎత్తి అడుగువేస్తుంది. నేను ఇచ్చే కట్నానికి ఆశపడి ఎవరైనా ఆమెను చేసుకున్నా...ఈ చిన్న మోరిక వల్ల తర్వాత అమ్మాయినేం బాధలు పెడతారోనని భయం. అందుకే ఆమెను ఆమెలా చూసే వ్యక్తి కోసం నా అన్వేషణ. ఆ మార్గంలో నువ్వే సరైనవాడివని నాకు తోచింది.

చూడు పాండురంగా! సహృదయుడిగా భావించి నిన్నిలా అర్థిస్తున్నాను. నీకు సంగీత మంటే ప్రాణం. నిన్ను...నన్ను మించిన సంగీత నిధిగా ప్రపంచానికి తెలియజేసే బాధ్యత నాది. ఏమంటావ్" అంటూ ఆగారు.

అయోమయంతో నోటమాట రాలేదు అతనికి. మెదడు మొద్దుబారినట్లు ఆలోచనలు స్థంభించాయి పాండురంగకి.

నెమ్మదిగా శక్తి కూడదీసుకుని నిటారుగా అయ్యాడు. ఏమిటిది? తను సంగీత పరమావధిని చేరుకోడానికి...గురువుగారి ప్రాపకం పొందటం కోసం ఒక కుంటిపిల్లనీ, మనసు లేని మనువునీ అంగీకరించటమా ?! అయినా గురువు శిష్యుణ్ణి కోరవలసిన కోరికేనా యిది! బొటనవ్రేలు తనకు గురుదక్షిణగా సమర్పించమన్న ద్రోణునికి... భక్తితో అర్పించిన ఏకలవ్యుని త్యాగంలో తనని చేయమన్నది ఎంత ?!

అయినా తన మనసందుకు అంగీకరించటం లేదే! ఆయన కోరిక స్వార్థంగా తోచటమే కాదు, తనకి ఏనాడో పెద్దలు నిర్ణయింపబడిన మేనరికం వుంది.

తన గురువుగారి కోరిక తీర్చలేకపోతున్నం దుకు ఒక ప్రక్క బాధ, మరో ప్రక్క సంధిగ్ధత.

ముఖం చూపించలేక, చేతులెత్తి నమస్క రిస్తూ, "క్షమించండి మాష్టారూ" అన్నాడు గాద్గదికంగా.

ఆయన అహం దెబ్బతింది. ముఖం వివర్ణమై అచ్చట నుంచి విసావిసా నడిచి వెళ్లి పోయారు లోపలికి.

ఇంక అక్కడ నిలవటం యిష్టం లేక బాధతో యింటి ముఖం పట్టాడు అతను.

* * *

ఆ సంఘటన జరిగిన తర్వాత నుంచీ ఆయన పాండురంగ పట్ల విముఖత సాధ్యమయినప్పుడల్లా ప్రదర్శించే వారు.

సంగీత సాధనే తన ధ్యేయంగా పెట్టుకున్న పాండురంగ ఆయన విముఖత మనసులో పెట్టుకోలేదు.

కాలం గడుస్తూంది. వేసవి శెలవులు గడిచి మళ్లీ కళాశాలలు తెరిచారు మహేశ్వర శర్మగారి కూతురు పెళ్లి యీ వేసవిలో కూడా జరగలేదని ఎవరో అనుకోగా విని కొద్దిగా బాధపడ్డాడు అతను.

పల్లవి అనుపల్లవి, చరణాల బోధనలు క్రమంగా పూర్తయ్యాయి.

ఆ తర్వాత కొద్ది కాలానికి సంగీతంలో డిప్లమో తీసుకున్నాడు పాండురంగ.

మహేశ్వర శర్మగారి ఆశీర్వచనాలు పొందలేక పోయినందుకు బాధపడ్డాడతను.

* * *

కాలేజీ శిక్షణ పూర్తయింతర్వాత చాలా రోజులు ఏం చేయాలో తోచలేదు అతనికి. ఏదో అసంతృప్తి. ఎందరో విద్వాంసుల సలహా, సహకారాలు పొందాలని తపన, జిజ్ఞాస.

అతని ఆసక్తి చూసి కాలేజీ అధ్యాపకులు రామానుజంగారు తనదగ్గర పాఠాలకు రమ్మనగానే ఆనందంతో అంగీకరించాడు.

కొద్ది రోజుల తర్వాత ఒక కచేరీలో గురువుగారితోపాటు అతనికి తన సంగీత పరిజ్ఞానాన్ని నిరూపించుకునే అవకాశం వచ్చింది.

ఆ మాత్రం దానికే పొంగిపోయాడు. కచేరీలో అందరూ గురువుగారినికాక తననే ప్రశంసిస్తుంటే ఆయనవైపు కృతజ్ఞతగా చూశాడు.

కానీ ఆయన వాటికి మురిసిపోలేదు. ఆ చప్పట్ల ధ్వనులు ఆయనలో కోపాన్ని, విసుగునీ కలిగించాయి.

లోకనైజమేమిటో అర్థంకాకుండా పోయిందని వాపోయాడు పాండురంగ.

అంతటితో అతనికి పాఠాలు చెప్పటం ఆగిపోయింది.

ఎంతో ఆలోచించి ఒక నిర్ణయం తీసుకుని.. మహేశ్వరశర్మగారివద్దనే శిక్షణ పొందాలని నిశ్చయించుకున్నాడు.

''అలాగే, దాందేముంది! మంచి రోజు చూసుకుని రావోయ్'' అన్నారాయన.

ఆనందం పట్టలేకపోయాడు. పూర్వపు విషయాలేవీ మనసులో దాచుకోలేదని సంతృప్తి పడ్డాడు.

## శృతి

మంచి రోజు చూసుకుని వెళ్ళిన పాండురంగకి ఆరోజే కాదు... మరు రోజూ ఆయన ఏవో ఒక అడ్డంకులు చెప్పటంవల్ల—

రెండేళ్ళు గడిచిపోయాయి. అతని ఆశ నిరాశగా మిగిలిపోయింది.

ఈ దేశంలో ఎవరైనా తన ప్రత్యేకతను తనకు తానుగా నిరూపించుకునే అవకాశాలు చాలా తక్కువగానూ... పేరు ప్రతిష్టలున్న ఎవరో ఒకరి ప్రాపకం లేనిదే ఆ మనిషిలోని ఏ కళా బైటికివచ్చే అవకాశాలులేవని గ్రహించాడు.

మహేశ్వర శర్మ గారిలా పేరు గడించాలని తహతహ లాడిన మనసు... మంచు గడ్డలా ఘనీభవించింది నిరాశతో!

* * *

ఆ తర్వాత కొద్ది రోజులనే ఆకాశవాణి నుండి కర్నాటక సంగీతంలో ఆడిషన్ టెస్టుకి పిలుపు రావటం జరిగింది.

ఆ సందర్భంగా మళ్లా ఇంతకాలానికి ఆయన దర్శన భాగ్యం లభించినందుకు ఆనందించాడు అతను.

అయినా ఆయనకు తన పట్ల మనసులో నిండి వున్న అకారణ ద్వేషం వల్ల... తన ప్రజ్ఞ సాటవాలకు విలువ వుండదని సెలక్టు కావటం జరగదని బైటకి వచ్చేశాడు.

రాత్రి ఎనిమిది గంటలైంది.

ఆలోచనలతో సతమతమవుతున్నపాండురంగకి మనసు పొరల్లో ఏదో కలవరం. స్థిరమైన నిర్ణయమేదో తీసుకోవాలని తపన మొదలైంది.

'తనకి సంగీతం ప్రాణం, దైవం. ఆడదాని ఒంపుసొంపులకే ప్రాధాన్యతనిచ్చే అల్పమైన మనస్సా తనది? కుంటైతేనేం గుడ్డి అయితేనేం, కాలిపోయాక బూడిదే ఏ శరీరమైనా! ఈ చిన్న విషయాన్ని తెలుసుకోలేకపోయాడు తను. దైవదత్తమైన కళను పొందటానికి ఈ మాత్రపు త్యాగమెందుకు చేయలేకపోయాడు.

గురువు గారికి క్షమాపణలు తెలుపుకుని, తన అంగీకారాన్ని తెలియజేయాలి. ఆయన శిక్షణలో సంగీత పరమావధిని చేరుకోవాలి. అంతే! అంతే!' అనుకున్నాడు.

ఇప్పుడతని మనసు ప్రశాంతంగా వుంది. లేచి ఆయన దగ్గరకి బయల్దేరబోతుండగా, 'మహేశ్వర శర్మగారు పిలుచుకు రమ్మన్నా'రంటూ పదేళ్ళ కుర్రాడు వచ్చాడు.

''రావోయ్, రా!'' ఆప్యాయంగా ఆహ్వానించటం చూసి నమ్మలేకపోయాడు.

అతని చేతులు పట్టుకుని కూర్చోబెట్టారు ఆయన.

''నా మీద కోపం పోలేదా పాండురంగా!''

''మాస్టారూ!'' అతని హృదయంలో కలవరం.

''పాండురంగా! మన్నించమని ఎలాఅడగాలో అర్థం కావటంలేదు. నా మాట కాదన్నావనే కోపంతో నిన్ను నిర్లక్ష్యం చేశాను. అహంకారంతో నా చుట్టూ తిప్పించుకున్నాను.

ఈ రోజు ఆకాశవాణిలో నువ్వు కనిపించినప్పుడు జరిగిపోయిన సంఘటనలన్నీ జ్ఞాపకం తెచ్చుకున్నాను. నా తప్పు దిద్దుకునే అవకాశం దొరికిందని ఆశించాను. కానీ ఇంటర్వ్యూకి హాజరు కాకుండా... నా అహాన్ని దెబ్బతీసి నామీద విజయం సాధించావు.

విద్యాభిక్ష పెట్టమని వచ్చిన మనిషిని స్వంత బిడ్డకన్నా ఎక్కువగా ఆదరించాల్సిన నేను అలక్ష్యం చేశాను. అంతకంటే పాపం మరొకటి ఉంటుందా?!''

వెంటనే పాండురంగ అడ్డుపడ్డాడాయన మాటలకి. ''మాస్టారూ! అంత మాట అనకండి. ఇందులో మీ తప్పేంలేదు. మీరు కోరిన చిన్నకోరికను అంగీకరించకపోవటం నాదే పొరపాటు. ఇప్పుడు నా అంగీకారాన్ని సంతోషంగా తెలపటానికే వచ్చాను మాస్టారు. దయతో ఆశీర్వదించండి'' అన్నాడతను.

ఆయన చిరునవ్వు నవ్వి, ''కృతజ్ఞుణ్ణి పాండురంగా! అమ్మాయి ఈ పెళ్ళిచూపులూ... అవీ... వీటికి విసిగిపోయి, పెళ్ళి లేకపోతేనేం అనే స్థితికి వచ్చేసింది. ఆమె నిర్ణయాన్ని నేను కాదనలేను. ఆ విషయంతో ముడిపెట్టకు. సంగీతం పట్ల నీ శ్రద్ధ, ఆసక్తి నాకు తెలుసు. నిన్ను తప్పకుండా గొప్ప విద్వాంసుణ్ణి చేసే బాధ్యత నాది. సరేనా!'' ఆయన స్వరంలో వాత్సల్యం తొణికిసలాడింది.

పాండురంగ హృదయం చలించిపోయింది ఆయన మాటలకి. సాక్షాత్తు ఆ మహేశ్వరుని కటాక్షమే పొందిన అనుభూతితో ఆయన రెండు చేతులు పట్టుకుని భక్తితో కళ్ళకు అద్దుకున్నాడు.



## ఉన్నతులు

సిరిసంపదల
బెల్లం చుట్టూ
ఈగలు వాలినట్టు
ముసిరిన వాళ్ళలో
చాలామంది
హితులు సన్నిహితులు
ఆత్మీయులు
శ్రేయోభిలాషులు
కారు.
'(బతకనేర్చినవాళ్ళు)'

—మాధవరపు కృష్ణ

# హైదరాబాదు నోట్‌బుక్

## కాంతి వైద్యులు కల్లూరి సీతారామస్వామిగారు :

ధ్వని, కాంతి ఈ జగత్తుకు మూలమని ప్రపంచంలోని తత్త్వవేత్తలందరూ గ్రహించారు, విశ్వసించారు. ఈ విశ్వాసమే మంత్ర తంత్రాలకు క్రమంగా ఆధారమైంది. మంత్ర తంత్రాలు దుష్టబుద్ధుల వశమై అభిచారాదులకు దిగజారాయి. సద్బుద్ధితో సాధనచేసినవారు అణిమాద్యష్ట సిద్ధులను సాధించి మానవ జాతికి ఉపకారం చేశారు; చేస్తున్నారు, ఇది ఆధ్యాత్మిక రీతి. ఆధిభౌతికంగా శబ్ద కాంతులను భౌతికశాస్త్రజ్ఞులు పరిశీలించి లోకోపకారకాలైన పెక్కు సాధనాలు కనిపెట్టారు. ఈ ఆధ్యాత్మిక, భౌతికతత్త్వాల సమ్మేళనమే కాస్మిక్ రేస్ థెరపీ—విశ్వకిరణ చికిత్స. దీనినే టెలీథెరపీ, నవరత్న థెరపీ అని కూడా వ్యవహరిస్తారు. ఈ చికిత్సలో రోగిని చికిత్సకుడు చూడనక్కరలేదు రోగికి సంబంధించిన నఖకేశాదులేవైనా చాలు. ఛాయాచిత్రం ఉంటే బాగు. దాని పరిశీలనతో వ్యాధి మూల కారణం — వ్యాధి స్థానం తెలుసుకుంటారు. ఈ విశ్వకిరణ చికిత్సకుల వద్ద విద్యుత్ పేటిక వంటిది ఉంటుంది. దీనిని ఎలెక్ట్రో మాగ్నెటిక్ బాక్స్ అంటారు. దీనిలో రోగి ఛాయాచిత్రం — ఫొటో — పెడతారు. దీన్ని మాగ్నెటిక్ డౌసింగ్ అంటారు. దానితో ఆ ఛాయాచిత్రంపై కాస్మిక్ రేస్ ప్రసరింపజేస్తారు. ఇలాగే నవరత్నాల కాంతినీ ప్రసరింపజేస్తారు. నవరత్నాలు నవగ్రహాలకు సంకేతం. రోగ నిదానం తెలిసిన తర్వాత ఫొటోపై విశ్వకిరణ, నవరత్న కిరణ ప్రసారంవల్ల రోగివ్యాధి నయమవుతుంది. రోగి దగ్గర వుంటే, నవరత్న కాంతి ప్రసారిత ఔషధాలు ఇస్తారు. ఇవి హోమియోపతి మాత్రలలాగ ఉంటాయి. ఈ పద్ధతిని గొప్ప జ్యోతిష్కులు, జ్ఞానజ్యోతి, రాజ్యరత్న బిరుదాంకితుడు శ్రీ బి. భట్టాచార్య కనిపెట్టారు. ఆయన బరోడాలో ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరుగా ఉండేవారు. ప్రస్తుతం ఆయన కుమారుడు శ్రీ ఎ. కె. భట్టాచార్య ఈ చికిత్సకు భాష్యాచార్యుడై చికిత్స చేస్తున్నారు. భారత దేశంలో ఈ చికిత్స చేస్తున్నవారు దాదాపు 50 మంది, విదేశాలలో ఐదారుగురు ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో వున్న వారిలో డాక్టరు కల్లూరి సీతారామస్వామి ఒకరు. డాక్టర్ స్వామి పరమ శాంతులు. చూడగానే "హమ్మయ్య ఇక భయం లేదు. జబ్బు నయమవుతుంది" అనే విశ్వాసం రోగులకు కలిగించే ఉదాత్త వ్యక్తిత్వం కలవారు. ఆయనకు అలోపతి వైద్యులు కావాలనేది చిన్ననాటి నుంచి వున్న కోరిక. తదనుగుణంగా ఇంటర్ మీడియటులో జువాలజీ, ఫిజిక్స్, కెమిస్ట్రీ గ్రూప్ తీసుకున్నారు. అనివార్య కారణాల వల్ల ఎం. బి. బి. ఎస్. లో చేరలేకపోయారు. కాని ప్రవృత్తి వైద్యశాస్త్రం గనుక శాస్త్రజ్ఞుల వద్ద వైద్య గ్రంథాలు చదువడం మానలేదు. 1949 లో రైల్వేలో గుమాస్తాగా చేరారు. భౌతికంగా ఏదో భాము కొందామనే దురాశలేదు. ప్రశాంతంగా జీవితం గడుపుతూ ఇరుగు పొరుగు వారికి తోడ్పడుదామనే లక్ష్యం గలవారు గనుక ప్రమోషన్లు ఆశించక 1983 లో గుమాస్తాగానే రిటయిరయ్యారు. కాని, ఆయనలో నిత్య జాగరితుడైన వైద్యుడు మాత్రం రిటయిరు కాలేదు. 1949 నుంచే హోమియోపతిని అధ్యయనం చేసి ఆచరణలో పెట్టడం వల్ల, క్రమంగా కాస్మిక్ రేస్ థెరపీలో నిష్ణాతులయ్యారు. ఈ థెరపీని ఆయన చేపట్టడమూ విచిత్రంగా జరిగింది. 1975 లో కార్యాంతరవశాత్తు బొంబాయికి వెళ్లారు. అక్కడ ప్రభుదాస్ మెహతా అనే



ప్రముఖ పారిశ్రామికవేత్తతో పరిచయ మయింది. ఆయన వల్ల ఈ నూతన చికిత్సా విధానం తెలిసింది. అప్పటి నుంచి దీనిని, జెంథెరపీని చేపట్టారు. రోజూ కుప్పలు తెప్పలుగా ఫోటోలు వచ్చిపడుతుంటాయి. నాకు విశేష ధనార్జన చేయాలనే ఆశ లేదు. పదిమంది వైద్యులు వదలిపెట్టిన వ్యాధులను నయం చేయడం నాకు సరదా. కేన్సర్‌ను ముందుగానే చెప్పగలను. పక్షవాతం, చర్మ రోగాలు వంటి దీర్ఘ వ్యాధులు దీనివల్ల నయమవుతున్నవి. ఇది పూర్తిగా మానసిక విద్య. మనస్సును లగ్నం చేయాలి. అంతా దైవానుగ్రహం—అంటారు ఆయన. ఈ పద్ధతిలో మీకు రోగ నిదానం ఎలా తెలుస్తుంది? —అనడిగాను. రోగి ఫొటోను ఎలెక్ట్రో మేగ్నెటిక్ బాక్సు ఎదుట పెట్టి నిలబడితే ఏదో ఆవహించినట్లు వుంటుంది. నా ప్రమేయం, నా ప్రజ్ఞా ఏవీ లేవు. నా ద్వారా ఇది జరుగుతున్నది. అంతా దైవలీల. అంతే. నేనొక సాధనం మాత్రమే — అన్నారు ఆయన. ఈ చికిత్స మనకు కొత్తది కాదు; సూర్యనమస్కారాలు, చంద్రనమస్కారాలు మనకు అనాదిగా ఉన్నవే. అవి కాంతిచికిత్సలే. వాటి శుభ పరిపాకమే ఈ కాస్మిక్ రేస్ థెరపీ—అన్నారు. ఈ చికిత్సలో రోగ నిదానానికి తిరుగులేదంటారు ఆయన. ఇదే దీని ప్రత్యేకత. ఇతర పద్ధతులలో అన్నీ ఎక్స్‌పెరిమెంట్లే—అంటూ ఒక సంఘటన చెప్పారు. శ్రీ చరణ్‌సింగ్ దేశీయాంగమంత్రిగా ఉన్నప్పుడు (1978) జబ్బుపడ్డారు. ఎందరో ఏవో చికిత్సలు చేశారు. నేను పత్రికల్లో పడిన ఆయన ఫోటోను నా పద్ధతిలో పరిశీలించి దోషం కనిపెట్టి ఆయనకు వ్రాశాను—అన్నారు ఆయన. మీ చికిత్సలో శస్త్ర వైద్యం వుందా? — అనడిగాను. ఆయన నవ్వుతూ, "అసమర్థుడయిన వైద్యుడు ఆఖరుకు ఆశ్రయించేదే శస్త్రచికిత్స. ఔషధాలతో చికిత్స చేయక కోతకు దిగుతాడు" అనే ఎల్. జి. జోన్స్ మాటను ఉదాహరించారు, మా చికిత్స సర్జరీకి ఛాన్స్ ఇవ్వదు అంటూ. తమ చికిత్సలోని ప్రత్యేకతను రకరకాలుగా వివరిస్తూ, నేర్పరి అయిన వైద్యుడు ముఖ పరిశీలనతో గ్రహిస్తాడు. మధ్యరకం వైద్యుడు ప్రశ్నించి తెలుసుకుంటాడు. సామాన్య వైద్యుడు నాడి మొదలయినవి చూచి తెలుసుకుంటాడు—అనే చాంగ్ చుంగ్ డింగ్ సూక్తిని చెప్పారు. డాక్టర్ స్వామి మానవుడే దేవుడని నమ్మేవారు. మంచి గుణాలుగల మానవుడే దేవుడు. ఇలాటివారు ప్రతి యుగంలోను ఉన్నారు—అనేది ఆయన విశ్వాసం. బెంగాల్‌లో యీ వైద్యం చాలా ప్రచారంలో వుంది. నిజానికి ఏ పద్ధతి అయితేనేమి? సామాన్య మానవునికి మానింది మందు. వ్యాధిని మాన్పేవాడే వైద్యుడు. అందులోను మానవత్వమే మానదండంగా చికిత్స చేసే డాక్టర్ స్వామి వంటివారు నారాయణ స్వరూపులైన ధన్వంతరులు. డాక్టర్ స్వామి నివాసం: 12–11–3, ఉప్పర బస్తి, నామాలగుండు, 500361.

## ఉపశ్రుతి :

నా గేయాలకు జనాదరణ రావడానికి ఏదైనా చిట్కా చెప్పండి సార్ — అని అడిగాడు నన్నొక చోటా కవి. నా పక్కనేవున్న మిత్రుడు రిటైర్డ్ అకౌంట్స్ ఆఫీసర్ శ్రీ నల్లాన్ చక్రవర్తి శేషాచార్యులు అన్నారు ఇలా :

ముందు రైటరుగా నీకొక పేరొచ్చిందో
డోకొచ్చే గేయం రాసినా
జోకవుతుందోయ్ జనానికి.
ఎదవ గేయమైనా ఎంత హేయమైనా
ఎద కదిలించిందంటారు —

— తిరుమల రామచంద్ర ★

# ఆచార్య రాయప్రోలు అస్తమయం



ప్రముఖ తెలుగు సాహితీ వేత్త ఆచార్య రాయప్రోలు సుబ్బారావు (92)గారు సికిందరాబాదులో జూన్ 30వ తేది ఉదయం దివంగతు లయ్యారు.

తెలుగు అధ్యాపక వృత్తికే కీర్తి తెచ్చిన శ్రీ రాయప్రోలు వారు ఉస్మానియా, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో ఆచార్యపదవులని అధిష్టించి, వరంగల్‌లో ప్రిన్సిపాలుగా పని చేశారు. పదవీ విరమణ అనంతరం హైదరాబాదులోనే ఉండి తెలుగు ఉన్నతికి ఎనలేని కృషి చేశారు.

శ్రీ రాయప్రోలు వారు తమ 18వ ఏటనే కవితా రచన చేయడం ప్రారంభించారు. వీరు తమ కావ్యాల్లో తెలుగుజాతి ఔన్నత్యాన్ని, తెలుగు భాషా మాధుర్యాన్ని, ఆంధ్రుల పౌరుషాన్ని ఎలుగెత్తి చాటారు. వీరు గొప్ప దేశభక్తి పరాయణులు. తెలుగు గడ్డపై వీరు రాసిన గీతం "ఏదేశ మేగినా......" తెలియని వారు ఉండరు. శ్రీ రాయప్రోలు వారి రచనల్లో "అమలిన ప్రేమ తత్వం" స్త్రీ పట్ల, స్త్రీ జాతిపట్ల ఆయనకి గల గౌరవాన్ని చాటి చెపుతుంది.

శ్రీ రాయప్రోలు వారు భావ కవితా పితామహులు. ఆయన తాను నమ్మికొన్న కొత్త దారిన నడిచారు. ఆయన పోకడను మెచ్చిన వారు, మెచ్చనివారు ఉన్నారు. కాని పొగడ్తలను విమర్శలను ఆయన సమదృష్టితో చూచారు. ఆయనకు చావంటే భయం లేదు. పునర్జన్మపై విశ్వాసం ఉంది.

తెలుగు సాహిత్య చరిత్రలోని మహా కవులలో శ్రీ రాయప్రోలు వారి పేరు చిరస్థాయిగా నిలిచి పోతుంది. ఆయన నిష్క్రమణ తెలుగు భాషకి, జాతికి తీరని నష్టం 

## ఉత్తరాలు

[ 4వ పేజీ తరువాయి]

### కథలు

25-5-84 ఆంధ్రపత్రికలో ప్రచురించిన కథ "మిసెస్ వర్మ" చదివేను. చదువుతున్నంతసేపూ, అది కథకాదేమో వాస్తవాన్ని లావణ్యగారు యథాతథంగా వ్రాసేరు అని అనిపించింది. ఎందుకంటే హైదరాబాద్ ఎయిర్ పోర్టు—గాంధీ హాస్పిటలు అని ప్రస్తావించేరు. అయితే డాక్టర్ల పేర్లు, కథానాయిక పేరు కేవలం కథకోసం అయి ఉండాలి.

పోతే, చిన్న అనుమానం! అంతటి గాంధీ హాస్పిటల్లో సుజాత మెమోరియల్ ఆస్పత్రి (ఉన్నదో లేదో కాని?) లోని డాక్టర్ ఫ్రాంక్‌లే తీసికొన్న "సక్సెస్‌ఫుల్ రిస్క్" తీసుకోలేక పోయినారా ? అన్న సందేహం కూడాను.

శ్రీమతి కొడవంటి సావిత్రి, మూసాపేట.

## గమనిక

13-7-84 సంచికలోని 63వ పేజీలో పడిన 'శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం' వ్యాసం, చిత్రాలు పంపినవారు డా॥ గుమ్మనూరు రమేష్ బాబు అని పాఠకులు గమనించ కోరుతున్నాము

— సం

## అచ్చు పొరపాటు

15-6-84 వ తేదీ పత్రికలో ఆడ లేక మగ శిశువు జన్మించటానికి స్త్రీ కారణం కాదు శీర్షికలో 26 వ పేజీ- 2 వ కాలమ్- 21 వ లైన్‌లో పురుషునితో ( X Y ) లైంగికస్థితి బదులుగా ( X X ) గా పడినది.

వి జోగారావు నాయుడు, పార్వతీపురం.

★ అచ్చుపొరపాటుకి చింతిస్తున్నాము.—సం.

*Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor : S Radhakrishna*

# అసలైన తెలుపు ఏమిటో... ప్రపంచానికి చూపండి

# డెట్



## ఉత్తమం... ఉత్తమం... తెలుపులో సర్వోత్తమం!

డెట్ మీకు అందిస్తుంది ఎంతో ఎక్కువ. దీని క్రొత్త రేపర్ ఎంతో అందమైనది. ఆకర్షణీయమైనది. తీసి చూడండి, లోపల మరో ఆశ్చర్యం — ఉల్లాసకరమైన మనమోహక పరిమళం. అంతేకాదు, డెట్‌లో నిండి వున్నది ఎంతో ఎక్కువ తెలుపు శక్తి. మరి రండి, డెట్ ప్రపంచంలో అడుగిడండి. స్వయంగా చూడండి, అందరికీ చూపండి. డెట్ తెలుపు...అసలైన తెలుపు!




Shilpi DM 9A/84 Tel

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

# అమృతాంజన్ లిమిటెడ్

## 90 సంవత్సరాల పైగా గృహౌషధాలు తయారుచేస్తున్నారు!

- **అమృతాంజనం బాధానివారిణి**
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- **అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్**
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- **అమృతాంజన్ డెర్మల్ ఆయింట్ మెంట్**
  తామర, తీట, గజ్జి వగైరాలకు.
- **అమృతాంజన్ పిటోమిక్స్**
  దగ్గునుంచి వెంటనే ఉపశమనమునకు కాఫ్ మిక్చర్.
- **శ్వాస్ మింట్ బిళ్లలు**
  నోటినీ గొంతుకునీ శుభ్రంగా ఉంచేందుకు

....ఇండియాలోను, ఇతర దేశాలలోను పేరుపొందినది.

- **అమృతాంజన్ ఇన్‌హేలర్**
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు.
- **అనోలియమ్—కోల్డ్ రబ్**
  దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.
- **శాలోఫెన్—బాధానివారిణి మాత్రలు**
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు.
- **అమృతాంజన్ కాస్టర్ ఆయిల్**
  శుద్ధిచేసిన, వాసనలేని స్వచ్ఛమైన ఆముదం.



అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు-4
















